సంపుటి : 2 సంచిక : 6

# చతుర

జూలై 1979

## ఈ నెల సమగ్ర నవల

ఆవిడ సుప్రసిద్ధ రచయిత్రి. పెళ్ళీడు కూతురు ఉన్నా అందం, ఆకర్షణ సడలని నడి వయసు రూపసి. చీకూ చింతా లేని జీవితం గడుపు తున్న ఆమె జీవితంలో పాత పరిచయస్తులు ప్రవేశించి జీవిత గమనాన్నీ, దృక్పథాన్నీ కూడా పూర్తిగా మార్చేశారు. వ్యక్తిలోని అందం, రచయిత్రి లోని ఆకర్షణ ఆమెను ఉన్నత పదవులలోకి సునాయాసంగా అధిరోహింప జేశాయి. అయితే ఆ నూతన జీవితంలో ఆమెకు ఎదురయిన వ్యక్తులు, మహోన్నత స్థానాల్లోని మహామహులు ఎలాంటివారనే ప్రశ్న వేసుకున్నపుడు వచ్చిన సమాధానం/

# కుక్కలు

అంత హీనంగా అనిపింపజేసిన ఆ అనుభవాలేమిటి ? ఆ అధికార జీవితం ఆమెను ఏ దిశగా నడిపించి ఎక్కడ వదిలింది ? ఈ విషయా లన్నింటినీ ఆసక్తికరంగా వర్ణించింది సుప్రసిద్ధ రచయిత్రి.

## కమలాదాస్

ఆంగ్లంలో సుప్రసిద్ధమై అనేక ముద్రణలు పొంది సంచలనం తెచ్చిన నవల 'ఆల్ఫబెట్ ఆఫ్ లస్ట్'కు శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యాం అనువాదం ఈనెల 'చతుర' సమగ్ర నవల 'కుక్కలు'.

## ఈనెల ముఖ చిత్రం

'కుక్కలు' నవలలోని ప్రధాన పాత్ర మానసి జీవన చిత్రానికి చిత్రకారుడు ప్రభాకర్ (సూర్య) చేసిన రూపకల్పన.

## రెండవ కవరు

'నోట్లో వేలేసుకుని చీకటం లేదు. ఈ విచిత్ర ప్రపంచాన్ని చూసి ఆశ్చర్యపోతున్నాను' అంటోంది పాప.

## మూడవ కవరు

'ఇప్పటికి ఈ ప్రయాణం సమాంతరమేగాని, ఎప్పటికైనా ఎడంకాక తప్పదు' అంటూ ప్రయాణికుల్ని సదా ఆలస్యంగా అందుకునే జీవితపు రైలు బళ్ళు.

* * *

ప్రచురణార్థం పంపే నవలలు 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేవిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపటం మంచిది. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి. ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడతాయి.

చతుర

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్-500 004

# స్వేచ్ఛ

అంబరీషడుగారిల్లు కళకళలాడిపోతోంది. కాగితం పువ్వుల తోరణాలు రెపరెపలాడుతున్నాయి.

పెళ్ళయి ఇరవయ్యయిదేళ్ళు పూర్తయిన సందర్భంగా అంబరీషడుగారు తన అంతస్థుకు తగ్గట్టు పెద్ద ఏర్పాటుచేశారు. కంట్రాక్టరుగా రెండు చేతులా సంపాదించిన డబ్బుతో ఇనప్పెట్టెని నిత్య గర్భిణిగా ఉంచగలిగాడు. కాని కాంతమ్మగారి గయ్యాళితనానికి కళ్ళెం వెయ్యలేకపోయాడు.

టెర్లిన్ సూట్లు, పట్టుచీరలతో చుట్టాలూ, స్నేహితులూ విందుకువచ్చారు. అందరినీ హుషారుగా పలకరించాడు.

విందు పూర్తయింది. ఎవరి దోవన వాళ్ళు వెళ్లిపోసాగారు. అంబరీషడిని అతి జాగ్రత్తగా గమనిస్తూ, కళ్ళతోనే బెదిరిస్తూ, అతణ్ని కంట్రోలు చేస్తూ అలిసిపోయిన కాంతమ్మగారి భారీ శరీరం పందిరి మంచాన్ని ఆశ్రయించింది. భార్య లోపలికి వెళ్ళటం చూసి అంబరీషడు ఓ కుర్చీలో కూలబడి మోకాళ్ళమీద తల పెట్టుకొని అమాంతంగా వెక్కి వెక్కి ఏడవసాగాడు. అద్ది చూసి "అదేమిటయ్యా! శుభమా అని సంతోషంగా పండగ చేసుకొని అలా ఏడుస్తావేమిటి?" అంటూ మందలించాడు అంబరీషడి పార్టనర్.

అతి కష్టంమీద దుఃఖాన్ని దిగమింగుకొని తల పైకెత్తి "ఇరవయ్యేళ్ళ క్రితం నేను చేసిన ఓ పెద్ద తప్పుడు పనివల్ల ఇప్పటికీ నాకు స్వేచ్ఛ లేకుండా పోయింది" అన్నాడు అంబరీషడు.

"ఇప్పుడు నీకు స్వేచ్ఛకేం తక్కువ?" అన్నాడు పార్టనర్.

"ఇంకా ఏం తక్కువ అని అడుగుతున్నావ్? కాంతాన్ని పెళ్ళిచేసుకున్న అయిదు సంవత్సరాలకే దాని గయ్యాళితనంతో విసిగిపోయాను. ఇంక భరించలేక అప్పట్లో ఓ సారి దాన్ని చంపేద్దామనుకున్నాను. అలాచేస్తే కనీసం ఇరవయ్యేళ్ళు శిక్ష పడుతుందని ఎవరో చెబితే భయపడి ఊరుకున్నాను. అప్పుడే నేనాపని చేసుంటే ఈపాటికి జైలునుంచి విడుదలైనా ఇకనుంచేనా దాని పోరు లేకుండా ఉండేది కదా!" అంటూ మళ్ళీ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు అంబరీషడు.



—అహీంద్రణి

# గ్లాసు-గ్లాసు

ఎండలు మండిపోతున్నాయ్. ఆఫీసులో వేసవి ఏర్పాట్లు హడావుడిగా జరుగు తున్నాయి. కొత్త గాజుగ్లాసులు పుచ్చుకొని ప్యూను అందరికీ పంచుతూ సంతకాలు పెట్టించుకుంటున్నాడు.

రంగుల 'పువ్వుల గ్లాసులు సూపర్ వైజర్లకి, సాదా గ్లాసులు గుమస్తాలకి అని



విశదమయ్యాక గుమస్తాలందరికీ ఒక్కసారి కోపమొచ్చింది.

వారిలో నారాయుడు ముందుకొచ్చి సూపర్‌వైజర్ల దగ్గరకెళ్ళి "అయ్యా! మీరూ, మేమూ తాగేవి మంచినీళ్ళే! మీకూ మాకూ తేడా ఉద్యోగరీత్యా వుందేమో కాని మంచినీళ్ళు తాగే గ్లాసుల్లో ఎందుకూ?" అన్నాడు కాస్త వుద్రేకంగా.

దానికి సదరు సూపర్‌వైజర్లు నొచ్చుకుని "మాకేమీ తెలీదు. మేం పువ్వుల కోసం అడగలేదు. కావాలంటే మా గ్లాసులు మీరు తీసేసుకొని వాడుకోండి" అన్నారు.

కాని దానికి వాళ్ళు ఒప్పుకోలేదు

ఆఫీసు మొత్తానికి గ్లాసులు కొనుగోలు చేసిన సూపరెంటెండెంట్ గారి పీకకి చుట్టుకుందీ విషయం.

"ఇది ఎన్నాళ్ళుగానో వస్తున్న ఆచారం. దీన్ని మార్చటం అంత మంచిది కాదు" అని హితవు చెప్పబోయారు ఆయన.

"అది దురాచారం" అంటూ మొత్తం అందరూ కలసి ఆఫీసర్‌గార్ని కలుసుకున్నారు. వాదించారు, చర్చించారు. గ్లాసులు తీసుకోమని ప్రకటించి వచ్చేశారు.

* * *

స్నానం చేసి విశ్రాంతిగా మంచంమీద పడుకున్నాడు నారాయుడు. వాళ్ళావిడ తళ తళ మెరిసే స్టీలు సామానుతో యింట్లోకి అడుగు పెట్టింది.

"ఇదిగోనండీ! స్టీలు బిందె.ఇవిగో పిల్లలకీ, మీకూ, నాకూ గ్లాసులు, ఇంకా ఒక చెంబు, కంచం."

గ్లాసుల కట్టలో ఒక సత్తుగ్లాసు చూసి నారాయుడు విసుగ్గా ముఖం పెట్టి "ఇదెందుకూ?" అన్నాడు.

"రోజూ మన రత్తాలు కాఫీ కాఫీ అంటుంది. మన గ్లాసులతో యివ్వాల్సి వస్తోందని ఒక సత్తుగ్లాసు కొని పడేశాను" అంది.

ఆఫీసులో ఐ. ఏ. ఎస్. ఆఫీసరుతో అరగంట వాదించిన నారాయుడు అయిదో క్లాసు ప్యాసవని భార్యముందు అరనిమిషం వాదించలేక మౌనంగా ఉండిపోయాడు.

- ఇంద్రగంటి జానకీబాల





# లాఘవం

క్లబ్బులో తన హస్తలాఘవం గురించి తోటి వాళ్ళముందు గొప్పలు చెప్పుకుంటున్నాడు ఓ పెద్ద మనిషి.

"పట్టపగలు అందరూ చూస్తుండగానే ఏ షాపులోకైనా వెళ్ళి ఎలాంటి వస్తువు నయినా కొట్టువాడి కళ్ళల్లో కారం కొట్టి చాకచక్యంగా తీసుకు రాగలను" అని ఇంకా ఏవేవో కబుర్లు చెప్తున్నాడు. అతని గప్పాలు ఉత్సాహంగా వింటున్న జనం లోంచి ఓ కళ్ళజోడు ఆసామి ముందుకు వచ్చి—

"మీరు క్లబ్బు ఎదురుగా కనిపించే నగల షాపులోకి వెళ్ళి విలువైన నక్లెసు తీసుకు రాగలరా?" అన్నాడు.

"ఓ తప్పకుండా!" అన్నాడు కబుర్ల పెద్ద మనిషి.

"అయితే ఇప్పుడే వెళ్ళి మా కళ్ళెదుటే తీసుకురండి చూద్దాం?" అన్నాడు కళ్ళజోడు ఆసామి.

"అబ్బే ... అలా ఊరికే కబుర్లు చెప్తే లాభం లేదు. వంద వంద పందెం కట్టండి...అప్పుడు మీరు చెప్పిన ట్లు చేస్తా!" అన్నాడు పెద్దమనిషి.

"సరే ఖాయం" అన్నాడు ఆసామి.

పందెం కలిపారు. కళ్ళజోడు ఆసామికి ఉత్సాహంగా వుంది ఎలాగూ ఎదుటి వాడు ఓడిపోతాడని. ఆ పెద్ద మనిషి కళ్ళజోడు ఆసామిని వెంటబెట్టుకు వెళ్ళి నగల దుకాణానికి కాస్త దూరంలో నిలబెట్టి మీరు ఇక్కడే నిలబడి చూస్తూ వుండండి.నేను వెళ్ళి నక్లెసుకొట్టుకొస్తాను" అని పెద్ద మనిషి నగల షాపుకెళ్ళాడు. కౌంటర్లో వున్న గుమస్తాని ఏదో అడిగాడు. అతను బీర్వాలో వెతకటం సాగించాడు. ఈ సమయంలో పెద్ద మనిషి తనకు నచ్చిన విలువైన నక్లెసు తీసుకుని జేబులో వేసుకుని ఇవతలకి వచ్చాడు.

"చూశారా ... నా గొప్పదనం విలువైన నక్లెసు తెచ్చాను. పందెం నేనే గెల్చాను" అన్నాడు.

"నిజంగా నువ్వు గొప్ప వాడివే... కానీ, పాపం నిన్ను అరెస్టు చేయవలసి




వస్తున్నందుకు విచారిస్తున్నాను. నీలాంటి చిల్లర దొంగల్ని పట్టుకునేందుకు కొత్తగా నియమించబడ్డ పోలీసు ఆఫీసర్ని నేను. పద" అన్నాడు కళ్ళజోడు ఆసామి.

పెద్ద మనిషి చిర్నవ్వు నవ్వి "కంగారుపడకండి ... మీరు చిల్లర దొంగల్ని మాత్రమే పట్టుకుని అరెస్టు చేయండి. నా జోలికి మాత్రం రాకండి. ఎందుకంటే నేను ఆ నగల షాపు ప్రొప్రయిటర్ని" అన్నాడు.

—రమణ

# దంతం

ప్రలోభరావు కొడుకు ఆనందరావు అమెరికాలో డాక్టరు. ఎన్నోసార్లు తండ్రిని అమెరికా వచ్చి వెళ్ళమని అడిగాడు. కానీ ప్రలోభరావుకి తీరుబడి కాలేదు. ఓసారి ఇండియా వచ్చినపుడు పట్టుపట్టి తండ్రిని బయల్దేర దీశాడు ఆనందరావు. మొదటి సారిగా విమానమెక్కాడు ప్రలోభరావు.

అమెరికాలో తండ్రికి చూపించగలిగిన విశేషాలన్నీ నెల రోజులపాటు తిప్పి చూపించాడు ఆనందరావు. కొడుక్కి సొంత కారూ, పెద్ద యిల్లూ, ఇంగ్లీషు మాట్లాడే పిల్లలూ, దొర్సాని భార్యా వుండటం— అవన్నీ తను స్వయంగా చూడటం ప్రలోభరావుకి ఆనందం కలిగించింది.

ఓ రోజు రాత్రి క్లబ్బులో డిన్నర్ పెట్టించాడు ఆనందరావు. డాన్సులు చూస్తూ, తింటూ స్వర్గంలో విహరిస్తున్న ప్రలోభరావు హఠాత్తుగా గావుకేక పెట్టాడు. ఏమిటేమిటన్నాడు ఆనందరావు కంగారుగా. నోరు తెరిచాడు జవాబుగా ఆయన. బిరియానీలో వచ్చిన రాయి పంటి కింద పడటంతో అరవయ్యో పడిలో వున్న ప్రలోభరావు పన్ను వూడి పోయింది! ఆనందరావు ఉద్రేకంగా లేచి, క్లబ్ మేనేజర్ని ఛడామడా తిట్టి, మర్నాడే ఆ క్లబ్ యాజమాన్యం మీద తండ్రి తరఫున కోర్టులో ఫిర్యాదు చేశాడు.

కోర్టువారు కేసు విచారించి, బిరియానీలో రాళ్ళు లేకుండా శుభ్రం చేయకపోవటం క్లబ్ యజమానుల నేరమేనని ధృవపర్చారు. అందుకు జరిమానాగా, ప్రలోభరావుకి నష్టపరిహారంగా వెయ్యి డాలర్లు రొక్కం ఇవ్వటమేకాక, ఊడి పోయిన దంతం స్థానంలో బంగారు దంతం కూడా కట్టించాలని క్లబ్ వారిని ఆదేశించారు. వారం రోజుల్లో తండ్రికి బంగారు దంతం అమిరేలా చూశాడు ఆనందరావు— వెయ్యి డాలర్ల డబ్బు కాకుండా.

నాలుగు రోజులు గడిచాక ఓ రోజు యధాలాపంగా తండ్రి నోటిని చూసిన



ఆనందరావు ఉలిక్కి పడ్డాడు. ఆయన నోట్లో బంగారు దంతం స్థానం బోసిగా వుంది!

"మీ కట్టుడు పన్ను ఏమయింది నాన్నా?"

"నోట్లో పెట్టుకోవటానికి బంగారపు దంతం ఎందుకురా? ఆ దంతం లేకపోయినా పెద్ద యిబ్బందిగా లేదులే. అందుకే తీసి జాగ్రత్త చేశాను. మన ఊరెళ్ళాక అమ్ముకుంటే నాలుగు డబ్బులైనా వస్తాయి ఆ బంగారానికి!" అన్నాడు నెమ్మదిగా ప్రలోభరావు.

—శివకుమార్

 

# మామూలు భోజనం

ఊరూరూ తిరుగుతూ విచిత్ర ప్రదర్శనలు ఇచ్చే ఒక కంపెనీలో ఉద్యోగం కోసం దరఖాస్తు పెట్టుకొన్నాడొక తిండిపోతు భీమన్న. ఆ కంపెనీ అధికారులు అతన్ని ఇంటర్వ్యూకి పిలిచారు.

"నిన్ను చూస్తే సాధారణంగా కనిపిస్తున్నావు. నీవేం చేయగలవు?" అనడిగారు వారు.




"నేను సాధారణ వ్యక్తిగా కనిపించినా అసాధారణమైన పనులు చేయగలను" అన్నాడు భీమన్న.

"ఏమిటి నీలో ప్రత్యేకత?"

"బకాసుర భోజనం చేయటం"

"ఒక్కసారిగా ఎంత తినగలవు?"

"ఒక మేకను తినగలను, తరువాత యాభై కోడిగుడ్లు, పాతిక బాతుగుడ్లు ఓ పూర్తి కోడి మాంసం తిని, రెండు లీటర్ల పాలు తాగుతాను. చివరగా ఓ డజను ఆపిల్ పండ్లు తింటాను."

"మా కార్యక్రమాలగురించి తెలుసా?"

"చెప్పండి వింటాను" అన్నాడు భీమన్న.

"రోజూ నాలుగు ప్రదర్శనలు ఇవ్వాల్సి వుంటుంది నీవు"

"ఓ ... అలాగే ఇస్తాను"

"శనివారాలు ఆరు ప్రదర్శనలు"

"సరే తప్పకుండా ఇవ్వగలను."

"బాగా ఆలోచించుకో...చేయగలవో లేదో!"

"అదేపాటి ... నాకేం భయంలేదు తప్పక చేయగలను."

"ఆదివారం, పండుగలపూట శలవు రోజుల్లో గంటకో ఆట ఉంటుంది. మరి దీన్నిబట్టి జాగ్రత్తగా ఆలోచించుకుని చెప్పు!" అన్నారు ఆ కంపెనీ అధికారులు.

"అయితే మీరు ఒక షరతుకి ఒప్పుకుంటే మీ అగ్రిమెంటు మీద సంతకం పెట్టి డ్యూటీలో చేరతాను" అన్నాడు తిండిపోతు భీమన్న.

"ఏమిటో చెప్పు!"

"పెద్ద సమస్య ఏమీ కాదనుకోండి... శలవు రోజులు, ఆదివారాల్లో కార్యక్రమాల రద్దీలోపడి నా భోజనం విషయం మర్చిపోయారంటే కడుపు మాడి ఛస్తాను. అంచేత అలాంటి రోజుల్లో భోజనం టైముకి ఓ పదినిముషాలు నన్ను వదిలిపెడితే హోటలు కెళ్ళి నా మామూలు భోజనం తిని వస్తాను. అంతే!!"

—వినూత్న

మానసి అతన్ని ఇంచుమించు ఇరవై ఏళ్ళ తరవాత కలుసుకుంది. ఈమధ్య కాలంలో అతను చాలా పలుకుబడి సంపాయించుకున్నాడని రాజకీయాలు ఆకళించుకొన్న కొంతమంది స్నేహితులు ఆమెతో చెప్పారు. ఎన్నికల సమయంలో బొంబాయి వంటి మహా నగరంలో ఇరవై నాలుగ్గంటలూ పంపుల్లో నీళ్ళు రప్పించటం, అందరికీ అందుబాటులో ఉండేలా ఆహార ధాన్యాలు సప్లై చేయించటం, నిర్వాసితులకు చౌకలో అద్దెకు ఇళ్ళు లభించేలా చూడటం వగైరా అంపని ద్రాక్ష పళ్ళు లాంటి అతను చేసిన వాగ్దానాలను ఆమె కూడా ఒకటి రెండుసార్లు పేపర్లలో చదివింది.

మానసి భర్త ఓసారి అతని ఫొటోను చూపించి నవ్వుతూ అడిగాడు కూడా "ఇతను నీ భక్తులలో ఒకడు కదూ! కొన్ని సంవత్సరాల క్రితం ప్రేమ పైత్యంతో నీకు ఉత్తరాలు రాసి నట్టున్నాడు కదూ..." అని.

అవును. నిజమే! ఆమె యౌవనారంభ దశలో ఉండగా బెంగాల్‌లోని తాత గారింటికి వెళ్ళిన రోజుల్లో అతను పాలిపోయిన మొహంతో బక్క పల్చగా ఉండేవాడు. మరి ఇప్పుడో...పుష్టిగా... బాగా రంగు తేలి సూర్యబింబంలా వెలిగి పోతున్నాడు. వెనక్కి విరిచి దువ్విన నల్లని క్రాపూ, సుకుమారం ఒలకబోస్తున్న కనుబొమలూ...

అతను ఆమెను చూసినప్పుడు చిరునవ్వు నవ్వాడు. అతని ప్రేమ వ్యవహారాలకు సంబంధించిన కథలు గనుక ఆమె విని ఉండకపోతే ఆ చిరునవ్వుకు ముగ్ధురాలై ఉండేదే. విని ఉంది గనుక అసహ్యం కలిగింది సహజంగానే.

"కూ ర్పో! నీలో చాలా మార్పు వచ్చింది సుమీ! ఇప్పుడు నిన్ను నువ్వు పరిచయం చేసుకున్నావుగానీ లేకపోతే గుర్తు పట్టలేకపోయేదాన్నే" అంది మానసి.

"అవును నా వేష భాషలు చాలా మారాయి. కాని హృదయం కొంచెం కూడా మారలేదు" అన్నాడతను తను కళ్ళలోకి కావాలనే చూస్తూ.

"మరి మనసు మాటేమిటి? మీ రాజకీయ నాయకులకు మనసు ఉండదా ఏమిటి?" అందామె నవ్వుతూ.

"నా స్వార్థం కోసమే నేనిక్కడికి వచ్చాను" అన్నాడతను. ఆ మాటల్ని ఆమె పట్టించుకోకుండా పని మనిషితో టీ తీసుకు రమ్మని చెప్పటానికి వంటింట్లోకి వెళ్ళింది. అతను సరస మాడటం మొదలెట్టాడని ఆమెకు అర్థమయింది. ఆడవాళ్ళను చూస్తే అతను అదుపు తప్పుతాడనేది ఆమెకు తెలిసిన విషయమే. వయసులోని వాళ్ళే అయి ఉండాలనే పట్టింపేమీ లేదతనికి.

"ఒక్క ఉత్తరానికి జవాబివ్వలేదేం మానసీ!?"

"ఎలా జవాబు రాయను? విజయ్! నన్ను అన్ని విధాలా ప్రేమాదరాభిమానాలతో చూసుకొనే భర్త ఉన్నాడు. అదీ కాక నిన్నెప్పుడూ మరోలా అనుకోలేదు, తమ్ముడిగా తప్ప. కలకత్తాలో మాతో ఉన్నప్పుడు నువ్వు నా వెనకాల కుక్కపిల్లలా తిరుగుతూంటే కోపంతో నేనెన్ని సార్లు నీ ముక్కు పిండలేదూ?"

"నాకు మా అన్నయ్యంటే మహా అసూయగా ఉంది. నువ్వూ, వాడూ

ఒంటరిగా కూర్చుని చేతులు కలుపుకొని ఎప్పుడూ కబుర్లు చెప్పుకొనేవారు. అలాంటపుడు వాణ్ణి ప్రేమించటం మానేసి నాతో కలిసి ఉండమని నేనెలా అనగలను? ఓసారి మీ మాటల్ని నేను పొంచి ఉండి వింటున్నాననీ, కొడతాననీ బెదిరించావు గుర్తుందా? అప్పుడు కూడా నేను నిరుత్సాహ పడలేదు. అందమైన, ఆకర్షణీయమైన నీనుంచి, సముద్ర కెరటాల వంటి నీకేశపాశాలనుంచీ వచ్చే సుగంధాన్ని మంద పవనాలు నా దగ్గరకు మోసుకొచ్చేవి. ఉత్తేజ పూరితమైన మల్లె పూవులూ, మంచి గంధం సువాసనల్లా అవి ఏళ్ళ తరబడి నన్ను వెన్నాడాయి" మానసి ఇబ్బందిగా అటూ ఇటూ చూసింది.

తన అన్నగారితో ఆమె ప్రేమ వ్యవహారాన్ని అతను ఇలా జ్ఞాపకం చేయటం మానసికి ఇష్టం లేదు. విజయ్ అన్న విమాన ప్రమాదంలో మరణించటంతోనే ఆ ప్రేమ ముగిసిపోయింది. అతనే కనుక బతికి ఉంటే ఇప్పుడామె పక్కన కూర్చున్న ఆ అవినీతి పరుడైన రాజకీయ వేత్తకు మానసి వదిన అయి ఉండేది.

విజయ్ ఖరీదైన సిగరెట్ వెలిగించాడు.

అతని అన్నే కనుక జీవించి ఉంటే ఆమె నిత్యం సమస్యలతో సతమవుతున్న ఓ ప్రభుత్వాధికారి భార్యగా మారిఉండేదే కాదు. తనతండ్రి వయసున్న మిత్రాకు పత్నీత్వం నెరప వలసిన పనే ఉండేది కాదు. కాని అప్పుడామె బహుశ కవయిత్రిగా రాణించలేకపోను. నిరాశ లాంటి పంకంలోంచి వెలికి వచ్చిన పద్మంలా ఆమె అందాలు చిందించలేక పోను.

రోజూ సముద్రం ఒడ్డుకు షికారు తీసుకు వెళ్ళే భర్త లభించినా, పాత పుస్తకాల షాపులకు తరచుగా తీసుకు వెళ్ళినా ఆమె వైవాహిక జీవితాన్నెంతో ఆనందంగా అనుభవించేది. ఇపుడామె రాత్రిళ్ళు వంటింట్లో డైనింగ్ టేబిలు మీద టేబిల్ క్లాత్ పరచుకొని కథలు, కవిత్వాలు రాయదు. ఆమె భర్త ఛాతీపై పెరిగిన జుట్టుమీద గూటిలో ఒదిగి పోయిన పక్షిపిల్లలా పడి ఉంటుంది.

"నువ్వు బాగా అందంగా పెరిగి పోయావు. చాలా మారిపోయి ఉంటావని ఊహించాను" అన్నాడతను. "కళ్ళు కనిపించటంలా" అంది మానసి ఆశ్చర్యం గానే, వేళాకోళంగా నవ్వుతూ. "నేను బాగా లావెక్కాను, జుట్టు అక్కడక్కడ తెల్ల బడుతోంది. నీకు తెలియదూ! ఇప్పుడు నాకు నలభై ఏళ్లు. మా అమ్మాయి, లక్నోలో చదువుతోంది. దానికే పంధొమ్మిదేళ్ళున్నాయి"

"అదేమిటి? మీ అమ్మాయి హాస్టల్‌లో చేర్పించావేం?"

"నేను, మా ఆయనా తరచుపోట్లాడు కుంటూ ఉంటాం. అలాంటి వాతావరణంలో పిల్లల్ని పెంచటం నాకు ఇష్టం ఉండదు. అఫ్‌కోర్స్! ఫీజులు అవీ కట్టటం కొంచెం కష్టమే అనుకో"

"అంటే నువ్వి పెళ్ళి చేసుకొని నానా ఇబ్బందులూ పడుతున్నావన్న మాట! అయామ్ సారీ! నాకు చాలా బాధగా ఉంది"

"అదేం లేదులే! మేం బాగానే ఉన్నాం. కానీ మాది సరైన జోడీ కాదు. ఆయనకు ఎంతసేపూ ఫైళ్ళేలోకం!

నాకేమో పదిమందితో సరదాగా ఉంటా లనీ, కబుర్లు చెప్పాలనీ, అందరితో కలిసి మెలిసి ఉండాలనీ..."

"మానసీ! నువ్వు..." అంటూ ఆమె చేతిని తనచేతి లోకి తీసుకున్నాడతను. ఆమె నవ్వుతూనే తన చేతిని వదిలించు కొని "ఉండు! టీ కలపటం పూర్తయిందో లేదో చూసొస్తాను" అంటూవంటింటివైపు గబగబా వెళ్ళింది.

విజయ్ సోఫాలోంచి లేచి తీరికగా గదిని పరిశీలనగా చూడసాగాడు. గుమ్మాలకు వెలిసిపోయిన నీలం రంగు తెరలు వేలాడుతున్నాయి. నేలమీద బూడిద రంగు తివాసీఉంది. దానిమీద కుర్చీలు సోఫాలు...అన్నిటికీ నీలం రంగుగలేబు లున్నాయి. గోడకు ఏదో ఇత్తడి ఫలకం ఉంది. టీ పాయ్ మీద ఓ పత్రిక... ఆ అలంకరణ మానసి నిరాడంబరత్వాన్ని చాటి చెబుతోంది.

మానసికి స్వతహాగా తెలుపు దుస్తు లంటేనే ఇష్టం. ఆకర్షణీయంగా ఉండే కురుల్ని మరింత అందంగా ముడి చుట్టు కొంటుంది. ఆమె ధరించే పొడుగు చేతుల జాకెట్టు గృహిణీత్వానికి చిహ్నం.

గట్టిగా నిట్టూర్చాడు విజయ్. ఆ ముసలి మొగుడిని వదిలేసెయ్యమని ఆమెకు ఎలా నచ్చచెప్పటం? మానసిని తను పువ్వుల్లో పెట్టుకుని పూజించుకో గలడు.

తను రాజకీయాల్లో తల మునకలుగా ఉన్నాడు. తన పాచిక పారితే ప్రధాన మంత్రి త్వరలోనే కేంద్ర ప్రభుత్వంలో తనను మంత్రిగా తీసుకోవచ్చు. ఎలాగూ మహారాష్ట్ర నుంచి ఓ మంత్రి కేంద్రంలో ఉండాలి. పూజ, పునస్కారం లేక బూజు పట్టిఉన్న దేవుడులాంటివాడు విజయ్. ఇప్పుడిప్పుడే సొంత మనుషుల చేత డబ్బా వాయించు కుంటున్నాడు. పత్రికా విలేకరులతో గోడ మీది పిల్లి వాటంగా నిజాలు, అబద్ధాలు కలబోసిన విశేషాలు చెబుతూ, తెలివిగా ఓ ఇద్దరు చెంచాల ద్వారా తన పలుకుబడిని పెంచు కున్నాడు. వాళ్ళిద్దరూ పూర్వాశ్రమంలో అతని సహచరులే!

మానసి తన భార్యగా ఉంటే మళ్ళీ తను నిష్కల్మషమనస్కుడవ్వచ్చు.ఆమె ఆదర్శ స్త్రీ. మండే నిప్పు కణికలాంటిది. ఆ నిప్పు దుర్మార్గుల్ని దగ్ధం చేయగలదు. మానసి రాసిన మొదటి పుస్తకాన్ని చదివి నపుడు విజయ్‌కి తల కొట్టేసినట్లయింది. ఆమె నిర్మలత్వం అతణ్ణి ముగ్ధుణ్ణి చేసింది. ప్రపంచంలో ఉండే దగాపడిన తమ్ముళ్ళంతా ఆమె ద్వారా తనలాంటి మోస గాళ్ళను చూసి వెక్కిరిస్తున్నారనిపించింది. తన అధికార వ్యామోహాన్ని, బాధ్యతా రాహిత్యాన్ని, సంకుచిత స్వార్థపరత్వాన్ని నీచ మనస్తత్వాన్ని వేలెట్టి చూపిస్తున్నా రనిపించింది.

అప్పట్లో ఆ పుస్తకాన్ని చదువుతూ తన ఎయిర్ కండిషన్డ్ గదిలో కూర్చుని చిన్నపిల్లాడిలా వెక్కి వెక్కి ఏడ్చాడు. ఇపుడు మానసి ఇంటిని చూసి ఆశ్చర్య పోయాడు. ఆమె భర్తలాంటి నిజాయితీ పరులు భోగాలను అనుభవించ గలగటం కష్టం. బహుశా ఆమె ఓ మామూలు పరుపుమీద ఆ ముసలి భర్తను కౌగలించు కొని పడుకుంటూ ఉండచ్చు. ఆ పుస్తకం చదివిన తరువాత ప్రేమతోనూ, అదో రకమైన తమితోనూ పుస్తకాన్ని ముద్దు పెట్టుకొన్నాడప్పుడతను. ఆ తరువాత

అతని ఒళ్ళు వేడెక్కి పోయింది....చమటలు పట్టేశాయి...

మానసి ఓ ట్రేలో టీ తీసుకు వచ్చి టీ పాయ్‌మీద పెట్టింది. అతను చాలా హుషారుగా ఉన్నట్లు నటించ ప్రయత్నించాడు. "బహుశా నక్సలైట్లు మాత్రమే ఇలాంటి పత్రికలు చదువుతారను కొంటాను" అన్నాడతను-ఆమె టేబిల్ మీది పుస్తకాన్ని పక్కకు జరిపి టీ కప్పును అతని ముందు ఉంచబోతున్నపుడు.

"అయితే నేనూ నక్సలైట్‌నే"

ఆమె వెనక్కివాలి నవ్వుతూనే అంది. ఆమె చెక్కిళ్ళపై అదోరకమైన మెరుపు మెరిసింది.

"నక్సలైట్‌వే అయితే నువ్వు అజ్ఞాత వాసంలోకి వెళ్ళే వరకు నిన్ను నేను వేటాడవలసి ఉంటుంది"

"నువ్వు రేపొద్దున్న మంత్రివే అయితే మాలాంటి వాళ్ళనేం చేస్తావో ఎవరికి తెలుసు ? ఎవరో చెప్పగా విన్నాను... నిన్ను కేంద్రమంత్రివర్గంలోకి తీసుకుంటారటగా! నిజమేనా ?"

"అవును. ఢిల్లీలో అలాగే అనుకుంటున్నారు. కాని ఖచ్చితంగా చెప్పలేం! సదాశివరావుగారని ఒకాయన ఉన్నాడులే. ఆయన రాజకీయాల్లో పాతకాపే. మంచి పదవో, చక్కని అధికారమో దక్కించుకోవాలని శతవిధాల ప్రయత్నిస్తున్నాడు. వాడు బతికుండగా నాకు మంత్రి పదవి వస్తుందనుకోను" అన్నాడు విజయ్ గుంభనగా.

"ఇప్పుడు ప్రధాన మంత్రి దృష్టంతా యువకులమీదే ఉందటగా. ఎవరో అన్నారు నాతో. అరవై ఏళ్ళు దాటిన నాయకులందరినీ వాళ్ళ వాళ్ళ పదవులకు రాజీనామా చేసేసి పల్లెటూళ్ళకు పోయి అధికార పార్టీని పటిష్టం చేసే ప్రయత్నాలు చూడమని ప్రధాని అంటున్నారట. ఆ మాటలు విన్నపుడు నీకు మంచి అవకాశం వస్తుందని సంబర పడ్డాను"

"మానసీ ! నిజంగా చెప్పు. నేను మంత్రినయితే నువ్వు మనస్ఫూర్తిగా సంతోషిస్తావా ?"

"అదే జరిగితే నాకంటే సంతోషించే వ్యక్తులెవరున్నారు? నీ జీవిత లక్ష్యం అదేగా ?" అంది మానసి కప్పులలో టీ పోస్తూ.

"నా జీవిత లక్ష్యం అదికాదు! నిన్ను పెళ్ళి చేసుకోటమే నా జీవితానికి పరమార్థం. అది నెరవేరలేదు. అందుకే రాజకీయాల్లోకి దిగాను. ఎప్పుడైనా నా సరేఆడదాన్ని లోబరుచుకోలేకపోయిన పక్షంలో కనీసం దేశాన్నయినా వశపరుచుకోమని ఎవరో చెప్పారు!"

"నాకు ఇలాంటి మాటలంటే అసహ్యం ! నువ్వు నాకంటే ఆరేళ్ళు చిన్నవాడివి. నిన్నెప్పుడూ ప్రియుడిగా చూడలేదు. నీకు నాతో సరససమాడాలనిపించినప్పుడల్లా ఈ మాట జ్ఞాపకం తెచ్చుకో. అది మనిద్దరికీ ఎంతో మంచిది"

"నేనంటే నీకు బొత్తిగా దయలేదు" అన్నాడు విజయ్. అతని ఉత్సాహం అంతా నీరు కారిపోయింది. ఆమెను తన వైపు ఆకర్షించుకోగలనన్న నమ్మకం వమ్మైపోయింది. తన అన్నగారి ప్రియురాలిని మొదటిసారిగా ప్రేమించినప్పటి స్థితిలో పడిపోయాడతను. అతను మరో సిగరెట్టు తీసి వెలిగించి, వెళ్ళిపోవటానికి ఉద్యుక్తుడయ్యాడు. ఇప్పుడతని కళ్ళలో ఇందాకటి కాంతిలేదు. అతని ఎర్రని పెద

వులపై ఇదివరకటి చిరునవ్వు లేదు.

మానసి అలవోకగా అతన్ని స్పృశించింది. "విజయ్! టీ తీసుకో" అంది గుసగుసలాడినట్లుగా.

"ఇంక మళ్ళీ నేనిక్కడికి రావల్సిన అవసరం ఉండదేమో కదూ!"

"ఉండదు! కాని నువ్విప్పుడు ఇక్కడే ఉన్నావుగా! మా ఆయన వచ్చే వరకు ఉండి ఆయనను కూడా ఓసారి పలకరించి వెళ్ళకూడదూ!"

"ఆ ప్రేమంతా ఆయన మీదే ఒలకపొయ్యి" అంటూ అక్కడినుంచి విసురుగా బయటకు వెళ్ళిపోయాడు తలుపు దభాలున మూసి.

మానసి మౌనంగా టీ తాగేసింది. "రమణా! ఈ ట్రేలోపలికి తీసుకువెళ్ళు!" అని కేకేసింది. అతను వచ్చి అవి పట్టుకుని వెళ్ళిపోయాడు. ఆమె అక్కడున్న పత్రిక తీసి చదవటం మొదలుపెట్టింది.




ఆదివారాల్లో ఇంటికి స్నేహితులెవరూ రాకుంటా ఉంటే వాళ్ళిద్దరూ తప్పకుండా దెబ్బలాడుకుంటూనే ఉంటారు. ఈ ఆదివారమూ అంతే!

"మన పెళ్ళైన ఈ ఇరవయ్యేళ్ళలోనూ మీరు నాకేం ఒరగపెట్టారు... రెండు పూటలా ఇంత తిండి, ఒళ్ళుదాచుకోవటానికి నాలుగు చవకబారు చీరలుతప్ప! ఓ నగో, నట్రో చేయిద్దామనీ, అచ్చటా ముచ్చటా తీరుద్దామనీ ఆలోచనైనా లేదు మీకు" అంది ఆమె జుట్టు విరబోసుకొని అతని దగ్గరకు వస్తూ.

"అంటే నీ ఉద్దేశం ఏమిటి? నెలనెలా నాకెంత జీతం వస్తోందో నీకు తెలుసు. ఆ డబ్బు మన జీవితావసరాలకే చాలటం లేదనీ తెలుసు. అలాంటపుడు నేను డబ్బు ఎలా నిలవెయ్యను? మానసీ! నువ్వు బాగా మారిపోయావు. ఒకప్పుడు నువ్వు మహా ఆదర్శవాదివి. ఆడంబరాలు నీకు గిట్టేవికావు. మన పెళ్ళైన మొదటి సంవత్సరంలో పెళ్ళిరోజును జ్ఞాపకం చెయ్యటానికి నీకు ఓ బహుమతి తెచ్చినపుడు నువ్వేమన్నావు? నగలు నాణ్యాలంటే గిట్టవన్నావు. నీకు ఇంకా జ్ఞాపకం ఉండే ఉంటుంది ...... నీకు కమ్యూనిజంలో నమ్మకం ఉందని చెప్పావు...గుర్తు తెచ్చుకో"

"మీకు ఆడవాళ్ళ మనస్తత్వాన్ని అర్థం చేసుకోవటం చేతకాదు. అప్పుడు నేను చిన్నపిల్లని. అందంగా కనిపించటం కోసం నగలు, నాణ్యమైన బట్టలు వేసుకోవలసిన అవసరం లేదప్పుడు. ఇప్పుడు... ఇప్పుడు నాకు వయసు మీదపడుతోంది." ఆమె ఇంచుమించు ఏడుస్తున్నట్టుగానే మాట్లాడింది.

"గడుస్తున్నకాలం నేను అందగత్తెననే అహాన్ని అణిచేసిందనిపిస్తోందిప్పుడు. నా శరీరంలో సౌకుమార్యం అంతరించింది. నిగనిగలాడే నా తలకట్టు ఎలా తయారయిందో చూడండి! ఇదివరకటి బిగువులన్నీ ఇప్పుడు సడలిపోలేదూ? ఆకారం తప్ప ఇప్పుడు నాకేం మిగిలింది? చిన్న

తనంలోనే విలువైన చీరలు అవీకట్టుకొని ఉండవలిసింది. ఖరీదైన నగలు ఒంటి నిండా దిగేసుకొని ఉండవలిసింది. వజ్రాలు వైఢూర్యాలూ శరీరమంతా తాపడం చేయించుకొని ఉండవలసింది. అప్పుడు నేనే మహా అందగత్తెనని మిడిసిపడ్డాను.. ఇప్పుడు..."

అతను మంచంమీదనుంచి లేచి ఆమె వద్దకు వెళ్ళాడు. మానసి తలపై చేయి వేసి మృదువుగా నిమిరాడు. ఓ అందమైన శరీరం పక్కగా ముడతలు పడి అసహ్యంగా ఉన్న మరో శరీరం అద్దంలోంచి కనిపించిందతనికి. ఆ రెండు ప్రతిబింబాలు అతనిని కదిలించి వేశాయి.

"మానసీ! నువ్వు ఇప్పటికీ అందంగానే ఉన్నావు మానసీ! అలంకారాలూ, ఆభరణాలూ లేకపోయినా అందంగానే ఉన్నావు మానసీ! ఇంత సుకుమారంగా, మెరుపు తీగలా ఉన్న నీ శరీరంమీద వజ్రాలు ముత్యాలు ఉన్నా అవే వెలవెల పోతాయి! నేను రేపు ఆఫీసుకు వెళ్ళేటప్పుడు ఓ లాటరీ టికెట్టు కొంటాను. మనకి ప్రైజు వస్తే ఈ ఊళ్ళో ఉన్న పెద్ద నగల కొట్టుకు వెళ్దాం! నీకు కావలసినవన్నీ తెచ్చేసుకుందాం" ఆ క్షణంలో మానసికి తనభర్త ఓ విదూషకునిలా తోచాడు. ఒదులుగా ఉన్న బొందు పైజమా, పైన వేలాడుతున్న కండువా...రోజులు గడుస్తున్న కొద్దీ అతను మరీ ముసలివాడై పోతున్నాడు. కిళ్ళీలు నమిలి నమిలి పళ్ళు గారపట్టేశాయి. పొగమంచు కమ్మేసినట్టు కళ్ళు రెండు తెలుపెక్కిపోయాయి. శరీరంలో ఎరుపు చచ్చిపోయి పాలిపోయింది.

రెండు చేతుల్లోనూ మొహాన్ని దాచుకొని మానసి ఏడవసాగింది. విజయ్‌ని చూడటంవల్ల కలిగిన చాంచల్యం ఇది అని ఆమె భర్తతో చెప్పలేదు. విజయ్‌తో భర్తని పోల్చుకోవటం వల్ల కలిగిన ఉద్రేకంతో తాను అలా మాట్లాడానని ఆమె అతనితో చెప్పలేదు. అవును! ఎలా చెప్పగలదు?

ఖద్దరు కుర్తా పైజామాల్లో విజయ అందంగా, ఆకర్షణీయంగా కనిపిస్తాడు. పైగా గోధుమరంగు వేస్ట్‌కోటు కూడాను.. అతను నవ్వుతోంటే పళ్ళు చక్కగా మెరుస్తాయి. 'అవును! విజయ్ ఒక్కడే నాకు తగినవాడు. మా జంట చూడముచ్చటగా ఉంటుంది. రచయిత్రి...రాజకీయ నాయకుడూ...ఎంత బావుంటుంది' అనుకుంది మానసి తనలో తానే.

"రా మానసీ! పడుకుందాం" అన్నాడతను.

"ఛ! నన్ను ముట్టుకోకండి! ఆ మంచంమీద నా శరీరంతో ఆడుకోవటానికే మీరిలా సంగనాచి కబుర్లు చెబుతున్నారు. సిగ్గులేదూ! మిమ్మల్ని చూస్తేనే నాకు ఒళ్ళు మండుతుంది. ఏదో ఇంత తిండి పెడుతున్నారని మీకు ఒళ్ళు అప్పచెప్పటం తప్ప..."

"డార్లింగ్! ఏమిటి నేనేదో పరాయివాడిలా మాట్లాడుతున్నావ్! ఇవాళ సాయంత్రం నుంచీ నీ మూడ్ ఎందుకో పాడయింది. లేకపోతే బయటుండే రోజులా ఏమిటి?"

"ఛీఛీ దరిద్రం! పెద్ద డాక్టరులా వెధవ కబుర్లు కూడాను..."

"అవున్లే! నేను మాట్లాడితే బఫూనులాగానో, మూర్ఖుడిగానో, డాక్టరుగానో వుంటుంది. నేనేం మాట్లాడినా మొగుడు ఏదో అన్నాడు అనే దృష్టి వుండదు నీకు. అంతేకదూ!"

ఆమె తల పైకెత్తి అతనివైపు చూసి "నన్ను క్షమించండి" అంది.

ఆమె ముఖం ఏడవటంవల్ల వాడిపోయి వుంది. 'చిన్నపిల్ల! ఏదో అందిలే' అనిపించిందతనికి. కిందకు వంగి ఆమె నుదుటిపై ముద్దు పెట్టుకున్నాడతను.

"మనూ! నేను శుద్ధ చవటని. నీలాంటి వజ్రానికి నేను తగను" అన్నాడతను గుసగుసగా.



అలాంటి రాజీ పరిస్థితిలో ఏకళయ్యా గతులవటం ఏ భార్యాభర్తలకయినా తప్పనిసరే. ఏభై ఆరేళ్ళ వయసులో కూడా అతనికి స్త్రీ నుంచి ఏదో పొందాలనే తపన వుంది. మానసికి ఆ వ్యవహార మంతా మంచంమీద ఏదో డ్రిల్లుచేస్తున్నట్లు అనిపించి అసహ్యించుకుంటుంది. ఆమె ఎప్పుడూ భర్తని ఇష్టపడలేదు. కానీ ఆమె అతనికి ఓ తువ్వాలో, మరో వస్తువో, అంతే! అందువల్ల ఆమె అసంతృప్తిని అతడెపుడూ గమనించలేదు.

అతను ఆమెతో శృంగార సంరంభంలో వున్నపుడు ఆమె ఎప్పుడూ కళ్ళు మూసుకొనే వుంటుంది. అంతసేపూ ఆమె మౌన వ్రతంలోనే వుంటుంది. ఆమెది ఆత్మ త్యాగమని అతనికి తెలియదు. అప్పటి ఆమె మానసిక స్థితిని అతను ఊహించి వుంటే, ఆ వెంటనే అతని మగసిరి మంట కలసిపోయి వుండేది.

మర్నాటి ఉదయం పేపర్లో వచ్చిన వార్తల ప్రకారం విజయ్‌కి కేంద్ర మంత్రి వర్గంలో ఇనుము, ఉక్కు మంత్రిత్వ శాఖను అప్పగించారని మానసి దంపతులకు తెలిసింది. "ఓయ్! నీ బాల్య స్నేహితుడు ఇప్పుడు ఓ పెద్ద మంత్రిగారయ్యారు. తెలిసిందా" అన్నాడతను ఉత్సాహంతో గట్టిగా. కానీ ఆమె అవార్త వైపు ఓసారి చూసి మౌనంగా వుండిపోయింది. "ఇప్పుడు మనం కూడా మర్యాదస్తులమైపోయాం చూశావా"

ఆమె అతనివైపు చురుకుగా చూసి "అంటే నేను ఢిల్లీ వెళ్ళి వాళ్ళనీ, వీళ్ళనీ ప్రాధేయపడి పనులు చేసుకువచ్చే మనిషిననా మీ ఉద్దేశం?"

"లేదు మనూ? నువ్వెందుకు ఢిల్లీ వెళ్ళటం? ఢిల్లీయే నీ దగ్గరకి వస్తుంది" అన్నాడతను నవ్వుతూ!

ఆమె అక్కడి నుంచి విసవిసా వంటింట్లోకి వెళ్ళిపోయి గ్లాస్ ప్లేట్లు బద్దలయ్యాయనే వంకతో పని కుర్రాడి మీద విరుచుకు పడింది. "అమ్మగారూ! లేదండి! ఈ మధ్య ఒక్కటి కూడా పోలేదండి?" అన్నాడు వాడు ఇదేమిటి ఈ విడ పొద్దున్నే ఇలా అరుస్తోందని ఆశ్చర్యపోతూ.

"ఇదివరకు ఎన్ని తగులడిపోలేదు. ఇంక ఇప్పుడు నువ్వు బద్దలు కొట్టడానికి ఏమీ మిగల్లేదన్నమాట..." అంటూ నాజూకైన వేళ్ళతో నేర్పుగా ఉల్లిపాయలు తరిగి నేతిలో వేయించింది. అవి దోరగా వేగాక కాసిని బంగాళా దుంప ముక్కలు మూకుడ్లో వేసి కారం వగైరాలు చల్లింది.

"ఏరా! చేపలు కడిగావా?" కుర్రాడిని అడిగింది మానసి. "ఓ ఎప్పుడో అయిపోయిందా పని!" వినయంగా సమాధానం చెప్పాడు వాడు. సుకుమారంగా ఉండే చేతులను వంట వార్పుల పేరుతో కష్టపెట్టటం ఆమెకు ఇష్టం ఉండదని వాడికి తెలుసు. అసలలాంటి పనులంటే ఆమెకు అసహ్యం కూడా. కాని ఇవాళ ఆమె ఎందుకో చిరాకుగా ఉందనీ, అందుకే ఏమీ లక్ష్య పెట్టటం లేదనీ వాడు అర్థం చేసుకున్నాడు.

మైదా పిండిని ముద్దలు గాచేసి పరాటాలు ఒత్తటం ప్రారంభించింది. ఆమె పనిచేస్తున్న తీరు వాడికి కంపరం పుట్టించి "అమ్మగారూ! అవి సరిపోతాయండి! మీరు వెళ్ళి డ్రాయింగ్ రూమ్‌లో కాసేపు విశ్రాంతి తీసుకోండి.

అరగంటలో నేను టిఫిన్ తయారుచేసి తీసుకువస్తాను" అన్నాడు.

కాని, అక్కడ ఆమె భర్త ఉన్నాడు. అతను పేపరు చదువుకొంటూంటే తాను అతని పక్కనే కూర్చుని తొంగిచూస్తూ అదే పేపరును చదవటం మానసికి ఇష్టం లేదు. కాసేపు అటూ ఇటూ అనాలోచితంగా తిరిగి చివరికి పడక గదిలోకి వెళ్ళి కిటికీ దగ్గర కూర్చుంది. ఆ కిటికీ లోంచి ఇంచుమించు తమ స్థాయికి తగ్గట్టుగా ఉండే మరో ఇల్లు కనిపించింది. ఇపుడు ఆమె ఉన్న గదిలాంటి గదే అస్పష్టంగా ఆమె దృష్టిలోపడింది. గది కిటికీకివున్న వాయిల్ తెర పూర్తిగావెనక్కి ఒత్తిగించి ఉంది. ఎవరో ఓ మగాడు చౌకబారు మంచంమీద ముడుచుకొని పడుకున్నాడు. అతను గాఢ నిద్రలో ఉన్నట్టు న్నాడు.

'అతను మరో ప్రభుత్వోద్యోగి అయి ఉంటాడు' అనుకుంది మానసి, దీనంగా ఉన్న అతని వాలకం, వాడిపోయిన, ముఖం మాసిపోయిన తలచూసి. "పెళ్ళాంతో పరాచికా లాడుతూ కూడా తరవాత రాబోయే ఇంక్రిమెంటు గురించి ఆలోచించే మరో దౌర్భాగ్యుడు" అని ఈసడించుకుంది. చాకిరేవుకు వెయ్యటానికి కూడా పనికిరాని బట్టల్లా ఈ మనుషులు ఎంత దీనంగా కనిపిస్తారు!

ఆమె ఇప్పటికీ ఆకర్షణీయంగానే ఉంది.ఆమె ఆలోచనలు ఇంకా చురుకుగానే ఉన్నాయి. ఉడుకు రక్తంగల యువత ఆమెను విప్లవకవయిత్రిగా ఆరాధిస్తారు. కాని ఆమె భర్త మిత్రా మన్నుతిన్న పాములా, గడిచిపోయిన కాలంలా ఉంటాడు. ఆమె సభలకు, సమావేశాలకూ అధ్యక్షత వహించటానికి వెళ్ళేటప్పుడు చౌకబారు బట్టలు వేసుకుని, ఆమెతో కూడా వస్తాడు. అంతవరకూ లక్షలాది ఫైళ్ళమీద సంతకాలు పెడుతూ కూర్చుంటాడు.

సభలలో ఎప్పుడు మొదటి వరసలోనే ఆమెకోసం, ఆమె భర్తకోసం కుర్చీలు ప్రత్యేకంగా వేస్తారు. కాని ముఖ్యమంత్రి, గవర్నరులాంటి పెద్ద మనుషుల పక్కన కూర్చునే మానసి తన పక్కన భర్త దీనంగా కూర్చోవటం ఆమెకు ఇష్టం ఉండదు.

తనలోనే నవ్వుకుంది మానసి. ఆ నవ్వులో విషాదం ప్రతిబింబించింది.'రాను రాను నాకు పిచ్చెక్కుతోంది' అనుకుంది తనలో తనే. 'మరొకరి కోసం ఆయన్ని ఎప్పుడూ వదిలి పెట్టలేను. ఒకవేళ నేను మళ్ళీ పెళ్ళి చేసుకొన్నా ఆ కొత్త ఇంటికి ఆయన కూడా...'

ఇంతలో హఠాత్తుగా మానసికి తనకు కూడా ఓ కూతురున్నట్లు జ్ఞాపకం వచ్చింది. సుపర్ణ చక్కగా ఉంటుంది. ఈ వయసులోనే సుపర్ణకి మంచి మొగుణ్ణి వెదకాలి. ఈ మొగుణ్ణి తల్లి బలవంతంగా తనపై ఎలా రుద్దిందో మానసికి గుర్తు వచ్చి కంగారు పడింది. 'బహుశా అతను నీ కంటె కొంచెం పెద్దవాడే కావచ్చు. కాని చాలా మంచివాడు. మన మంటే చాలా అభిమానం ఉన్నవాడు. ఇంత బుద్ధిమంతుణ్ని ఇప్పటి వరకూ నేను చూడలేదు' అంది మానసి వాళ్ళ అమ్మ. మంచితనం, అభిమానం మాత్రమే సరిపోతాయని మానసి తల్లిదండ్రులు అనుకున్నారు. అవును. ఎదిగిన్న కూతురు ఇంట్లో ఉంది. పైగా...

మానసి గర్భవతిగా ఉండగా, ఆమె ప్రియుడు విమాన ప్రమాదంలో ఘోరంగా మరణించాడు. ఆమె గర్భిణి. ఆమెను వదిలేసి పుట్టబోయే బిడ్డకు పెళ్ళి కాకుండానే తల్లివై ప్రపంచానికి ఎలా సమాధానం చెప్పుకుంటావో నీ ఇష్టం అన్నట్టు అతను ఏ లోకాలకు వెళ్ళి పోయాడు. అలాంటి సంకట పరిస్థితిలో ఈ మిత్రా తన అమృత హస్తాన్ని అందించి సహాయపడ్డాడు. 'నా సొంత బిడ్డలా చూసుకుంటాను' అన్నాడతను. ఆ మాట నిజంగానే నిలబెట్టుకున్నాడు. చివరికి సుపర్ణకు కూడా తెలియదు అతను ఆమెకు సొంత తండ్రి కాడని! సుపర్ణకి తండ్రంటే వల్లమాలిన అభిమానం.

పదమూడో ఏడు వచ్చేవరకు సుపర్ణ తండ్రి పక్కలోనే అతనిపై ఓకాలు వేసి హాయిగా నిద్ర పోయేది. తండ్రి కూతుళ్ళను ఆ స్థితిలో చూసినపుడు మానసికి ఏదో అనుమానం ఆవహించేది. మిత్రా నిజానికి సుపర్ణకు తండ్రి కాదు. ఆమె స్పర్శతో అతనిలో ఏదేనా ఉద్రేకం చెలరేగితే... ? పైగా అతని విషయం ఆమెకు బాగా తెలుసు. ఏ రాత్రివేళో ఆ చిన్న పిల్లని పాడు చేస్తాడేమో! తాను అలా అనుకుంటున్నానని అతనితో చెబితే భర్త ఎక్కడ బాధ పడతాడోననే భయంతో మానసి ఆ మాటెప్పుడు మిత్రాతో అనలేదు. కాని ఆ తరువాత కొద్ది రోజులకే సుపర్ణని పంచగనిలో ఉండే హాస్టల్‌లో చేర్పించింది. తండ్రికి దూరంగా హాస్టల్‌లో ఉండి చదువుకోవడం సుపర్ణకు బొత్తిగా ఇష్టం లేదు. కాని తప్పని పరిస్థితుల్లో తండ్రి కన్నీళ్ళు తుడుస్తూ ఆమె ప్రయాణం కట్టవలసి వచ్చింది.

పంధొమ్మిదేళ్ళు వచ్చినా సుపర్ణకు ఇంకా చిన్నతనం పోలేదు. ఇప్పటికీ తండ్రి ఒళ్ళో ఒరిగిపోయి 'బాబా, బాబా' అంటూ కబుర్లు చెబుతుంది. మిత్రా కూడా ఆమె చేష్టలకు ఒళ్ళు పులకరించి ఆమెను వాత్సల్యంగా నిమురుతూ ఆప్యాయంగా ముద్దు పెట్టుకుంటాడు. అలాంటివి మానసికి ఇష్టం ఉండవు.

"ఏయ్! సుపర్ణా! ఏమిటది? చిన్న పిల్లలా! ఇన్నేళ్ళొచ్చాయి! బుద్ధుండక్కర్లా" అంటూ మానసి చివాట్లు పెట్టేది.

'సుపర్ణకు పెళ్ళి చేయవలసిన వయసు ఇదే' అనుకుంది మానసి. రాజ కుటుంబ వారసత్వం సుపర్ణకు పూర్తిగా వచ్చింది. సుపర్ణకు జన్మ నిచ్చిన తండ్రి జ్ఞాపకం వచ్చాడు మానసికి. విజయ్ కూడా అచ్చం అలాగే ఉంటాడు. అదే ఒడ్డూ, పొడుగూ... ! అతను నవ్వినట్టే సుపర్ణ కూడా సుతారంగా నవ్వుతుంది. కనుకొలకుల దగ్గర అలవోకగా ప్రారంభమైన చిరునవ్వు మెల్లిమెల్లిగా చెక్కిళ్ళవరకూ జారి పెదాల విరుపుతో పూర్తవుతుంది. ఆ నవ్వు ఎంత మధురంగా ఉంటుంది!

'విజయ్ పట్ల నేనెం ఆకర్షితురాలవటంలేదు' అనుకుంది మానసి స్వగతంగా. అతను అవినీతిపరుడని, నయవంచకుడని అందరికీ తెలుసు. అలాంటి మనుషులంటే మానసికి పరమ అసహ్యం! అవును మరి! ఎందుకు ఉండదు! సామాజిక స్పృహతో కవితలు అల్లే రచయిత్రి కదా!

* * *

అన్ని అర్హతలూ ఉన్న మనిషికి సరైన గౌరవం లభించటం కూడా విశేషమే! బెంగాలీ భాషలో ఇటీవల వెలువడిన కవితా సంకలనానికి మానసికి అత్యు

త్తమ సాహితీ అవార్డు లభించటంతో ఆ బహుమానం స్వీకరించటానికీ, తత్సంబంధమైన సభలో పాల్గొనడానికి ఢిల్లీ రావలిసిందిగా ఆమెకు ఆహ్వానం అందింది.

'ఈ బహుమానం రావటంలో విజయ్ జోక్యం ఏమైనా ఉందా?' తనలోతానే తర్కించుకొంది మానసి. వెంటనే ఆ అనుమానాన్ని పక్కకు నెట్టేసింది. విజయ్‌కిప్పుడు ఇనుము, ఉక్కుతోనే సంబంధం ఉంది. రాజకీయపు ఎత్తులకూ, సాహిత్యానికీ చుట్టరికం ఉండదు. చాలాకాలం క్రితమే అతడు కవిత్వాలూ, కాకరకాయలూ చదవటం మానేశాడని మానసికి తెలుసు. పేపర్లో వచ్చే రాజకీయ కుతంత్రాలకు సంబంధించే వార్తలే అతను ఇష్టపడే సాహిత్యం.

విజయ్ ఇపుడు తను నిర్దాక్షిణ్యంగా అణగతొక్కేసిన పెద్దలనుంచే రాజకీయాల్లో ఎలా వ్యాపారం చేయాలో నేర్చుకున్నాడు. ఒకానొకప్పుడు బొంబాయిలో నోటిమాటలనే నోట్లుగా చలామణీ చేసుకున్న ప్రముఖ రాజకీయవేత్త సదాశివరావు ఇంటికీ, విజయ్‌కూ అవినాభావ సంబంధం ఉండేది. ఆ రోజుల్లో విజయ్ అక్కడా ఇక్కడా సదాశివరావు గుణగణాలను కీర్తిస్తూండేవాడు. ఎన్నికల ముందు అనేక సభలలోనూ, సమావేశాలలోనూ పాల్గొని "సదాశివరావుగారు మనకు తండ్రి వంటివారు. ఆయనే మన ఆశాజ్యోతి, మన కష్టసుఖాలను పట్టించుకొనే దిక్కు" అంటూ ఉపన్యాసాలు ఇచ్చేవాడు. కాని అప్పటికే ఆయనకు సంబంధించిన రహస్యాలు, బలహీనతలు అతనికి తెలుసు.

వృద్ధాప్యం వస్తున్న కొద్దీ చాదస్తం పెరిగిపోయిసదాశివరావు ప్రధానమంత్రినే విమర్శించటం మొదలు పెట్టటంతో కావాలనే విజయ్ ఆయనను తప్పించుకు తిరిగేవాడు. మూలపడిపోయిన ఓ అనామక రాజకీయపార్టీ ఆధారంతో సదాశివరావు మళ్ళీ అధికారంలోకి రావాలని ప్రయత్నాలు ప్రారంభించటంతో విజయ్ ఆయనపై ధ్వజమెత్తాడు. దాంతో అతనికి ఆయన తప్పులు తప్పులుగానే కనిపించసాగాయి.

అలాంటి పరిస్థితుల్లో తనకు మద్దతు ఇవ్వవలసిందిగా విజయ్‌ను కోరాడు సదాశివరావు. "చూడు విజయ్! మనదేశంలో అంగుళం అంగుళంలోను నిండిపోయిన అవినీతిని తొలిగించడానికి మనం కృషి చేయాలి" అన్నాడు సదాశివరావు. కాని విజయ్ అయిష్టంగా ఓ చిరునవ్వునవ్వి ఊరుకున్నాడు. కాని ఆపరిస్థితుల్లో విజయ్ నోరు తెరిస్తే సదాశివరావు బండారాన్ని బయట పెట్టేందుకు అనేక అస్థిపంజరాలు లేచి వచ్చి సాక్ష్యాలు ఇస్తాయి. "ఇదేమిటి? ఈయన తన గోతిని తానే తవ్వుకుంటున్నాడు." అనుకున్నాడు విజయ్.

ఇతర రాజకీయ పక్షాలను అదుపులో ఉంచటానికి అధికార పార్టీకి రెండు మార్గాలుంటాయి. ఒకటి ప్రధానమంత్రి పలుకుబడి, రెండోది డబ్బు. ప్రతీ ఎన్నికలోనూ ఈ రెండే సహాయం చేస్తున్నాయి. కాని క్రమక్రమంగా, అనుకోని విధంగా వృద్ధ రాజకీయ నాయకులకూ, ప్రధాన మంత్రికీ పొరపొచ్చాలు పెరిగిపోయాయి. చివరికి సదాశివరావుని చీటికి మాటికీ విసుక్కోవటం, ఆయన పొడ అంటేనే గిట్టకపోవటం వరకు వచ్చింది ప్రధాని పరిస్థితి.

"ప్రజలమధ్య తప్పులను ఒప్పుకో

వలసిన ఖర్మ నాకేం పట్టలేదు" అన్నాడు ప్రధానమంత్రి కోపంగా సదాశివరావు వైపు తిరిగి. ఆ కోపంలో ఆయన ముఖంలో ముడతలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. సదాశివరావు ముఖం అప్పటికే వాడిపోయి ఉంది. "నువ్వు చేసిన అవినీతి పనులను, అన్యాయాలను ప్రజలకు చెప్పి క్షమించమని కోరుతున్నావని తెలిసింది. నువ్వుచేసిన వెధవ పనులు నువొక్కడివే చేసినవి కావు. నువ్వు అలా చేయటం వల్ల మొత్తం కేంద్రమంత్రి వర్గమే అప్రతిష్టపాలవుతుంది. నా ప్రభుత్వాన్ని పడగొడదామనా నీ ఉద్దేశం ? మా పార్టీని అధికారంలోంచి దింపేసి నువ్వు ఆ పదవిని చేపట్టాలని ఉబలాట పడుతున్నావా ?" తీవ్రంగా, తీక్షణంగా అడిగారు ప్రధాని.

"మనం స్థాపించిన పార్టీకంటే-ఆపార్టీ స్థాపించటానికి దోహదం చేసిన పరిస్థితులు, పార్టీ లక్ష్యాలే గొప్పవి, ప్రజల అభీష్టాలను సిద్ధింప చేయటానికే రాజకీయ పార్టీలు ఏర్పడ్డాయి. జీవితంలో నేను మొదటిసారిగా ప్రజల గురించీ, వారి మంచి చెడ్డల గురించీ ఆలోచించడం మొదలు పెట్టాను. రాజకీయ పార్టీలకంటే ప్రజలే ముఖ్యమని నేను గుర్తించాను. మనలను ఎన్నుకొన్న ప్రజలకు సేవ చేయటం మన విధి. మనం వారికి ప్రతినిధులం."

"ఆఁ! అదే! అదే! నేనంటున్నదీను" వేళాకోళంగా అన్నా, గద్దించిన ధోరణిలో అన్నారు ప్రధాని. "ఇది నీ అంతట నీకు పుట్టిన బుద్ధే అని నేను నమ్మను. నిజం చెప్పు? కిందటిసారి ఎన్నికలలో గెలవటానికి నువ్వు ఇరవై లక్షలు ఖర్చుపెట్టలేదూ? మనం ఓట్లను కొంటున్నాం. తద్వారా పదవులను కొనుక్కుంటున్నాం. ఆర్థికంగా వాళ్ళూ వీళ్ళూ సహాయంచెయ్యకపోతే ఏ సన్యాసీ పార్లమెంటులో అడుగు పెట్టలేడు. నిజం చెప్పాలంటే దేశాన్ని పరిపాలిస్తున్నదిమనలాంటి ప్రజాప్రతినిధులు కాదు. ఈ దేశం కోటీశ్వరులు, బడా పారిశ్రామిక వేత్తల చేతుల్లో ఉంది. రహస్యంగా లక్షలకు లక్షలు విరాళాలు ఇచ్చి మనలాంటి వారి మరుగున వాళ్ళే ప్రభుత్వాన్ని నడిపిస్తున్నారు." వాస్తవాన్ని జ్ఞాపకం చేసినా బాధ్యతా రహితంగా ఉన్నాయాయన మాటలు.

"అవును. వాళ్ళే మనలను పైకి తీసుకువచ్చారు. కీలు బొమ్మల్ని ఆడిస్తున్నట్టు వాళ్ళు మనల్ని ఆడిస్తున్నారు. వారి అవసరాలను మన ద్వారా తీర్చుకుంటున్నారు; కాని మనది ప్రజాస్వామ్యం. ఆ పేరు నిలబెట్టాలంటే ఈ పద్ధతిమారాలి. మారి తీరాలి" కొంచెం ఆవేశంగానే అన్నాడు సదాశివరావు.

"ఇంతకీ నీ ఉద్దేశ్యం ఏమిటి? మమ్మల్నందర్నీ దుర్మార్గులుగాను, అవినీతి పరులుగాను ప్రజల ముందు రుజువు చేద్దామను కుంటున్నావా" ప్రధానమంత్రి ముఖం కోపంతో జేవురించింది.

సదాశివరావు బిగ్గరగా నవ్వాడు. "నేనేం చేయాలనుకుంటున్నానో నాకే తెలియదు." అంటూ డబ్బాలోంచి చిటికెడు ముక్కుపొడుం తీసి గట్టిగా శబ్దం చేస్తూ పీల్చాడు. "సామాన్య ప్రజలను ఇంకా మోసం చేయటం నాకు చేతకాదు."

"ఎవరయ్యా సామాన్యుడు? ఎలా ఉంటాడు? ఎక్కడ ఉంటాడు?నీకు కనిపించాడా? ఏదీ! వాణ్ణొక్కసారి నా దగ్గరికి

రమ్మను! వాడికేం కావాలో, కనీసం వాడేం కావాలనుకుంటున్నాడో నాకే మాత్రం తెలియదని వాడితో చెబుతాను! ఓసారి వాణ్ణిలా రమ్మను" ఎకసక్కెంగా అన్నారు ప్రధాని.

"నీకు పిచ్చెక్కింది. నీకు సామాన్యుడెవరో, ఎలా ఉంటాడో తెలియటం లేదూ! బహుశ నీకు కళ్ళు మూసుకుపోయి ఉంటాయి. నువ్వు నీ పక్కన నిలబడే మంత్రులను చూడగలవు, నీ భజన పరులను చూడగలవు! పలుకుబడి, డబ్బూ పోతగా పోసిన విగ్రహాల్లాంటి మనుషులే నీకు కనిపిస్తారు. నువ్వు కూసే ప్రతి కూతనీ వేదవాక్యంలా అచ్చువేసే పత్రికా విలేకరులే నీకు కనిపిస్తారు. నువ్వు సామాన్యుణ్ణి చూడలేవు. ఆ అమాయకుడు ఎక్కడపడితే అక్కడే ఉన్నాడు. గాలిలా ప్రపంచమంత వ్యాపించియున్నాడు. వాడు అంత గొప్పవాడు కనుకనే నిన్ను ఈ రోజున ఈ స్థితికి తేగలిగాడు. ఈ సింహాసనం నీకు కట్టబెట్టాడు. ప్చ్! నా అన్నలకూ, తమ్ములకూ, అక్కలకూ, చెల్లెళ్ళకూ అందరికీ నేను ద్రోహం చేశాను. ఈ దేశానికి, దేశ ప్రజలకి నేను ద్రోహం చేశాను" పట్టరాని కోపం, బాధ సదాశివరావు మాటల్లో ప్రతిధ్వనించింది.

"కొన్ని చిన్న చిన్న కారణాలవల్ల నిన్ను మేము ప్రధాన మంత్రి పదవికి ఎన్నుకున్నాం. నువ్వు ఎందుకూ పనికిరాని వాడివనీ, అందువల్ల నీ వల్ల మాకేం ప్రమాదం రాదనీ నాలాంటి వయసు మళ్ళిన వాళ్ళం నీకి పదవిని పట్టం కట్టాం. సొంత ఆలోచనలు, సొంత వ్యక్తిత్వం ఉన్న ప్రధాన మంత్రి కావాలని నిన్నెన్నుకోలేదు. నువ్వు ఫరవాలేదు, నమ్మకస్తుడివి అనే ఉద్దేశంతోనే మేమీ పనిచేశాం. మాకు ఓ బొమ్మ కావాలి. ఆ బొమ్మవి నువ్వైతేనే బావుంటుందనుకున్నాం. కాని నువ్వు ఇలా విపరీతంగా ప్రవర్తిస్తావని మేము అప్పుడు అనుకోలేదు. నువ్వు మేక వన్నె పులివి. మావంటి తల నెరిసిన రాజకీయ నాయకుల అనుభవం ముందు నువ్వెంత? నీ పగ వెంత? చూస్తూ ఉండు... త్వరలోనే నీ పరిస్థితి ఎలా మారుతుందో...? నిన్ను ఆకాశానికెత్తుతున్న పత్రికలే దుమ్మెత్తి పోస్తాయి. ప్రజలను, పత్రికలను ఆకట్టుకోవటానికి ఆకర్షణీయంగా నినాదాలు, హామీలు ఇవ్వగానే సరికాదు. నువ్వు చేసిన ప్రకటనలని, ఇచ్చిన హామీలని ఊకదంపుడు ఉపన్యాసంగా భావించే రోజులు వస్తాయి. అప్పుడు తెలుస్తుంది...." సదాశివరావు మనసులోని ఉద్దేశాలను ఆయన కోపం, అసహ్యం ఆయనకు తెలియకుండానే బయట పెట్టాయి.

"చాలు! ఇంక కట్టి పెట్టు. నీకు దగ్గర దగ్గర డబ్భై ఏళ్ళు వచ్చాయి. నా తండ్రికున్నంత వయసుందని నిన్ను వదిలేస్తున్నాను. లేకుంటే నిన్ను ఇక్కడే నామరూపాలు లేకుండా చేసేవాడిని. అర్థంపర్థం లేకుండా వాగకు. నువ్వు ఇప్పుడు ఈ దేశ ప్రధాన మంత్రితో మాట్లాడుతున్నావని మరిచిపోయినట్టున్నావు. ఆఫ్టరాల్ నువ్వు ఇప్పుడు ఓ మాజీ మంత్రివి మాత్రమే! సత్తు రూపాయిలాంటి వాడివి. ఒళ్ళు దగ్గర పెట్టుకు మాట్లాడు."

"సరే నేనిప్పుడు వెళ్తున్నాను. అదీ కాక ఇప్పుడు నేను కాసేపు విశ్రాంతి తీసుకోవాలి. నీకు కూడా బాగా రెస్టు అవసరం. అన్నట్టుఇవాళ సాయంత్రం నువ్వు అమె

రికా రాయబారిని కలుసుకోబోతున్నావు కదూ? " సాలోచనగా అడిగాడు సదాశివ రావు.

ప్రధాన మంత్రి సమాధానం చెప్ప లేదు. అలాగే ఉలుకూ, పలుకూ లేకుండా మౌనంగా కూర్చుని ఉన్నాడు. తనతో మాట్లాడటానికి వచ్చిన పెద్దవాళ్ళెవరైనా మళ్ళీవెళ్ళిపోయేవరకూ ఆయనకు అక్కడే కూర్చోవటం అలవాటు. ఇప్పుడాయన ముఖం ఎర్రగా కంద గడ్డలా ఉంది.

సదాశివరావు ఏదో నిర్ణయించుకున్నట్లు తల ఊపి చిరునవ్వు నవ్వుతూ తలుపు వైపు నడిచాడు. వేళ్ళు పాతుకుపోయిన చెట్టులా ఉన్న ప్రధానిని వెంటనే తొలగిం చటం కంటే ఓ ప్రతి పక్షాన్ని తయారు చేయటం మంచిదని ఆయన నిర్ణయించు కున్నాడు. కాని అలా చేయటానికి కూడా కొంత కాలంపడుతుందని అతనికి తెలుసు. ప్రధానిపదవీకాలం పూర్తయ్యేందుకు మరో అయిదేళ్ళు పడుతుంది.

అంత కాలంపాటు సదాశివరావు బతి కుంటాడా ? ఏమో !

సదాశివరావు గుమ్మం దగ్గరకు వచ్చే టప్పటికి గది బయట ప్రధానమంత్రి సెక్రటరీతోపాటు విజయ్ కూడా నిలబడి ఉన్నాడు. విజయ్‌ని చూసి సదాశివరావు పలకరింపుగా నవ్వాడు. అతని వీపు తట్టి "సారీ! ఏమనుకోకు ! నిన్ను ఇంతసేపు బయట నిలబెట్టవలసి వచ్చింది. అన్నట్టు నీకు ఇనుము, ఉక్కు మంత్రిత్వశాఖ అప్పగించారటకదూ! కంగ్రాచ్యులేషన్స్" అంటూ వెళ్ళిపోయాడు.

విజయ్ మామూలుగా నవ్వాడు. "మీలాంటి పెద్దల ఆశీర్వాదం ఉంటేచాలు అదే పదివేలు" అని సదాశివరావుతో వినయంగా అని కంగారు కంగారుగా ప్రధానిని కలుసుకోవటానికి వెళ్ళాడతను.



"ఈ సదాశివరావు ఉద్దేశం ఏమిటసలు? చాలా పిచ్చిపిచ్చిగా వాగాడు ఇప్పుడు" విజయ్‌ని అడిగారు ప్రధాని.

"అలాంటి వాడి మాటలు పట్టించుకొని, లేనిపోని తలనెప్పి కొనితెచ్చుకోకండి సార్! ఆ ముసలాడికి ఇప్పుడు నేను నిర్వ హిస్తున్న మంత్రిత్వ శాఖ కావాలి. అదీ అసలు ఏడుపు. ప్రపంచానికంతటికీ తెలుసు ఆ విషయం. ఆయన ఎలాంటి వాడో మీకు మాత్రం తెలియదూ! ఆయన సొంత రాష్ట్రంలో ఎంతోమందికి ఇనుము, ఉక్కు కోటా ఇప్పిస్తానని మాటఇచ్చాడు. ఇప్పుడు వాళ్ళంతా తన మీదికి ఎక్కడ దండెత్తి వస్తారోనని, ఇచ్చిన డబ్బు మళ్ళీ తీసేసుకుంటారేమోనని ముసలాడి భయం"

"ఏమిటి! వాళ్ళ దగ్గర డబ్బు తీసుకున్నాడా? అంటే లంచం..."

"అందులో సందేహమా !? ఆయన ఎప్పుడూ అంతే! అలా ఎంతమంది దగ్గర ఎంత సొమ్ము తీసుకున్నాడో లెక్కలేదు. ఖర్మం చాలక ఆ పని చేసిపెట్టలేకపోతే సాధ్యమైనంత వరకూ మంచి మాటలు చెప్పి వాళ్ళని పంపించేస్తూ ఉంటాడు. కాదూకూడదూ అని పట్టుబడితే వాళ్ళని బ్లాక్ మెయిల్ చేయటానికి కూడా వెనకాడడు. ఆయన ఎన్నివిధాలుగా పక్కదోవలు తొక్కుతాడో నాకు తెలుసు. అలాంటివి ఇంకా ఎన్ని కథలున్నాయో! కాని మన పార్టీ మనిషిని రచ్చకీడ్చటం నాకు ఇష్టం ఉండదు" ఒక్కో సమిధను అగ్నిగుండంలో వేయసాగాడు విజయ్.

"సదాశివరావు అంత దిగజారిపోయాడా! కాని, అతనికి ఇంకా పలుకుబడి మిగిలినట్లుందే! అతను మనకి ఎదురు తిరిగాడుకదా! దానివల్ల మనకేమైనా ఇబ్బందుంటుందంటావా?"

"ఈ బడా వ్యాపారస్థులు, పారిశ్రామిక వేత్తల మనస్తత్వం నాకు కొట్టినపిండే! వాళ్ళని ఉదయిస్తున్న సూర్యుడే ఆకర్షిస్తాడు. సదాశివరావుకి పదవి లేదుకనక ఆయన ఇంటివైపు తొంగి చూసే కాకులేమీ ఉండవు"

"అయితే ఆ కాకులన్నీ నీఇంటి మీద వాలున్నాయా?" ఆటపట్టిస్తున్నట్టు నవ్వారు ప్రధాని.

"కాకుల్నీ, గద్దలనీ నా యింటి మీద వాలనివ్వను. ఎప్పుడేనా కొంచెం ఖాళీ దొరికితే తీరికగా ఏదైనా కవిత్వం చదువుకుంటూ కూర్చుంటాను. అంతే!"

"ఏమిటి! కవిత్వమా? కేంద్రమంత్రి వర్గంలో కవిత్వాలను ఇష్టపడే మంత్రి ఒకడున్నాడని నాకు ఇంతవరకూ తెలియదే!" ఆశ్చర్యంగా అన్నారు ప్రధాని. "ఇది నిజంగా విశేషమే! విజయ్! నాకు కూడా కవిత్వం అంటే చాలా ఇష్టం. బెంగాలీ కవయిత్రి మానసి రాసిన కవితలు ఎప్పుడైనా చదివావా? ఆవిడ ఇంగ్లీషులో రాసుందట! అందుకే కాటోలు ఆవిడని ఇండో ఆంగ్లియన్ కవయిత్రి అంటారు. అవకాశం ఉంటే ఆవిడ రాసిన కవితా సంకలనాన్ని ఒకటి తెచ్చి పెట్టగలవా! సభలలో ఎప్పుడైనా ఆవిడ కవిత్వాన్ని 'కోట్' చేస్తే బావుంటుంది కదూ" చిన్న పిల్లాడిలా అన్నారు ప్రధాని.

"ఈ ఏడాది ఆవిడకు కూడా అవార్డు వచ్చింది, నిన్నే పేపర్లో చూశాను. నిజానికి నేనే ఆవిడని మీకు పరిచయం చేద్దామనుకున్నాను. కల్తీ లేని నిజాయితీ గల

ఆదర్శ వాదానికి ఆవిడ ప్రతీక. అలాంటి స్వచ్ఛమైన ఆదర్శవాదులను మన పార్టీలో చేర్పిస్తే పార్టీ ప్రతిష్ట పెరుగుతుంది కూడా! బెంగాల్ విద్యార్థులంతా ఆవిడను ఆరాధిస్తారు. మనం ఆవిడను బెంగాల్‌లో మన పార్టీ తరఫున అభ్యర్థిగా నిలబెడితే ఒక్క దెబ్బకు రెండు పిట్టలు రాలుతాయి. ఆవిడకు అనుకూలంగా మార్క్సిస్టు పార్టీ అభ్యర్థి పోటీనుంచి విరమించుకుంటాడు. మన పార్టీకూడా అభ్యుదయ భావాలుగల పార్టీగామంచి పేరు సంపాయించుకొంటుంది. ఇప్పటికే మన విధానాలు చాలా బావుంటున్నాయని అంతా అంటున్నారుకూడా"

"అంతా అంటున్నారా? ఎవరువాళ్ళు" ఏదో గుర్తుకు తెచ్చుకున్నవాడిలా అన్నారు ప్రధాని.

"సామాన్యులు" స్పష్టం చేశాడు విజయ్.

"సామాన్యులా? నువ్వుకూడా సామాన్యుల గురించి మాట్లాడుతున్నావేమిటి? పైగా నా దగ్గర! వాళ్ళను నువ్వెప్పుడు కలుసుకున్నావు? వాళ్ళకేం తెలుసు మన గురించి? మన విషయాలు వాళ్ళకెవరు చెప్పారు?" హఠాత్తుగా ఉద్రేకపడిపోయారు ప్రధాని.

"మీకు ఇవాళ ఒంట్లో కులాసాగా లేనట్లుంది! మీ మనసు ఏదో కలత పడినట్లుంది. చూడండి ముఖం ఎలా వాడిపోయిందో! మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి" విధేయతతో సలహా చెప్పాడు విజయ్!

"ఎలా విశ్రాంతి తీసుకోను! అమెరికా నుంచి ఇవాళ కొత్తరాయబారి వస్తున్నాడు. అతనితో నేను ఏయే విషయాలు చర్చించాలో వరదాచారి చెప్పనేలేదు. ఇప్పటివరకూ ఆయన ఇటు రానేలేదు. ఇప్పుడు అమెరికాలో మన సంబంధాలు ఏ స్థితిలో ఉన్నాయి? నా అసిస్టెంటును పంపి మన విదేశాంగ మంత్రిని అర్జంటుగా ఇక్కడికి రమ్మన్నానని చెప్పు. అమెరికా రాయబారితో సినిమాల మంచి చెడ్డ గురించి చర్చించ కూడదు కదా! ఏమంటావు? వీళ్ళంతా ఇవాళ ఎక్కడికి పోయారో అర్థం కావట్లేదు. అంతా ఒక్కసారిగా ఇలా బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తున్నారేమిటి?" గుక్కతిప్పుకోకుండా చిరాకునంతటినీ ప్రదర్శించారు ప్రధాని.

"ఒక్క అరగంట మీరు విశ్రాంతి తీసుకోండి! వరదాచారినీ, విదేశాంగ మంత్రిని వెంటనే పంపుతాను. అదృష్టవశాత్తు అమెరికాతో మన సంబంధాలు బాగానే ఉన్నాయి. అంతకు మించి ఏమీ లేదు..." నచ్చచెప్పాడు విజయ్.

ప్రధాని తప్పనిసరి అయినట్లు మెల్లిగా లేచి వెళ్ళారు విశ్రాంతి తీసుకోవటానికి. "థాంక్యు విజయ్!" అంటూ గొణుక్కుంటున్న ప్రధాని వెళ్ళిపోయిన తరువాత విజయ్‌కూడా బయటకు నడిచాడు.




మానసికి, ఆమె భర్తకూ ఎప్పుడూ డబ్బు గురించే గొడవ పెరుగుతుంది. పండిపోయిన ఆకులా తన శరీరం రంగు తేలిపోతున్నదని ఆమె గమనించింది. కాలానికి శిశిరం ఎంతో, మనిషికి

వృద్ధాప్యం అంతేనని ఆమె ఉద్దేశం. తరిగి పోతున్న యవ్వనానికి గుర్తు శిశిరం. వసంతాన్ని పట్టి పీడించే పీడకల లాంటి శిశిరం అంటే ఆమెకు తగని అసహ్యం.

కిరీటంలా ఉన్న ఆమె తలకట్టులో నెరుస్తున్న ప్రతి శిరోజాన్ని ఆమె పీకి పారేస్తుంది. భర్త ప్రేమ ఆమెకు ఛేదించ లేని కంచుకోటలాంటిది. ఒక భార్య గానో, తల్లిగానో, యజమానురాలుగానో ఆమె ఉండాలి అని అతను అనుకోని సందర్భాల్లో రచయిత్రిగా మానసి వ్యక్తిత్వం చాలా గొప్పది అనుకుంటా డతను. ప్రతీ రచయిత్రీ ఎప్పుడో ఒకప్పుడు నిర్వర్తించే దైనందిన కార్యకలాపాలు ఆమెకూడా నిర్వర్తిస్తూ ఉంటే ఆమె పట్ల అతనికిగల గౌరవం, అభిమానం గమ నించినపుడు మానసి కూడా ఆశ్చర్య పోవలసిందే!

"నేను రచయిత్రిని కాకపోయినా మీరు నన్ను పెళ్ళి చేసుకుని ఇంత ఆద రంగానూ చూసేవారా!" అని ఆమె అడి గిన ప్రతీసారి అతను చిరునవ్వుతో "నువ్వు ఎప్పటికీ ఆదరించతగిన వ్యక్తివే అయితే అందుకు కారణం నీ మేధా సంపద" అనేవాడు.

ఆ జవాబు కాదు ఆమె అతనినుంచి కోరేది. నిండుగా, పరిపూర్ణాకృతిలో ఉన్న ఆమె ఎత్తైన గుండెలను, పట్టులా, సుతి మెత్తగా ఉన్న ఆమె ఊరువులను తన భర్త మెచ్చుకోవాలని మానసి ఉద్దేశం. అతను అమూల్యమైన కానుకలు తెస్తూ తనను అనునిత్యం సంతోషంలో ముంచెత్తాలని ఆమె కోరిక.

ఆమెకు శరీరంమీద ఆదర్శవాదమే ఉంది. ఆమెకు దాపుడు చీర ఒక్కటి కూడాలేదు. ఏదేనా సమావేశాలకో, సభ లకో వెళ్ళాలంటే ఆమెకు తల కొట్టేసి నట్లు ఉంటోంది. భర్తని ఆమె ఒక చీర కావాలి అని నోరు విడిచి అడిగితే వెంటనే అతను బయటకువెళ్ళి ఖరీదైన చీరే తెచ్చి స్తాడు. కాని ఆ నెలంతా అతను మధ్యా హ్నం పూట టిఫిను, కాఫీ మానెయ్యటం లాంటి ఇబ్బందులు పడతాడు. అది తెలిసే ఆమె అలా ఎప్పుడు భర్తను ఏదీ కావా లని అడగదు. ఎప్పుడేనా చీరలు వగ్గె రాలు చిరుగు పట్టినా వాటిని ఆమె డార్నింగ్ చేయించి సర్దుకుంటుంది. ఓ రోజు పొద్దున్నే చిరిగిపోయిన బట్టలను కుట్టుకుంటుంటే హఠాత్తుగా ఓ అపరిచి తుడు ఆమె దగ్గరకు వచ్చాడు.

"నా పేరు కృష్ణన్. నేను విజయ్‌రాజే స్నేహితుడిని. కొంచెం పనిమీద ఢిల్లీనుంచి ఇక్కడికి వచ్చాను. విజయ్ మిమ్మల్ని చూసి రమ్మన్నారు" అన్నాడు అతను నమస్కరిస్తూ.

కృష్ణన్‌ని చూడగానే 'ఏదో పెద్ద కంపెనీలో అధికారిక హోదాలో ఉన్న వాడిలా కనిపిస్తున్నాడు. నలభై య్యేవ పడిలో పడినా కుర్రాడిలా ఉంది వేష ధారణ. ఉద్యోగంలో పై పైకి వెళ్ళటం కోసం వినయం నటిస్తున్నాడా ఇతను' అనుకుంది మానసి. అతను ఆవాల రంగులో ఉన్న షర్టు, గోధుమ రంగు పేంటు చిన్నపిల్లల అరచెయ్యంత వెడల్పున్న బెల్టు కట్టుకొని ఉన్నాడు. పేంటు చీల మండలవరకూ వేలాడుతోంది. "కూర్చోండి" అంది మానసి కృష్ణన్‌ని ఉద్దేశించి.

"విజయ్‌ని మంత్రివర్గంలోకి తీసుకు న్నారని తెలిసి చాలా సంతోషించానని

చెప్పండి. అతను అందరి దృష్టినీ ఆకట్టుకుంటాడు. ప్రధాన మంత్రీ, ఇతనూతప్ప మిగిలిన వారంతా చూడ్డానికి ఏమంత బావుండరు కదూ" అంది మానసి.

ఆ మాటలకు కృష్ణన్ గట్టిగానవ్వాడు. ఆ నవ్వు ఎదుటివారి దృష్టిని తనవైపు ఆకర్షించుకునేట్టూ, వారితో తనకు ఎంతో కాలం నుంచీ స్నేహం ఉన్నట్టూ ఉంది. ఆ నవ్వులో ఏదో వ్యంగ్యం ఉందని ఆమె అనుకుంది. అతను అక్కడినుంచి లేచి వెళ్ళిపోతే బావుణ్ణని తలపోసింది. కాని అతను ఓ పెద్దమనిషి దగ్గర నుంచి వచ్చాడు. కృష్ణన్ తాను వచ్చిన పని చెప్పినపుడు ఆమె కొన్ని నిమిషాలు అవాక్కయిపోయింది.

'విజయ్ నన్ను తీసుకురమ్మన్నాడా? నేనేమైనా బజారు మనిషినా?' అనుకుందామె.

ఓ వారం రోజులపాటు ఆమె విజయ్‌తో సిమ్లాలో గడపాలి. అందుకు ప్రతిఫలంగా ఆమెకు అతను వజ్రాలు పొదిగిన చెవిరింగుల జత బహూకరిస్తాడు. అదీ కృష్ణన్ తీసుకువచ్చిన కబురు.

కృష్ణన్‌ని బయటకు విసిరెయ్యాలన్నంత కోపం వచ్చింది మానసికి. 'వీడో పెద్ద తార్పుడుగాడులా ఉన్నాడే' అనుకొందామె. కాని వజ్రాలరింగులు ఆమె చిన్ననాటి కల. చిరకాలవాంఛ. వజ్రాలు పొదిగిన వేలాడే రింగులు ... తెలుపు, నీలం రంగు రాళ్ళు తాపిన రింగులు...ఆ రాళ్ళు చిన్న చిన్న గ్రహాల్లా రింగులలో వేలాడుతుంటే ...

ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోపోతే బహుశా ఆమె వజ్రాల రింగుల కోరిక తీరకుండానే చనిపోతుందేమో! చాలా సేపు మానసి మౌనంగానే ఉంది. చివరికి ఆమె నోరు పెగిల్చింది. సిగ్గువల్ల కంఠం వణికింది. "వస్తానని చెప్పు. వచ్చే నెలలో సాహిత్య అవార్డు తీసుకొని సిమ్లా వస్తాను అప్పుడు అతనితో ఓ వారంపాటు ఉంటాను. ఊరు విడిచి వెళ్ళటానికి మా ఆయన్ని ఒప్పించాలి కదా? ఫరవాలేదనుకో నేను అడిగితే ఆయన కాదనరు. ఆయనకి నా పాతివ్రత్యం మీద మహా నమ్మకం" అంది ఆమె.

"మీమీద అలాంటి అపనమ్మకం ఎవరికి కలుగుతుంది లెండి! ఆదర్శవాదానికి మీరు మారుపేరు. పైగా నిరాడంబరులు" విషపూరితంగా నవ్వుతూ అన్నాడు కృష్ణన్.

''నన్ను అవహేళన చేస్తున్నావా?" మానసి కంఠం నూతిలోంచి మాట్లాడుతున్నట్టుంది.

''లేదు మేడమ్! లేదు. అలాంటిదేమీ లేదు. మీరంటే నాకు చాలా గౌరవం. విజయ్ నాతో మా అన్నకంటే ఎక్కువ చనువుగా ఉంటారు. ఆయన మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకున్నారని నాకు తెలుసు. కాని అలా జరగలేదు. కారణం మీ ఆయనపై మీకున్న గౌరవం. విజయ్ మీ గురించి ప్రతిక్షణం బాధపడతారు. తిండి కూడా సరిగా తినడం లేదు. రెండు మూడుగంటలు పడుకుంటారేమో! అంతే. ఏ పనిమీద శ్రద్ధ చూపలేకపోతున్నారు. మానసి నామీద దయచూపకపోతే నేను పిచ్చివాడినైపోతానేమో కూడా అన్నారాయన. నిన్న నన్ను విమానం ఎక్కించటానికి వచ్చినపుడు నాతో చెప్పారు. ఈ శుభ వార్త ఆయనకు చెబితే చిన్న పిల్లాడిలా చప్పట్లు కొట్టి గంతులేస్తారేమో కూడా!" అన్నాడు కృష్ణన్.

అతను వెళ్ళిపోయాక మానసి అద్దం దగ్గరకు వెళ్ళింది. గది తలుపులు మూసేసి బట్టలన్నీ విప్పేసి నగ్నంగా తయారయింది.

ఆమె ఇంకా విజయ్ కోరిక తీర్చ గలిగినంత అందంగా ఉందా? ఆమె ఆకర్ష ణీయమైన ఎత్తుల పొంకం కొంచెం... కొంచెం కూడా సడల లేదా? ఆమె రంభో రువుల బింకం తగ్గిపోలేదా? అపరగోపాల కృష్ణుడు లాంటి యువ రాజకీయవేత్తకు తన శరీరం అర్పించటానికి, ఆమె ఇంకా కాంతి తరిగిపోని వజ్రమేనా? – అతను అనేక దేశాలకు చెందిన అప్సరసలను మించిన అందగత్తెలను అనుభవించాడు. అతనిని సుఖపెట్టటానికి ఎంతో మంది సుముఖంగా ఉంటారు. కళాత్మకంగా, ఏ విధమైన ఉద్రేకానికీ లోనుకాకుండా ఇలాంటి పనులలో ఎలా పాల్గొనాలో సదాశివరావు దగ్గర క్షుణ్ణంగా నేర్చు కున్నాడు. సదాశివరావు ఇంట్లో అప్పు డప్పుడు అనేక జంటలు కలిసిమెలసి ఒకే గదిలో విపరీతంగా ప్రవర్తించటం అతనెన్నో సార్లు చూశాడు.

మానసిని విజయ్ ఎందుకు కాంక్షిసు న్నట్టు? ఆమె ప్రతిఫలాన్ని ఆశించి పది మందిలో తిరిగే సామాన్య స్త్రీ కాదు. ఆమె భర్త ఎదురుగుండానే బట్టలు మార్చు కోవటానికి సిగ్గుపడి పోతుంది. తన చిరకాల వాంఛితాన్ని నెరవేర్చుకోవ టానికి, కేవలం వజ్రాల రింగుల కోసం ఆమె తన సిగ్గునూ, అభిమానాన్ని పణంగా పెడుతోంది.

అద్దంలో కనిపిస్తున్న మానసి కళా విహీనంగా ఉన్నట్టు ఉంది. ఇరవై ఏళ్లుగా తన ప్రతిబింబాన్నే చూపిస్తున్న ఆ అద్దం ఆమెను హఠాత్తుగా కలచివేసింది. ఇదంతా దురాశవల్ల జరుగుతోందా? కాంక్షవల్ల జరుగుతోందా?? ఆమె ముఖాన్ని తిప్పేసు కుంది.

ఢిల్లీలో జరగబోయే సభలో పాల్గొన్న తరవాత ఓ వారం పాటు సిమ్లాలో ఉండి వస్తానంటే తాను కూడా వస్తానన్నాడు మానసి భర్త. "నీకు సిమ్లా పూర్తిగా కొత్త. ఒంటరిగా ఉండటం కష్టం. నేను ఓ పదిహేను రోజులు సెలవు పెట్టి నీతో కూడా వస్తాను" అన్నాడు మిత్రా.

"అమ్మో! వద్దు మీరు మాత్రం రావద్దు. నాతోపాటు చాలామంది ప్రతి నిధులు సిమ్లా వస్తున్నారు. నిజానికి అది రచయితల సమావేశం లాంటిది. నాకేం ఫరవాలేదు. మా బృందంలో చాలామంది రచయిత్రులు ఉంటారు" ఇంచుమించు అరిచినట్లుగా అంది మానసి.

మొత్తానికి అయిష్టంగానే అంగీక రించాడు మిత్రా. "నీకు మంచు, మంచు కొండలు చూడటం అంటే చాలా ఇష్టం కదూ! నీకు తెలుసు కదూ! నేనే నిన్ను సిమ్లాకో, డార్జిలింగ్‌కో తీసుకు వెళ్ళి నువ్వు చూడాలనుకున్నవాటిని చూపించే వాడిని. కాని నేను పేదవాడిని. అప్పు డప్పుడు నాకు చాలా సిగ్గేస్తూంటుంది! మానసీ! నీలాంటి స్త్రీకి నాలాంటి భర్త తగడు. దేశ దేశాలూ తిప్పి నీకు తగిన అవకాశాలు కల్పించగల కోటీశ్వరుడ్లాంటి వాడికి భార్య కాదగిన దానివి. అమెరికా లాంటి ధనవంతమైన దేశంలో నీ అభిరుచి సామర్థ్యాల ద్వారా నువ్విపాటికి కోట్లకు పడగెత్తే దానివి" అన్నాడు మిత్రా.

"నేనెప్పుడూ డబ్బుకోసం పాకులాడ లేదు... నీకు తెలుసు... నేను అలాంటి

దాన్ని కాదు" అంది మానసి లోగొంతు కతో...

"తెలుసు...తెలుసు... నాకు అన్నీ తెలుసు! కాని ఇప్పటికీ ఈ బొంబాయి మహానగరంలో నా అంత అదృష్టవంతుడు లేడు" అంటూ అమోల్ మిత్రా గొణిగి, ఆమె కనుబొమలపై మెల్లిగా ముద్దుపెట్టు కున్నాడు.

ప్రయాణానికి వెళ్ళే ముందు మానసి ఓ తెల్ల ఖద్దరు చీరను కొనుక్కుంది. సిమ్లా లాంటి చల్లని ప్రదేశాల్లో ఖద్దరు చీరలు చలికి ఆగవని ఆమెకు తెలుసు. చీరతోపాటు మట్టి రంగులో ఉన్న ఓ శాలువా కూడా కొంది. భుజాల నిండుగా దాన్ని కప్పుకొంటే సర్వసుఖాలూ పరిత్య జించిన సన్యాసినిలా కనిపించింది మానసి.

ఢిల్లీలో ఆమె రాకకోసం విమానా శ్రయంలో ఎదురుచూడ సాగాడు విజయ్! విమానం దిగగానే ఆమె నడుంచుట్టూ చెయ్యి వేసి మానసిని కారు దగ్గరకు తీసుకువెళ్ళాడు,

సామాను తీసుకు రావటానికి మనిషిని నియోగించాడు. ఎయిర్‌పోర్టులో జరగవలసిన తతంగం క్షణాల్లో పూర్తయి పోయింది. విజయ్ అందంగా, ఆరో గ్యంగా కనిపించాడు. 'నేను వయసుమీరి పోయినట్టు కనిపిస్తున్నానా?' అనుకుంది మానసి కారులో డ్రైవరు దగ్గర ఉన్న అద్దంలో కనిపిస్తున్న తన మొహం చూసుకొంటూ.

విజయ్ ఆమె చేతిని మృదువుగా స్పృశించాడు."నువ్వు మహారాణిలా వెలిగి పోతున్నావు" అన్నాడు విజయ్, గాలికి ఎగిరి చెవులకు తాకుతున్న ఆమె కురు లను సరిచేస్తూ. "నాకు ఇవాళ చాలా సంతోషంగా ఉంది మానసీ!" అతను గుసగుసలాడాడు.

ఖరీదైన హోటళ్ళకు, విందులకు ఆమెను తీసుకు వెళ్ళినపుడు మానసిమహా ఇబ్బంది పడేది. ఫోర్కు‌లు, చెంచాలతో భోజనం చేయలేక తడబడేది. "నాకు ఇలాంటి చోట ఎలా భోంచెయ్యాలో సరిగా తెలియదు. బొంబాయిలోనే ఎప్పు డైనా, ఎక్కడికైనా ఖరీదైన విందులకు వెళ్ళాలంటే చచ్చే భయం వేసేది. నీ లాంటి ధనవంతుల ఆహారపు అలవాట్లు నాకంతగా ఒంటబట్ట లేదు" అంది మానసి నవ్వుతూ. ఆమె చేతిలో చెయ్యి వేసి నడుస్తూ, అకారణంగా ఆమె కళ్ళ లోకి చూస్తూ నవ్వేశాడు విజయ్. "ఇలాంటివన్నీ నీకెందుకులే? నీకు ఫేష న్లక్కరలేదు. కాలంతోపాటు మారాలని లేదు. అందరిదీ ఓదారీ...నీది మరోదారి. నువ్వు మహా మేధావివి. నువ్వు తెలుసుకోవాలన్నది కవిత్వం గురించే. ఆ పని నువ్వు బ్రహ్మాండంగా చేస్తు న్నావు" అన్నాడతను.

"నేను కవయిత్రిగానే ఉండిపోవాలను కోవటం లేదు. ప్రజలందరిచేత ఆరాధింప బడాలనీ, ప్రేమింప బడాలనీ కూడా అనుకుంటున్నాను" మానసి మనసు విప్పింది.

"ఏమిటి! చిన్న పిల్లలా మాట్లాడు తున్నావు? ఇవాళ నిన్ను ప్రధానమంత్రికి పరిచయం చేస్తాను. ఆయన నిన్ను చూడాలని చాలాకాలం నుంచీ అనుకుంటు న్నారు. సమాచార,పౌర సంబంధాల శాఖ మంత్రితో కలసి మనం ఇవాళ భోజనం చేయాలి."

"ఎలా? నాకు అలాంటి పెద్దవారి దగ్గరకు వెళ్ళేటప్పుడు కట్టుకోవటానికి

పనికి వచ్చే చీరలు లేనేలేవు. ఈ తెల్ల చీర, మట్టి రంగు శాలువతోనే నన్ను వాళ్ళకు పరిచయం చేస్తావా? నేనుఇలానే వాళ్ళ దగ్గరికి వస్తే నువ్వు సిగ్గు పడాల్సి వస్తుంది" కంగారుగా అంది మానసి.

"ఏమిటీ!? మానసీమిత్రా నా స్నేహితురాలని చెప్పుకోవటానికి నేను సిగ్గుపడవలసి వస్తుందా? ఎంత గొప్ప పలుకుబడి ఉన్న వ్యక్తయినా నీతో పరిచయం అవుతోందంటే గర్వంతో పొంగిపోవలసిందే! దేశంలోని మేధావి వర్గమంతా నీ గురించీ, నీ రచనల గురించీ ఏమనుకుంటారో నీకు తెలియదూ" అన్నాడు విజయ్ గొప్పగా.

అలా అతను గట్టిగా అనటంతో హోటల్లో చాలామంది వారి వైపు చూశారు. ఆమె సిగ్గుతో తల వంచుకుంది. ఢిల్లీలో విజయ్‌ని ఎరగని వాళ్ళెవరూ లేరని ఆమెకు తెలుసు. వారిద్దరూ హోటల్లోకి వస్తూంటే రకరకాల మనుషులు వారి స్థాయినిబట్టి విజయ్‌ని పలకరించారు. స్త్రీత్వానికి ప్రతిరూపంగా, మగడనేవాడికి కావలసిన అసలైన వస్తువుగా ఆమె వారికి తోచింది.




రణగొణ ధ్వనులతో హడావిడిగా ఉన్న ఢిల్లీని వదిలి విజయ్, మానసి సిమ్లా చేరారు. ప్రయాణ బడలిక తీర్చుకోవటానికి ఇద్దరూ సుఖంగా నిద్రపోయారు. ఆమె లేచేసరికి సిమ్లా అంతా తెల్లగా కనిపించింది. మంచు బాగా కురుస్తోంది. కిటికీ అద్దాలకు పట్టిన మంచు చిరిగిపోయిన తెల్లని వెండి జలతారు తెరలా కనిపించింది. ఆమెకు పక్కమీద నుంచి లేవాలని లేదు. బొంబాయిలో భర్తతో తాను అంత వరకూ కొన సాగించిన కాపరం కొన్ని యుగాలనాటి కలలా తోచింది.

ఓ పక్కగా విజయ్ ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు. అతని ఎర్రని పెదవులు అలవోకగా తెరచుకొని ఉన్నాయి. తాను నిస్సహాయ స్థితిలో ఉన్నానన్నట్టు అలిసిపోయి ఉంది అతని మొహం. అతని ముఖంలోని ప్రతి అవయవాన్నీ ఆమె వేలితో బొమ్మ గీస్తున్నట్టు స్పృశించింది. ఒత్తుగా ఉన్న కనుబొమలను వేళ్ళతోనే దువ్వింది. నిద్రా భంగిమలో ముద్దొస్తున్న అతన్ని చూసి ఉద్రేకంతో పెదాలపై ముద్దు పెట్టుకుంది.

విజయ్‌కి మెలకువ వచ్చింది. కళ్ళు తెరిచి ఆమెనే రెప్ప వేయకుండా ఆశ్చర్యంగా చూడసాగాడు. "ఏమిటీ మొదటిసారిగా ఇప్పుడే చూస్తున్నావా నన్ను?" ఆమె అల్లరిగా అడిగింది. అతను సమాధానంగా ఆమెని తన వైపు లాక్కుని తియ్యగా మూల్గుతూ మానసి రొమ్ములపై తన ముఖాన్ని తమకంతో రుద్దుకున్నాడు. మంచి గంధం, మల్లెపూల వాసన..... అతను మళ్ళీ ఆశ్చర్యపోయాడు. "డార్లింగ్! నువ్వు లేకుండా నేనెలా బతగ్గలను?"

అతను ఆమె నగ్నశరీరాన్నే తదేకంగా చూస్తున్నాడు. ఆమె సిగ్గుపడటం మరిచిపోయింది. ఆమెకు అంతా కొత్తగా ఉంది.

మగాడు ప్రేమాస్పదంగా చేరదీస్తే ఏ స్త్రీ అయినా అంతే. 'విజయ్ సరసన ఉండగా ఎవరైనా నన్ను కన్నెత్తి చూడ గలరా? పన్నెత్తి మాట్లాడగలరా?' అనుకుంది మానసి. స్త్రీ జీవితానికి సార్థకత్వం ఇదేనా?- తనలో తనే తర్కించు కోసాగింది. వాళ్ళు శారీరకంగా అమర సౌఖ్యమే అనుభవించారు. ఒకరికొకరు అతుక్కుపోయి స్వేచ్ఛగా, ఇచ్ఛాపూర్వకంగా ఏకమయ్యారు. ఒకే శయ్యపై సిల్కు పరుపుల మీద వెచ్చగా వారిద్దరూ...! అతను మోచేతిని ఆధారం చేసుకొని అరచేతిలో తలపెట్టుకొని పక్కకి తిరిగి ఆమెవైపు చూశాడు. ఆమె శిరోజాలు వదులై నల్లని ఫ్రేములో ఫొటో కట్టించిన చంద్రుడిలా కనిపించింది మానసి ముఖం. కాని ఆమె కళ్ళు చింతనిప్పుల్లా ఎరుపెక్కాయి. హఠాత్తుగా మొహాన్ని చేతుల్లో దాచేసుకుందామె. "ఇప్పుడు సిగ్గెందుకు?" నవ్వుతూ అడిగాడతను.

"ఎంత కాలం ఈ అందం ఇలా నిలిచిపోతుంది? నా శరీరంపై ఈ ముడతలు, వాడిపోయి రంగు వెలిసిపోతున్న ఈ దేహం చూసి నువ్వేం అనుకొంటావో అని భయపడిపోయాను" అంది మానసి. ఆ వెంటనే ఇద్దరూ కలిసి హాయిగా, తృప్తిగా నవ్వుకున్నారు. ఇద్దరికీ తెలుసు ఆమె శరీరం ముడతలు పడలేదని, రంగు కోల్పోలేదని......

కిందటి రాత్రి అనుభవం ఆమె కళ్ళలోకి కొత్త మెరుపు తీసుకొచ్చింది. అదో రకమైన అలుపును ప్రస్ఫుటింపజేసింది. ఆ అలసిన చూపులు, మెరుస్తున్న కళ్ళ వల్ల ఆమె మరింత అందంగా, శృంగార దేవతలా కనిపించిందతనికి. "నేనంటే నీకు అంత ఇష్టమా?" ఆమె గోముగా అడిగింది. జవాబుగా అతను తల ఊపి ఆమెను మరింత దగ్గరకు లాక్కున్నాడు.

ఆ తరవాత అతను హోటలు సీలింగ్ వైపు చూస్తూ ఏదో తీవ్రంగా ఆలోచించ సాగాడు. చాలా సేపటినుంచీ అతడినే గమనిస్తున్న మానసి "దేని గురించి అంత ఆలోచన" అంది. "నన్ను పెళ్ళి చేసుకో మానసీ! ఇప్పటి వరకూ నిన్నొక్కదాన్నే నేను పెళ్ళిచేసుకోవాలను కొన్నాను" సాలోచనగానే అన్నాడు విజయ్.

"నీకు చాలామంది అమ్మాయిలతో సంబంధాలున్నాయి కదూ?" అడిగిందామె.

"వాళ్ళందరితోనూ నా సంబంధం శరీరం వరకే! నాకు నీ హృదయం కావాలి! నున్నని మృదువైన నీ అందమే కాదు... నీ ప్రేమ కూడా కావాలి... ఇంకా..." అతను ఏదో చెప్పబోతూండగానే ఆమె అతని గుండెల్లో ముఖం దాచుకొని "ప్చ్! అది కుదిరేపని కాదు" అంటూ గొణిగింది.

"ఒకప్పుడు నా అంత మంచివాడు లేడు. జ్ఞాపకం ఉందా? నువ్వు మిత్రాని పెళ్ళి చేసుకొని నా చూపులకు అందకుండా వెళ్ళిపోయినపుడు నేను క్రమక్రమంగా క్రూరునిలా తయారయ్యాను. ఎదుటి వాడు సుఖ పడుతోంటే సహించలేకపోయే వాడిని. ఒకప్పుడు నీ కవిత్వాన్ని, ఆదర్శ వాదాన్ని అభిమానించి దాసోహం అన్న నేను, ఆ తరవాత నీఆదర్శాలను చదివితే నవ్వు వచ్చేది. నీ ఉపదేశాలన్నీ పరమ బూటకాలేనని నా స్నేహితులతో చెప్పేవాడిని.

అందని ద్రాక్షపళ్ళ కోసం అర్రులు చాచి అవి అందవని తెలిశాక, ఆ పళ్లు పులుపు అనుకున్న నక్కలా తయారయింది నా పరిస్థితి. ఆ తరవాత ఏమైనా సరే ప్రజలందరి గౌరవాభిమానాలూ పొందాలనీ, అత్యున్నత అధికారాన్ని చేజిక్కించుకోవాలనీ నిశ్చయించుకున్నాను. నాకు తెలుసు-అధికారం కోసం పాకులాడే వాడిని నువ్వు అసహ్యించుకుంటావని. రాజకీయాల్లో నేను చాలా ఎదురు దెబ్బలు తిన్నాను. సహచరులను వంచించాను. స్నేహితులకు అన్యాయం చేశాను. నా అసలు స్వరూపం తెలియకుండా రకరకాల ముసుగులు వేసుకుని నాకు అంటూ ఓ ప్రత్యేక వ్యక్తిత్వం సంపాయించాను. చివరికి ఇదిగో... ఈ పదవి నాకు సంక్రమించింది. మానసీ! ఇదంతా నా స్వయం ప్రతిభ," ఇవన్నీ చెబుతుంటే అతనికి మనసు తేట పడుతున్నట్లనిపించసాగింది.

"కానీ, ఇప్పటికీ అప్పుడప్పుడు నేను ఒంటరిగా ఉన్న సమయాల్లో నేనెంత దుర్మార్గుణ్నో జ్ఞాపకం వస్తుంటుంది. నేను సాధించిన ఈ ఘన విజయంపట్ల అసహ్య పడుతూంటాను. నువ్వు నాకు భార్యవయితే ఈ ఆత్మక్షోభనుంచి కోలుకోగలను. నీ స్పర్శతో, నీ ప్రేమతో నేను పునీతుడనవుతాను. నువ్వు నా పక్కన ఉంటే నాకు పునర్జన్మ ఎత్తినట్టు ఉంటుంది. ఇదివరకు నన్ను వదిలి పారిపోయిన ఆత్మ కల్మష రహితమై మళ్ళీ నాలో ప్రవేశిస్తుంది. మానసీ! నాకు మళ్ళీ జన్మ ఇచ్చి పుణ్యం కట్టుకో! ప్లీజ్!"

"విజయ్! ఇలాంటి కబుర్లు వద్దు. మనం ఓ ఒప్పందం ప్రకారం ఇక్కడ కలుసుకున్నాం. ఓ వారంపాటు నీతో ఉంటాను. నీకు కావలసింది, సాధగ్గ ర్నుంచి తీసుకుని, నా వజ్రాల రంగులు ఇచ్చేసెయ్. అనవసరంగా ఉద్రేకపడి పసందైన ఆటను ప్రారంభించిన సమయంలో మూడ్ పాడుచేయకు"

విజయ్ మంచం మీంచి కిందకు దిగి మౌనంగా బట్టలు వేసుకున్నాడు. చిరచిరలాడుతున్నా అతని ముఖం అందంగానే ఉంది. మానసి తలగడలను అనుకుని అలాగే దొర్లుతూ మృదువుగా ఉన్న అతని వీపును చూస్తోంది.కొండ తేనెలాంటి అతని శరీరం రంగు ఆమెను మరీ ఆకర్షించింది. "విజయ్! కమాన్. ఒక్కసారి ముద్దు పెట్టుకో" ఉద్రేకం పట్టలేక అరిచినట్టు పిలిచింది.

"నీది రాతి హృదయం! నీ అంత దుర్మార్గురాలిని నేనింతవరకూ చూడలేదు. నా మనసును ఎలా కష్ట పెట్టాలో నీకొక్క దానికే తెలుసు! నన్ను ఇప్పటి వరకూ బాధపెట్ట గలిగిన దానివి నువ్వొక్క తైవే"

ఆమె వేళాకోళంగా గట్టిగా నవ్వింది. ఇంతలో సుతిమెత్తగా తలుపు చప్పుడు వినిపించింది. "బహుశా హోటల్‌బోయ్ వచ్చాడనుకుంటా! ఏడింటికి టీ తెమ్మని చెప్పాను" ఆమె అనుమానం నివృత్తి చేశాడు విజయ్.

వెంటనే దుప్పట్లో తన శరీరాన్ని దాచుకుంది మానసి. హోటలు కుర్రాడు ఆమె వైపు కన్నెత్తైనా చూడకుండా టీ అక్కడ పెట్టి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత విజయ్ మానసి పక్కనే

కూచ్చుని కప్పులో టీ పోసి ఇచ్చాడు. వెన్న పూసిన బ్రెడ్‌ను ఆమె నోటికి అందించాడు. ఆకలిగా ఉందేమో ఆమె తినటం మొదలు పెట్టింది. "నువ్వుకూడా ఏదైన తిను" అంది మానసి. "వద్దు ఆకలి లేదు" అతను మామూలుగా అన్నాడు.

"అవున్లే! నీ ఆకలి వేరు" ఆమె మళ్ళీ గలగలా నవ్వింది. "ఒక్కొక్కసారి మా ఆయన కూడా ఇలాగే నాకు సేవలు చేస్తూంటాడు తెలుసా!" అలా ఎందుకు చెప్పిందో ఆమెకే తెలియదు.

"మీ ఆయన గొడవ ఇప్పుడెందుకు" చికాకు పడ్డాడు విజయ్.



"నువ్వెవరివి మా ఆయన గురించి మాట్లాడవద్దనటానికి? అందమైన రాజకీయ నాయకుడివి. అంతేగా? నీతి, న్యాయం, ధర్మం లాంటి పదాలకు అర్థం తెలుసా నీకు? ఖరీదైన ఖద్దరు బట్టలు వేసుకుని మనిషి రూపంలో ఉన్న రాక్షసుడివి నువ్వు. ఢిల్లీలో జాతీయ, అంతర్జాతీయ ప్రముఖులతో నువ్వు మంతనాలుచేస్తూండే సమయంలో మా ఆయన ఏం చేస్తాడో తెలుసా? నీతిగా ఎక్కువ డబ్బులు ఎలా సంపాయించాలా అని ఆలోచిస్తాడు. లేదా, మా తోటలో గులాబీ మొక్కలకు నీళ్ళు పోస్తూ, పాదులు చేస్తూ కూర్చుంటాడు. తోటంటే తోటకాదులే! నీ జేబు రుమాలు కంటే కొంచెం పెద్ద స్థలం! అంతే!" అతన్ని మాట్లాడ నివ్వలేదు మానసి.

"నన్ను నీ చెప్పుచేతల్లో ఉంచుకోవాలనీ, నామీద అధికారం చెలాయిద్దామనీ మాత్రం కలలో కూడా అనుకోకు. ఎంత మంత్రివైనా నా కంటె ఎందులోనూ నువ్వు గొప్పవాడివి కాదు. వజ్రాల రింగుల కోసం, నా చిరకాల వాంఛితం నెరవేర్చుకోవటం కోసం ఆశగా ఓ ఖరీదైన పురుగుతో పడుకోవటానికి వచ్చాను. నా ఆశే నన్ను నీకు లోబరిచింది. అంత మాత్రాన నీకు నేను దాసాన దాసురాలిని అయిపోతానని భ్రమపడకు. మన మధ్య ఉన్నది కేవలం గౌరవం ఇచ్చి పుచ్చుకోవటం మాత్రమే. నా పాతివ్రత్యాన్ని నీకు అమ్మాను. చెడిపోయాను. అంతేకాని నా నడవడి మీద, నా ప్రవర్తన మీద నీకేం అధికారం లేదు" తీక్షణంగానే అంది మానసి.

"నన్ను క్షమించు. నేనన్న మాటలు పట్టించుకోకు. పొద్దున్నే నిన్ను అనవసరంగా బాధ పెట్టాను" బతిమాలుతున్నట్టు లోగొంతుకతో అన్నాడు విజయ్.

వాళ్ళిద్దరూ మళ్ళీ గాఢంగా కౌగలించుకున్నారు. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఇదివరకు అనుభవించలేక పోయిన హనీమూన్‌ని ఇప్పుడామె చేజిక్కించుకున్నట్లు తలపోసింది. పెళ్ళయిన తరవాత బంధువులు, పెద్దలు చెప్పినట్లుగా తను పుట్టింట మూడు రాత్రులతోనే ఆమె సరిపెట్టుకుంది. తాను మోసపోయా ననుకుంది. అయినా అందులో కూడా ఆమె ఏదో అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందగలిగింది.

సుపర్ణకు జన్మనిచ్చినతన్ని- ఈ లోకంలో లేకపోయినా ఆమె ఇంకా ప్రేమిస్తూనే ఉంది. మిత్రా కూడా మొదటి నుంచీ ఆమెను అభిమానిస్తూనే ఉన్నాడు.

భర్తతో మసలినపుడు ఆమె ఏ దాపరికం లేకుండానే వ్యవహరించింది. ఆమెను అతను అదో బాధ్యతగానే ఆదరించాడు. తరచుగా ఆమె కోపగించుకున్నా మంచి మాటలు చెప్పి, ఆమె కురులు దువ్వి, ఉత్సాహంగా గుసగుసలాడి మానసిని ఎలా మలచుకోవాలో మిత్రాకు కొట్టిన పిండి. ఆమె అతనితో సరిపెట్టుకోవటం నేర్చుకుంది.

మిత్రా కోపతాపాలకు దూరంగా ఉండేవాడు. లేకపోతే ఆమె అతిశయం వల్ల గొడవలు జరుగుతాయేమోనని అతని భయం. ఆమె ఇంట్లో హడావుడిగా తిరుగుతూ, స్త్రీత్వం ఉట్టిపడేలా సుకుమారంగా మసలుతూంటే అతను ఇంట్లోనే కూర్చుని ఏవేవో పత్రికలు చదువుతూ విశ్రాంతి తీసుకునేవాడు. ఆమె మాత్రం

సాయంత్రాలు అలా సరదాగా నడచు కొంటూ బయటకు వెళ్ళి తిరగాలనీ, ఖరీదైన బట్టలు వగైరాలు కొనుక్కోవాలనీ అభిలషించేది. ఆమె ఎప్పుడైనా అలా షికారు వెళ్ళి వచ్చినపుడు మామూలు మధ్య తరగతి స్త్రీ మాదిరిగా కోపంతో చిందులు వేసేది. అందరిలా తానూ షాపింగ్ చేయలేక పోతున్నానని తెగ బాధ పడిపోయేది. అలాంటి సందర్భాలలో రాత్రి చీకటి బాగా పడ్డాక నిశ్శబ్దంగా టేబిలు దగ్గర కూర్చుని పత్రికలకు కవితలు రాస్తూ కూర్చునేది.

'రాజకీయ నాయకులకు మల్లే నేను కూడా కబుర్లు మాత్రమే చెబుతున్నానా? లేక నా రాతలలో నిజంగా ఏవైనా ఆదర్శాలున్నాయా?' అని తర్కించుకొనేది మానసి. ఆమె ఎదుటివారి భోగభాగ్యాలను గురించి ఈర్ష్యపడలేదూ? తాను కూడా అలా ఉండాలని ఎప్పుడూ అనుకోలేదా? అలాంటి సందర్భాల్లో 'అమోల్! నా రచనల్లో నిజంగా ఆదర్శవాదం ఉందా? నేను ప్రజలను మోసం చేయటం లేదు కదా?' అని భర్తను అడుగుతుంది. అతడు మృదుమధురంగా నవ్వి ఆమెను హృదయానికి హత్తుకొని 'లేదు మనూ! నువ్వు అలాంటి దానివి కాదు. నీ అంత గొప్ప ఉత్తమ స్త్రీని నేను ఇప్పటివరకూ ఎక్కడా చూడలేదు. నువ్వు అసలు సిసలైన ఆదర్శవాదివి' అంటూ చెవిలో గుసగుసలాడతాడు. దాంతో ఆమె గర్వంగా నూతనోత్తేజాన్ని పొందుతుంది.

అలాంటి మెరమెచ్చు మాటలు అనకపోతే ఆమె రచనా వ్యాసంగాన్ని కొనసాగించలేదు. పొగడ్తలు ఉంటే ఆమెకు నిద్రాహారాలు అక్కర్లేదు.

"మానసీ! నేను నిన్ను ఇక్కడికి రప్పించకుండా ఉండవలసింది! అనవసరంగా నిన్ను పాడు చేశాను. బహుశా జీవితంలో నన్ను క్షమించలేవేమో! నిన్ను బలవంత పెట్టకుండానే నీకు నేను చెవి రింగులు బహుమానంగా ఇచ్చి ఉండవలసింది! నిన్ను హృదయపూర్వకంగా, ప్రాణసమానంగా ప్రేమించాను. కాని దాంతోపాటు నా ప్రవర్తననీ, పద్ధతులనూ కూడా మార్చుకోవలిసింది. నీ మీద గల ప్రేమ నన్ను అవేమీ ఆలోచించనివ్వలేదు"......హఠాత్తుగా అన్నాడు విజయ్ అప్పటి వరకూ ఆమెతో పడిన ఘర్షణను పట్టించుకోనట్టు.

మానసి నిగనిగ లాడుతున్న అతని నుదుటిపై గంతులేస్తున్న ముంగురులను చూసి ఇంతకు ముందులా ఆమె మళ్ళీ ఉద్రేక పడింది. విజయ్ చిన్న పాపాయిలా అనిపించాడు. అతన్ని తన ఒళ్ళో పడుకో బెట్టుకొని పిల్లలకు ఆకలి తీర్చినట్టు ఏదేదో చేయాలనిపించింది. ఆమె రొమ్ముల్లో ఏదో చెప్పరాని బాధ... ఆ బాధని విజయ్ మాత్రమే...అది కూడా అతని పెదాలు మాత్రమే తీర్చగలవు. 'ఏమిటిది? ఇప్పుడే ఇలా అనిపిస్తోందా?' అనుకుంది మానసి. ఇప్పటి వరకూ ఆమెకు అనుభవైక వేద్యంకాని సెక్స్ వాంఛలు ఇప్పుడే పురి విప్పాయా? ఆమెలో ఎక్కడో ఏదో సుడిగుండం విలయతాండవం చేస్తోంది.

అతను తన మగసిరితో తనను సుడిగాలిలా చుట్టేయాలనీ, తన శరీరంలోని ప్రతీ అవయవం ఆకులా అల్లల్లాడాలనీ అంగాంగం అతని బలానికి, దృఢత్వానికి

సమాధానం చెప్పాలనీ ఆమె కోరిక. అలా అయితే తప్ప ఆమెకు మరోసారి శారీరకంగా శాంతి లభించదు. "నేను ఇంత వరకూ ఏ మగాణ్నీ కామించనంత ఎక్కువగా నువ్వు కావాలని కోరుకుంటున్నాను. మన ఈ వ్యాపారంలో నీకంటే ఎక్కువ ఆనందం, తృప్తి నేనే సొంతం చేసుకుంటున్నాను" అంది మానసి.

"నేనెలాగైనా నిన్ను ప్రేమించాలి. నీతో కలిసి ఉండాలి.అది నా ఉద్దేశం.ఏదో ఆశ పెట్టి నువ్వు నన్ను శారీరక సుఖం కోసం లొంగతీసుకోగలిగావు అనుకోకు. నేను మనస్ఫూర్తిగానే ఇక్కడికివచ్చాను. కులే! రా! నువ్వూ నేను కామంతో కాగి, వేగిపోతున్నాం. అతి సామాన్యంగా, ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో ఒకర్నొకరు వాంఛించుకుంటున్నాం. మరొకసారి.... ప్లీజ్! ఇంకొక్కసారి నన్ను సంతృప్తి పరచు, వి జ య్! మళ్ళీ...మళ్ళీ... నాకు స్పృహ తప్పి, నా ఒళ్ళు నేను మరిచిపోయేంత వరకూ..." మానసికి మాటలు కరువయ్యాయి




ఢిల్లీలోని ఓ స్నేహితునికి ట్రంకాల్ చేశాక విజయ్ ఉల్లాసమంతా ఎగిరి ఇగిరిపోయింది. ఇంచుమించు వణుకుతూ అతను గదిలో అడుగు పెట్టాడు. ప్రధాన మంత్రి మానసిని తన ఇంటికి తీసుకు రమ్మని చెప్పారని ఆ స్నేహితుడు చెప్పాడు. ఏదో మామూలుగా చేసుకొనే చిన్న పండుగ సందర్భంగా ఆమెకు చిన్న విందు ఇవ్వాలని ఆయన ఉద్దేశమట. ఆయన భార్య చనిపోయి దాదాపు పన్నెండేళ్ళయింది. ఇదీ ఢిల్లీలో పరిస్థితి.

సమాచార పౌర సంబంధాల శాఖ మంత్రి ఇచ్చిన విందులో మానసిని చూసినపుడే ప్రధాని మనసులో ఏదో పురుగు ప్రవేశించిందని విజయ్ రూఢి పరుచుకున్నాడు. ఏదో విధంగా మానసికి ఓ పదవి ఇచ్చి ఆమెను ఢిల్లీలోనే ఉండిపోయేలా చూడమని కూడా ప్రధాని అతనితో చెప్పారు.

ప్రస్తుతం విద్యా మంత్రిగా ఉంటున్న వ్యక్తి బలహీన వర్గానికి చెందినవాడు. అతనికి బోల్డంత పలుకుబడి కూడా ఉంది. అతనిని ఆ పదవిలోంచి తొలగించి ఏదో రాష్ట్రానికి గవర్నరుగానో, మరో పదవిలోనో పంపించటం అంత బుద్ధి తక్కువ పని మరొకటి ఉండబోదు. ఇక మిగిలినది సమాచార, పౌరసంబంధాల శాఖ. ఆ మంత్రిగారు తన గోతిని తానే తవ్వుకున్నాడు. లేకపోతే ఎక్కడో ఉంటున్న మానసిలాంటి అందమైన, సంభాషణా చాతుర్యంగల కవయిత్రిని పిలిచి విందు ఇవ్వటం, ఆ విందుకు ప్రధానమంత్రిని పి ల వ ట ం ఏమిటి? ఇదంతా బయటకు తెలియని వ్యవహారం. విజయ్‌కి మాత్రమే తెలుసు.

ప్ర ధా న మ ం త్రి చీటికీ మాటికీ అడుగుతూనే ఉన్నాడు—"ఏడీ! విజయ్ ఎక్కడికి వెళ్ళాడు? ఇవతల దేశం అనేక సమస్యలతో సతమతమైపోతోంటే అతను వెళ్ళి సిమ్లాలో వృథాగా కాల

యాపన చేస్తున్నాడా?" అని. విజయ్ స్నేహితుడు ప్రధానికీ స్నేహితుడే. మధ్య అతను ఇరుక్కుపోయాడు. తెలివైనవాడు కనుక "ఆట విడుపుగా ఉంటుందని విజయ్ ఎవరో అమ్మాయితో సిమ్లాలో విశ్రాంతి తీసుకుంటున్నాడు" అని సర్ది చెప్పాడు. "అవన్నీ తరువాత. ముందు బొంబాయి వెళ్ళి మానసిని తీసుకు రమ్మన్నానని చెప్పు" అంటూ చిందులు వేశారు ప్రధాని.

విజయ్ సందిగ్ధంలో పడ్డాడు. "ఈ వార్త మానసి చెవిన పడితే ఏం గంతులు వేస్తుందో? ఆమె పదవులకోసం పాకు లాడే మనిషికాదు. ప్రధాని అవసరాలు తీర్చి తన పనులు నెరవేర్చుకోవటానికి మానసి మామూలు స్త్రీ కాదు. అదీకాక ప్రధానికి ఇప్పుడు యాభై రెండేళ్లున్నాయి. స్ప్రింగులాంటి ఆమె శరీరంలో చెలరేగే ప్రళయాన్ని అదుపు చేయగల సామర్థ్యం ఆయనలో లేదు. ఏం చెయ్యాలో తోచని స్థితిలో పడిపోయాడు విజయ్.

"ఏమిటలా ఉన్నావు! ఏదో దయ్యాన్ని చూసి చెదిరిపోయిన దానిలా కనిపిస్తున్నావు" అన్నాడు విజయ్ ఆమె పక్కనే కూర్చునిచేతిగోళ్ళను పరిశీలనగా చూస్తూ.

"దేశాయ్ అని నా స్నేహితుడున్నాడులే ఢిల్లీలో ... అతనికి ఇప్పుడు ఫోన్ చేశాను. అతను చాలా ఘోరమైన వార్త చెప్పాడు. ప్రధానమంత్రి కళ్ళు నీమీద పడ్డాయట. నిన్ను సమాచార పౌర సంబంధాలశాఖకు మంత్రిగా తీసుకోవాలని ఆయన అనుకుంటున్నారట" అసలు విషయం చెప్పాడు విజయ్.

"పిచ్చాసుపత్రిలో ఉండవలసిన వాళ్ళంతా ఈ దేశాన్ని పాలిస్తున్నారు" అంది మానసి బిగ్గరగా, నిష్కల్మషంగా నవ్వుతూ.

"నేను చెప్పేది శ్రద్ధగా విను. వేళాకోళం కాదు! ఇప్పుడున్న మంత్రిని ఏదో రాష్ట్రానికి గవర్నరుగా నియమిస్తారు. అదికాక అతను డెబ్భైఏళ్ళ ముసలాడు. ఏ పనీ చొరవగా చేయలేడు. పైగా ఇప్పటితరం యువకులను మనుషులుగా గుర్తించలేడు కూడా. నువ్వైతే ఆ శాఖను బ్రహ్మాండంగా నిర్వహిస్తావు. అందులో నువ్వు ఆదర్శవాదివి. కాని..."

మానసి హఠాత్తుగా నిటారుగా నిలబడి "ఊ ... కానీ ... అక్కడే ఆగిపోయావేం?" తీక్షణంగా అడిగింది.

"ప్రధానికి ఆడ ఆకలి ఎక్కువ.నిన్ను ఊరికే వదిలి పెడ్తాడనుకోను. నీ పేరు ప్రఖ్యాతులు క్రమక్రమంగా అణగారిపోవచ్చు .... ఆయనతో కలిస్తే ... " అనుమానంగా అన్నాడతను.

"అలాంటి వాళ్ళనే కదా దేశం నెత్తి మీద పెట్టుకొని పూజిస్తోంది" మానసి ఎత్తి పొడుపుగా అంది.

"విజయ్! ప్రధాని నన్ను ఏం చెయ్యమన్నా చేస్తాను, దేనికైనా నేను సిద్ధమే. ఇప్పుడు నేను ఎలాగూ పతివ్రతను కాదు. నువ్వే చూశావు నేను ఎలా దిగజారిపోయానో? ఓ జత వజ్రాల రింగుల కోసం శరీరాన్ని వారంరోజులపాటు నీకు అద్దెకు ఇచ్చాను. ఇకనుంచి అధికారంకోసం, పదవికోసం అత్యంత పలుకుబడి ఉన్న వారికి మాత్రమే మానసి శరీరం దొరుకుతుంది. ఈ నిర్ణయానికి తిరుగులేదు" మానసి బిగ్గరగా, పిచ్చిపట్టినట్లు నవ్వసాగింది. నవ్వి నవ్వి ఆమె ముఖం ఎర్రబారటం చూసి విజయ్ కంగారుపడిపోయాడు.

'ఈమెకు పిచ్చి పట్టలేదుకదా?' అనుకున్నాడతను. మానసిని అందుకొని ముద్దులాడబోయాడు. ఆమె అతన్ని విదిలించి కొట్టింది. ''ఇవాళ్టినుంచీ, ఈ క్షణం నుంచీ నేను నీ మనిషిని కాను. ప్రధానమంత్రి అంతఃపుర స్త్రీని. ఆత్మహత్య చేసుకొని సుఖపడుదామను కొన్నవాడు సముద్రంలో లోతున్నచోట పడాలి కాని ఒడ్డున ఉన్న నీళ్ళలో తపతపలాడితే ప్రయోజనమేమిటి ? పదవి కావాలన్నా అంతే! కొడితే పులినే కొట్టాలి!"

''మానసీ! నన్ను పెళ్ళిచేసుకో. ఆ రకంగానైనా నేను చేసిన పాపాలు ప్రక్షాళన మౌతాయి. మనం ఎవరికీ తెలియని చోటికి ఎగిరిపోదాం. ఇకనుంచీ రాజకీయాల జోలికి పోను. నిరాడంబరంగా హాయిగా, ఆనందంగా జీవితాన్ననుభవిద్దాం"

''ఏయ్! నీకు మతిపోయిందా? నేను వివాహితను. నా భర్త అమోల్ మిత్రా. జ్ఞాపకం ఉంచుకో".

''నేను ఏ క్షణం లోనూ ఆ విషయం మరచిపోలేదు. కాని నీకే జ్ఞాపకం లేనట్లుంది, నిన్నరాత్రి చిరుత పులిలా రాక్షసంగా నాతో గడిపినపుడు అమోల్ మిత్రా నీకు జ్ఞాపకం వచ్చాడా ? మానసీ! నీ ఈ పరిస్థితికి నేనెంత కారణమో నువ్వూ అంతే! పశువుల్లా తుచ్ఛంగా కామానికిలోనై ఇద్దరమూ తప్పే చేశాం! కాని నా ప్రవర్తనలో, మాటల్లో, చేష్టల్లో, అన్నింటిలోనూ నీపైగల ప్రేమ నిబిడీకృతమై ఉంది. నేను నిన్ను ప్రేమించాను. తలమునకలుగా ప్రేమించాను మానసీ ! కాని నువ్వు నువ్వు బజారు..." కోపంతో అతనికి మాటలు తడబడ్డాయి.

ఆమె వికటంగా మళ్ళీ నవ్వసాగింది. అతను పరుషంగా తిట్టిన తిట్లను కూడా ఆమె పట్టించుకోలేదు. "నువ్వు నాకు తగినవాడివి కాదు. విజయ్! సరైన మనిషి కోసం నేను వేటాడుతున్నానని నువ్వనుకుంటూంటే నిజంగానే అర్హత కలిగిన వాడి కోసం వెదుక్కొంటూ నన్ను వెళ్ళనీ. అమోల్ మిత్రా భార్యగా నేను ఎంతో హాయిగా జీవించేదాన్ని. కాని నువ్వు టూత్ పేస్ట్ ప్రకటనలా పళ్ళన్నీ బయట పెట్టి లేనిపోని ఆప్యాయతను ఒలకబోసి నా మనసు చెడగొట్టావు. కలలో కూడా చూసి ఎరుగని, చేతితో స్పృశించి ఉండని వజ్రాలు ఆశ పెట్టి నన్ను లొంగదీసుకున్నావు. నాలోని బలహీనతలను నువ్వు బయటకు లాగావు. ఇక నేను ఎప్పటికీ ఇదివరకటి మానసిని కాలేను. మనిషి మంచితనం గురించీ, నిజాయితీ గురించీ ఎంత మాత్రమూ కవితలు రాయలేను. నేను రచయిత్రిగా చచ్చిపోయాను" బాధగా అంది మానసి.

"అదెలా? నువ్వు రాసిన ప్రతీమాటా వేదవాక్యం కావాలనేముంది? ఇప్పుడు దేశంలో రాస్తున్న రచయితలంతా నిజాయితీగానే ఉంటున్నారనుకుంటున్నావా?"

మానసి మంచంమీద ఒరిగిపోయింది. మానసికంగా ఆమె బాగా అలిసిపోయింది. ఆమె ఊహాసౌధాలు కళ్ళ ముందే కూలిపోతున్నాయి. ఈ సిమ్లా ప్రయాణంతో ఆమెలోని నిజాయితీ చచ్చిపోయింది. ఆమె విజయ్‌ని ప్రేమించి ఉంటే తనని తాను మరిచిపోయి ఉండేది. కాని ఆమె శరీరానికి కావలసినది ప్రేమకాదు.

"విజయ్! నేను చచ్చిపోతాను. విజయ్! నేను బతకటం అనవసరం. నేను మళ్ళీ నా ముఖాన్ని అమోల్ మిత్రాకు చూపించ లేను."

విజయ్ ఆమె దగ్గర కూర్చుని నడుం మీద చెయ్యేసి "మానసీ! కాసేపు నిద్రపో! నువ్వు బాగా అలిసిపోయావు. నిద్రపోతే మనసు కాస్త తేట పడుతుంది. ప్రధానమంత్రి ఉద్దేశం గురించి నీతో చెప్పకుండా ఉండవలసింది. ఢిల్లీ అంటే ఎత్తులు, పైఎత్తులు అని అర్థం. దేశానికి మధ్యలో ఉందికదా! రాజకీయాలకు అదే అసలైన రంగస్థలం. ఎంతగొప్ప రాజకీయ వేత్తకయినా ఆ స్టేజీమీద కాళ్ళు వణికి తీరతాయి. అందర్లోనూ ప్రధాన మంత్రే కొంచెం నిదానస్తులు. కాని ఆయన కూడా తొందరపడుతున్నట్టు కనిపిస్తున్నారు. సదాశివరావు ఆయనకు వ్యతిరేకంగా ఏదో కుట్ర పన్నుతున్నాడు. ప్రధాని దాన్నుంచి తప్పించుకోవలసి ఉంది. నిన్న అర్ధరాత్రి సదాశివరావు నోరు మూయించటానికి డబ్బు ఆయన ఇంటికి ప్రవహించింది. కాని లాభంలేదు. మన ప్రభుత్వానికి ఆముసలాడు పక్కలో బల్లెమే. ఒకప్పుడు నేను ఆయనను ఎంతో గౌరవించేవాడిని. కాని ఇప్పుడు...నేనే ప్రధానమంత్రినై ఉంటే క్షణాల్లో సదాశివరావుని అరెస్టుచేయించి ఉండేవాడిని. లేదా పరలోకానికి పంపించి ఉండేవాడిని.. కాని మన ప్రధాని చాలా మంచివారు. ఆయన హృదయం వెన్నలాంటిది..."

"ష్! ఆవెధవ రాజకీయాలు మాట్లాడకు. నేను నిశ్చింతగా ఇంటికి వెళ్ళి ఇదివరకటిలా మామూలుగా బతుకుదామనుకున్నాను. కాని ఇప్పుడాపని అసాధ్యం! ఏమంటావు? నేను పతనమై పోయాను. ఇప్పుడు నా ఇంట్లో శాంతి పావురం చచ్చి కుళ్ళి పోయింది. చచ్చిన దానికి ప్రాణం పోయలేం. శాంతి అనేది మాటల్లో తప్ప ఇంకెక్కడ దొరుకుతుంది? ఏ అతీంద్రియ శక్తులులేని మామూలు తెల్ల పావురం అది. అది చస్తే,కుళ్ళిపోయి ఆ దుర్గంధం గాలిలో కలిసిపోతుంది. అమోల్! ఈ చదరంగం ఆటలో నేను ఓడిపోయాను. నేను ఎన్నటికీ నా ముఖం నీకు చూపించ లేను. నేను నీతిలేనిదాన్ని. ఘోరంగా, నిర్దాక్షిణ్యంగా శీలాన్ని కోల్పోయిన దాన్ని ..." మానసి బిగ్గరగా అరవ సాగింది.

ఆమె కళ్లు మూసుకొని నిద్రపోవాలని ప్రయత్నించింది. ఆమె కొలకుల్లో కన్నీళ్ళు చూసి, విజయ్ మెల్లగా గది లోంచి బయటకు వచ్చాడు. అతనికి చాలా బాధగా ఉంది. ఆమె నగ్న శరీరంతో ఆటలాడుకొని, తనకు కావలసినట్లు మలచుకొని వదిలేద్దామని అతను అనుకోలేదు. ఎలాగైనాసరే ఆమె తనని ప్రేమించేలా చేసుకొందామనుకొన్నాడు. ఈ వారం రోజుల్లోనూ అతడాపని చేయలేక పోయాడు.

మంచు ఇంకా తెల్లని వెండి జలతారులా వర్షిస్తూనే ఉంది. ఓవరుకోటు వేసుకొని, మఫ్లరు చుట్టుకొని ఆ మంచులోనే అతను షికారు బయల్దేరాడు.

'ఒకవేళ మానసికి ఎలాగో అలా మంత్రివర్గంలో స్థానం కల్పిస్తే...అందువల్ల ఒరిగేదేముంటుంది ?' తనలో తనే తర్కించుకోసాగాడు విజయ్.

'అందువల్ల ఒకటి సాధించగలడు. ఆమెద్వారా ప్రధానమంత్రిని మంచి చేసు

కాని ఏనాటికో ఒక నాటికి! సంపూర్ణాధికారాన్ని చేజిక్కించుకోవచ్చు. అందుకు కావలసిన తెలివితేటలు అతనికి ఉన్నాయి. కాని ... వద్దు ... అలా జరగటానికి వీల్లేదు.' అనుకున్నాడతను. మానసి ఇంకెవరిచేత వంచితురాలు కాకూడదు. ఆమె ఎప్పుడూ తన వస్తువుగానే మిగిలిపోవాలి. ఆమె తనని గాఢంగా, ప్రియాతి ప్రియంగా ప్రేమించాలి. ఆమెను ఆ ధోరణిలోనికి మార్చగలిగితే తప్పకుండా తనను పెళ్ళిచేసుకుంటుంది. 'బహుశా అది పెద్ద కష్టంకాదనుకొంటా!' అనుకున్నాడతను.

'అమోల్ మిత్రాకు భార్య లేనిలోటును హఠాత్తుగా పెద్ద ప్రమోషను ఇచ్చి నోరు మూయించవచ్చు. అతనిని ఏదేనా జాతీయ బ్యాంకుకు అధికారిగా చేయవచ్చు. లేదా ఓ ప్రభుత్వ సంస్థకు చైర్మన్‌గా నియమించవచ్చు. ఇంకా కావాలనుకుంటే వచ్చే రిపబ్లిక్ దినోత్సవాలలో అతనికో పద్మశ్రీ బిరుదిస్తే సరి ...'

ఓ బార్‌లోకి వెళ్ళి బ్రాందీ తీసుకు రమ్మని చెప్పాడు విజయ్. నీళ్ళు కలపకుండానే ఆ ద్రవాన్ని గొంతులో పోసుకొని 'జలుబు చేసినట్లుంది' అనుకున్నాడు. మరో టేబుల్ దగ్గర కూర్చున్న ఓ స్త్రీ అతనివైపే తదేక దీక్షగా చూస్తోంది "అందంగా, మూర్తీభవించిన మగతనంలా ఉన్నాడు" అనుకుందామె విజయ్‌ని చూసి. అతను ఆమె వైపు చూసినప్పుడల్లా ఆమె చిరునవ్వు నవ్వుతోంది. స్వచ్ఛమైన ఆమె చూపులు అతనిని ఉద్రేకపరిచాయి. అతడు మానసిని ఇప్పటివరకూ చూసి ఉండకపోతే, ఇప్పుడామె తన గదిలో నిద్రపోతూ ఉండి ఉండకపోతే అవిడను విజయ్ తనతో హోటల్‌కు తీసుకొని వెళ్ళేవాడే! మానసి జ్ఞాపకం రావటంతో ఆ అపరిచితురాలితో ఊహించుకున్న శారీరక సంబంధం ఊహల్లోనే ఉండిపోయింది.




వేసవిలో సుపర్ణ సెలవులు గడపటానికి ఇంటికి వస్తుంది. మధ్యాహ్నం కాలక్షేపానికి పొరుగింటి సైరస్‌తో కబుర్లు చెబుతూ కూర్చుంటుంది. సైరస్‌కి పంథొమ్మిదేళ్ళు. బహుశా అతను ఒక్కడే ఆమెకున్న స్నేహితుడు. ఆమెకు తొమ్మిదేళ్ళు వచ్చే వరకు ఇద్దరూ ఒకే స్కూలులో కలిసి చదువుకున్నారు.

సైరస్ నాజుగ్గా, పొడుగ్గా ఎదిగాడు, ముఖంమీద మొటిమలు ఉన్నా అతని కళ్ళలో గోమాతకున్నంత సాధుత్వం ఉంది. అందువల్లే ఏఅమ్మాయైనా అతనితో నిర్భయంగా, కలుపుగోలుగా మాట్లాడగలుగుతుంది.

అతనికి రాజకీయాలంటే వెర్రి అభిమానం. ప్రభుత్వంలోని అవినీతి గురించీ, అక్రమ పద్ధతుల గురించీ ఉపన్యసించడానికి ప్రతిపక్ష నాయకులు నిర్వహించే సమావేశాలకు, ఊరేగింపులకు వెళ్ళటమంటే సైరస్‌కు ఎంతో ఇష్టం. ఇదివరలో సుపర్ణకూడా అతనితోవెళ్ళేది. కాని

దాదాపు ఏడెనిమిదేళ్ళనుంచీ ఆమెకు రాజకీయాలంటే విసుగు పుట్టింది.

"ఇవాళ సుందర్‌బాయి హాల్‌లో మంచి సభ ఉంది వస్తావా వెళ్దాం" అన్నాడతను తనఉత్సాహాన్నంతాకళ్ళలో ప్రతిబింబింపజేస్తూ. ఆమె వయ్యారం ఒలకబోస్తూ తల అడ్డంగా తిప్పింది చిరునవ్వు నవ్వుతూ. "నాకు అలాంటి సభలు సమావేశాలంటే ఇష్టం లేదని నీకు తెలుసుగా! ఏదేనా సినిమాకో షికారుకో వెళ్దామా అని అడుగు. పరిగెత్తుకుంటూ వస్తాను" అంది సుపర్ణ.

'పిచ్చి పిల్లా!' అన్నట్టు నవ్వాడు సైరస్. "నువ్వు ఎందుకూ పనికిరాని దానిలా తయారవుతున్నావు! హాస్టల్‌లో ఉంటున్నందువల్లే నువ్వు పాడయిపోయావు. అందరి మాదిరిగానే నువ్వూ ప్రవర్తిస్తున్నావు. మీలాంటి మధ్య తరగతి వాళ్ళందరికీ నాజూకైన బట్టల గురించీ, హిందీ సినిమాల్లో హీరోల గురించీ తప్ప వేరే ధ్యాసే ఉండదు. ఛీ! ఛీ! నిన్ను చూస్తే నాకే సిగ్గేస్తోంది" సైరస్ చిరాకు పడ్డాడు.

"నన్ను చూస్తే సిగ్గేసున్నపుడు మా ఇంటికెందుకు వస్తావ్! నేనేమైనా నిన్ను రమ్మన్నానా?" వెక్కిరింపుగా అంది సుపర్ణ.

సైరస్‌కు మతిపోయింది. లక్నోలోని హాస్టలు వా తా వ ర ణ ం సుపర్ణను మామూలు మనిషిగా చేసిందని అతను బాధపడ్డాడు. ఎదుటివాడిని అదీ అత్యంత సన్నిహితుడిని మాటలతో ఎలా గాయపరచాలోకూడా సుపర్ణ నేర్చేసుకుంది. అదివరకు ఆమెను ఎవరేనా ఏమైనా అంటే సైరస్ ఎంత గొడవ చేసేవాడో సుపర్ణ మరిచిపోయిందా ?

సాయంత్రం పూట అతనితో కలిసి కూల్ డ్రింకులు తాగటం, బీ చ్ లో తిరగటం కూడా ఆమె మరిచిపోయిందా ? సుపర్ణ పదహారవఏట ఆడంబరంగాజరుపుకొన్న పుట్టినరోజున గ్రీటింగ్స్ చెప్పటానికి వచ్చినపుడు సైరస్‌ను హఠాత్తుగా సుతారంగా ముద్దు పెట్టుకొనటం కూడా ఆమె మరిచిపోయే ఉంటుంది. అతడు కోపంగా గోళ్ళు కొరుకుతూ ఆమె వైపు చురచురా చూశాడు.

"నువ్వు కోపంగా చూస్తే నాకేం! ఏం? నన్ను భయపెడదామనుకుంటున్నావా?"

"నిన్ను భయపెట్టవలసిన అవసరం నాకేమిటి? సుపర్ణా! నాకు ఎవరిమీదా కోపం లేదు. నా కళ్ళే అంత. ఎప్పుడూ అలా ఉరుముతున్నట్టే ఉంటాయి. ఇలా అనాకారిగా, అసహ్యంగానే పుట్టాన్నేను"

ఆ మాటలతో ఆమె కరిగిపోయింది. "నువ్వు అనాకారివని ఎవరన్నారు? పైగా నువ్వు బాగానే ఉంటావు, కాని పోజు కొడతావు. అన్నీ నీకే తెలుసునన్నట్లు మాట్లాడతావు. అందుకే అప్పుడప్పుడు నేనిలా ప్రవర్తిస్తాను" అంది సుపర్ణ అతన్ని అనునయిస్తూ.

ఆ సాయంత్రం ఇద్దరూ సుందర్‌బాయి హాలులో జరిగిన సభలో పాల్గొన్నారు. ఉపన్యాసాలు జరుగుతున్నపుడు మధ్యలో రెండుసార్లు ఉద్రేకంతో కంపించిపోయాడు సైరస్. కుర్చీలోంచి లేచి గొడవ చెయ్యబోయాడు. కాని సుపర్ణ అతనికి చివాట్లు పెట్టి శాంతింప జేసింది. "నాను రాను అడ్డగాడిదలా తయారవుతున్నావు నువ్వు! సైరస్! ఇపుడే చెబుతున్నాను. ఇలాగే ఇంకోసారి చేస్తే నేను చచ్చినా మళ్ళీ నీతో ఏ సభకూ రాను" ప్రేమతోనే

హెచ్చరించింది సుపర్ణ.

ఆమెను ఇంటి దగ్గర వదిలేసి సైరస్ వెళ్ళిపోయాడు. సుపర్ణ తండ్రే తలుపు తీసి "ఏమ్మా! ఎలా ఉన్నాయి ఉపన్యాసాలు?" అంటూ ఆప్యాయంగా పలకరించాడు. "అబ్బా బోరు! అంతా అవినీతి గురించే బాబా" అంది సుపర్ణ నిర్లిప్తంగా. "దేశంలో అంత అవినీతి ఉందంటావా? ఆ పెద్ద మనిషి మరీ గోరంతలు, కొండంతలుగా చెప్పాడు. ఈ అడ్డగాడిద సైరస్ గాడు అవన్నీ నిజమేనని నమ్మేసి నానా గొడవ చేయబోయాడు" అదో గొప్ప విశేషం కాదులే అన్నట్టు చెప్పింది.

"మీ అమ్మలా నీకు రాజకీయాలంటే ఇష్టం లేదు కదూ!" అడిగాడు అమోల్. ఆ ప్రశ్న మరుగున రాజ్య సభ సమావేశాలకు ఢిల్లీ వెళ్ళిన తన తల్లి ప్రస్తావన ఉన్నట్లు సుపర్ణ గ్రహించింది. మానసి ఇంట్లో లేకపోతే ఆ ఇల్లు ప్రశాంతంగా ఉంటుందనిపిస్తుంది. తండ్రి ఆఫీసు నించి ఇంటికి వచ్చాక ఆయనతో కాలక్షేపం చేయటానికి తల్లి ఇంట్లో లేకపోవటం ఎంత లోటో ఆమె అర్థం చేసుకుంది. క్రమక్రమంగా అతను మౌనం అలవాటు చేసుకున్నాడు. ఇంట్లో వుంటే వచ్చినపుడు రేడియోలో వార్తలు వినటం, లేదా ఆఫీసు ఫైళ్ళు చూసుకోవటం అదే అతని పని.

మానసి ఇంట్లో వుండేరోజుల్లో మిత్రా పడకగదిలోని లైటు రాత్రి పది గంటలకే ఆరిపోయేది. అతనికి పెంద్రాళే నిద్రపోవటం అలవాటు. ఇప్పుడా అలవాటు మారింది. అర్ధరాత్రి పన్నెండు దాటినా ఆ గదిలో దీపం వెలుగుతూనే ఉంటోంది. అంతవేళవరకూ తండ్రి ఏం చేస్తున్నాడో అని సుపర్ణ ఓసారి గమనించింది. ఆఫీసు కాగితాలు చూసుకోవటమో, తల్లి రాసిన పుస్తకాలు చదువుతూ కూర్చోవటమో చేస్తుండేవాడు. ఆ రోజుల్లో మానసి రాసిన కవిత్వం విమర్శకులను సైతం మెప్పించింది. అంత విప్లవాత్మకంగా మరెవరూ రాయలేరనిపించేది.

ఓ రాత్రివేళ సుపర్ణ తండ్రి మంచం దగ్గరకు వెళ్ళి "బాబా! నేను నీ గదిలో పడుకోవచ్చా? ఒంటరిగా ఉండటం వల్ల నీకు నిద్ర పట్టడం లేదు కదూ!" అని అడిగింది అభిమానంగా.

తల నెరిసిన మిత్రా చదువుతున్న పుస్తకంలోంచి తల ఎత్తి "నేను ఒంటరివాణ్నెలా అవుతాను. బచ్చా! వెళ్ళు. అప్పుడే పన్నెండు దాటింది. వెళ్ళి పడుకో" అన్నాడు ప్రేమగా నవ్వుతూ!

సెలవులలో ఆమె ఎప్పుడు ఇంటికి వచ్చినా అంతా కొత్తగానే ఉండేది. గదులన్నీ రకరకాలుగా మార్పులు సంతరించుకొనేవి. ఫర్నిచరు కొత్తగా ఉండేది. తలుపుల తెరలు ఖరీదైన సిల్కువే ఉండేవి. గోడలకు, టేబుళ్ళమీద తంజావూరు శిలలు కనువిందు చేసేవి. భోజనాల గదిలోకి టెలివిజన్ వచ్చింది. "బాబా! మనం ఇవన్నీ ఎలా కొనగలుగుతున్నాం" ఓసారి అమాయకంగా అడిగింది సుపర్ణ. తండ్రి మౌనం వహించాడు. ప్రభుత్వంలో ఉన్న అవినీతి పరుల్నందరినీ రిపబ్లిక్ డే రోజున జండా కర్రలకు వేలాడదీసి ఉరి తీయాలనేవాడు సైరస్. 'అమ్మ కూడా ఆ అవినీతి పరులతో కలిసిపోయిందా?' ఆమె ఆశ్చర్యపోయింది.

"మా అమ్మకూడా అందరు రాజకీయ నాయకులులా మారిపోతుందంటావా!" అనుమానంగా సైరస్‌ని అడిగింది సుపర్ణ.

అప్పుడు వాళ్ళిద్దరూ షికారుకు వెళ్తున్నారు.

"అధికారంలో ఉన్న పార్టీ వాళ్ళంతా అవినీతిపరులూ, దగాకోరులే! ఆవిడా ఇప్పుడందులో మనిషే కనుక అంతే అయి ఉంటుంది" అన్నాడు సైరస్. అక్కడ ఉన్న దుకాణాల్లో వాళ్ళేమేమో కొనుక్కు తిన్నారు. కాని ఎవరూ ఉత్సాహంగా లేరు. "అయితే ఇవాళ్టి నుంచీ మా అమ్మని నేను అసహ్యించుకోవటం మొదలు పెడతాను" అంది సుపర్ణ హఠాత్తుగా.

జీవితంపట్ల, ముఖ్యంగా డబ్బుపట్ల మానసి దృక్పథంలో వచ్చిన మార్పుల్ని సైరస్ జాగ్రత్తగా పసికట్టాడు. నీతికీ, నిజాయితీకి తిలోదకాలు ఇవ్వటం అనేది స్త్రీలలో బహుశా ముట్లుడిగే వయసులో ప్రారంభమవుతుందనీ, అప్పుడే వారి జీవితంలో పెద్ద మార్పు వస్తుందనీ అతని



ఉద్దేశం. మానసి నియమనిష్టలనూ, ఆదర్శ వాదాన్ని వదిలిపెట్టేసింది. వంచకురాలిగా, గర్విష్టిగా మారిపోయింది.

"శరీరంలో ఉండే హార్మోనుల ప్రభావమే ఆమె ఇలా మారిపోవటానికి కారణం" అన్నాడు సైరస్. "మా అమ్మకు ముట్లుడిగే వయసు ఇంకా రాలేదే" అంది సుపర్ణ ఆమాయకంగా.

"అయితే ఈ మార్పుకు కారణం గుర్తించటం మరీకష్టం. అది ఆమెలో అంతర్గతంగా దాగి ఉన్న రాక్షసత్వం కావచ్చు. అవిడ అలాంటిదే కావచ్చు. కాని మీ నాన్న ఆవిడను మార్చి ఉండవలిసింది. ఇప్పుడది అసాధ్యం. ఆయన మాట వినే సితిలో లేరు మీ అమ్మ. ఇంకా ఆవిడే ఏం చేస్తుందో ఇప్పుడే చెప్పలేం. ఎప్పుడైనా ఎవర్నైనా హత్య చేయవచ్చు కూడా..." తన ఉద్దేశం చెప్పాడు సైరస్.

"పిచ్చిపిచ్చిగా మాట్లాడకు" ఆమె గొంతులో చెప్పలేని కంగారు తొంగి చూసింది.

"ఢిల్లీ వెళ్లి వచ్చిన ఓ పెద్ద మనిషి చెప్పాడు... మీ అమ్మ విజయ్ అనే మంత్రితో ప్రేమ వ్యవహారం సాగిస్తోందట. నువ్వంటే మీ అమ్మకు అభిమానం ఏదైనా ఉంటే, అలాంటి సిగ్గుమాలిన పనులు ఇకనైనా ఆపివెయ్యమని చెప్పి వప్పించు" అన్నాడు సైరస్.

"బహుశా ఆ వార్త నిజం కాకపోవచ్చు. అమ్మకు ఇప్పుడు నలభై ఏళ్లు. నలభై ఏళ్ళ స్త్రీ ప్రేమ వ్యవహారాలు ఎలా నడుపుతుంది? ఎవరో, ఆమెను చూసి ఓర్వలేని వెధవలు ఇలాంటి కట్టుకథలు ప్రచారం చేస్తున్నారు. ఎంతైనా ఆవిడ ఇప్పుడు రాజ్యసభ సభ్యురాలు కదా! అదీగాక పేరున్న రచయిత్రి కూడాను. అమ్మంటే అందరికీ అసూయే" తల్లిమీద విమర్శలు ఆమె వినలేక పోయింది.

"అసూయ విషయంలో నువ్వు చెప్పింది నిజమే కావచ్చు. కాని నలభై ఏళ్ళ స్త్రీకి ప్రేమికులుండరను కోవటం పొరపాటే. అంతెందుకు; మా మేనత్త నలభై మూడవ ఏట పెళ్ళి చేసుకుంది. కొంతమందికి ప్రౌఢ స్త్రీలంటేనే ఇష్టం. కన్నెపిల్లలయితే వారికి అన్నీ నేర్పాలి. దాంతో ఎంతో సమయం వృథా అవుతుంది?"

"అంటే అలాంటి వ్యవహారాలు నడపటానికి నీకు ముసలాళ్లు కావాలంటావా? పాతికేళ్ళు దాటినవాళ్ళే నీకు స్నేహితురాళ్ళుగా ఉండాలనా నీ ఉద్దేశం? నిజం చెప్పు? నువ్వూ అలాంటి వాడివేనా?"

సైరస్ అలవాటుగా తల వెనక్కు ఎగరేసి నవ్వాడు. రోడ్డమ్మటి వెళ్ళే వాళ్ళూ, బుడగలు, వగైరాలు అమ్ముకునే చిన్నచిన్న వ్యాపారస్తులు వారిద్దరినీ తేరిపార చూశారు. సుపర్ణ రెప్పార్పకుండా చూడవలసినంత అందగత్తె. పొడుగ్గా పుష్టిగా ఉంటుంది. పొడవుగా, పొందికగా ఉండే కురులు ఆమె పృష్ఠ భాగాన్ని కప్పేస్తాయి. వయసుతో పాటు పెరిగిన ఆకర్షణీయమైన అవయవ సంపద ఆమె నడుస్తూంటే అలా అలా అలవోకగా ఊగుతూ మనోహరంగా కనిపిస్తాయి. ముఖం ఏ అవకరం లేకుండా స్వచ్ఛంగా ఉంటుంది. తెల్లని ముఖం మీద ఎర్రటి పెదవులు సగం తినేసిన రెండు దొండ పళ్ళలా కనిపిస్తాయి. ఆమెతో కలిసి నడవటం సైరస్‌కు ఎంతో ఇష్టం.

కాని ఓ వారం క్రితం ఆమెతో అంత ఎక్కువ చనువుగా తిరగవద్దని అతనితల్లి హెచ్చరించింది. "మానసి గురించి ప్రజ అంతా చాలా చెడుగా చెప్పుకుంటున్నారు. అంది అతని తల్లి. అప్పుడతను సుపర్ణ తల్లినే వెనకేసుకు వచ్చాడు. ఓ గంట సేపు అతనలా వాదించిన తర్వాత ఆమె ఏదో అర్థం చేసుకున్నట్టుగా ఆటపట్టిసు న్నట్టు నవ్వేసి వంటింటి వైపు వెళ్ళిపో యింది. సైరస్ తల్లి దండ్రులు ఛాంద సులే కాని సుపర్ణను పెళ్ళి చేసుకోవ టానికి వారికే అభ్యంతరమూ ఉండదు. తన కోరికకు వాళ్ళు అడ్డు చెప్పరని అతని నమ్మకం. పైగా వారికి అతను ఏకైక సంతానం.

పదేళ్ళు వచ్చే వరకూ సైరస్ బలహీ నంగా ఉండేవాడు. ఎప్పుడూ ఎవరో ఒకరు అతన్ని అంటిపెట్టుకు ఉండవలసి వచ్చేది. ఇల్లు వదిలి ఎక్కడికేనా వెళ్ళా లన్నా, కనీసం షాపింగ్‌కు వెళ్ళాలన్నా వాళ్ళకు గగనమయ్యేది. కొంచెం వయసు వచ్చి కాలేజీలో బి.ఏ. చదువుతుండే టప్పుడు కూడా అలవాటైపోవడంవల్ల ఎవరో ఒకరు అతనికి పనుల్లో సాయపడ వలసి వచ్చేది. తరచుగా బయటికి వెళ్ళి కావలసిన బంధువులనూ. స్నేహితులనూ కలుసుకోక పోవటంవల్ల బంధుత్వాలు ఎక్కడ తెగిపోతాయోనని బాధపడే వారు. ఏదో సందర్భంలో ప్రతీవారు వాళ్ళింటికి వచ్చి కానుకలు, స్వీట్లు ఇస్తూంటే సైరస్ తల్లిదండ్రులకు సిగ్గే సేది. అందరికీ ఆ కుటుంబమంటే ఆప్యా యతే! ఇద్దరూ భక్తిపరులే, పాపభీతి ఉన్న వాళ్ళే. వారసత్వంగా వచ్చిన ఆ స్తితో పాటు అదృష్టం కూడా కలిసి వచ్చి బిల్డింగ్ కాంట్రాక్టరుగా స్థిరపడ్డాడు సైరస్ తండ్రి. అందుకే ఆయన కుటుం బాన్ని కంట్రాక్టరుగారి కుటుంబం అని అంతా వ్యవహరిస్తారు.

కంట్రాక్టరు కుటుంబం, మానసి కుటుంబం ఉంటున్న బిల్డింగు సైరస్ నానమ్మది. ఆవిడకి ఎనభై ఏళ్ళు దాటాయి. ఇంటి వెనకాల గదిలో కాలు కదపలేకుండా పడి ఉంటుంది. తిండి తినే సతువ కూడా లేదావిడకి. ఏ చెంచాతోనో చిన్న పిల్లలకు పెట్టినట్టు తిండి పెట్టాలి. కాని ఆవిడ కడుపు పెద్దది. నియమం లేకుండా ఎప్పుడు పడితే అప్పుడు ఏదో ఒకటి తింటూనే ఉంటుంది. ఆవిడకు వైద్యం చేస్తున్న డాక్టరు "ముసలావి డకు ఏది పెట్టినా మితంగానే ఉండేలా చూడండి" అని సలహా ఇచ్చాడు.

సైరస్ చిన్నతనంలో సుపర్ణతోకలిసి ఆ ముసలావిడ దగ్గరకు వెళ్తూండేవాడు. ఆవిడ చూస్తూండగానే ఇద్దరూ చాక్లెట్లు స్వీట్లూ తింటూంటే ముసలమ్మ ఆశగా పెదాలు చప్పరించేది. వెలవెలబోతున్న ఆవిడ ముఖాన్ని వాళ్ళిద్దరూ వింతగా గమనించేవాళ్ళు. 'సుపర్ణ, నేనూ అప్పు డెంత దారుణంగా ప్రవర్తించాం' అను కున్నాడు సైరస్. అతనికి హఠాత్తుగా పాత రోజులు జ్ఞాపకమొచ్చాయి. కదల లేకుండా ఉన్న ఆ ముసలావిడను వారి ద్దరూ వేళాకోళం చేస్తూ తెగ ఏడిపించే వారు.

కాని ఇప్పుడు ఆ సుపర్ణే పరిపూర్ణ స్త్రీత్వం సంతరించుకొంది. ముందు, వెనుక ఆకర్షణీయమైన ఎత్తులతో ఆమె గునగున నడుస్తూన్నా, తననుస్పృశించినా, ఆఖరికి మాట్లాడుతున్నప్పుడు కూడా సైరస్

స్థిమితంగా ఉండలేక పోతున్నాడు. పొరపాటున ఆమెను పరిహాసంచేసినా సుపర్ణకు ఎక్కడలేని కోపము వచ్చేస్తుంది. 'కాని ఆమె కోపంలోకూడా ఎంత అందంగా ఉంటుంది' అనుకున్నాడతను. మానసి గురించి అంత ఘోరంగా మాట్లాడిన సైరస్ సుపర్ణ ప్రేమలో పడ్డాడా ? ఈ పెళ్ళి గురించి అతని తల్లి ఏమంటుందో?

"ఏమిటంత దీర్ఘంగా ఆలోచించేస్తున్నావు?" సుపర్ణ అడిగింది. "నేను ఒకరి పెళ్ళి గురించి ఆలోచిస్తున్నాను" అన్నాడతను ఏ భావమూ వ్యక్తపరచకుండా. "పెళ్ళా! ? ఎవరెవరికిట ?" ఆశ్చర్యంగా అడిగిందామె. "ఇంకెవరికి? నీకూ, నాకూ"

"ఏమిటా వేళాకోళం? నీలాంటి బక్కబావని నేనెందుకు పెళ్ళి చేసుకుంటాను" ఆ మాటల్లో ఆమె ఉద్దేశం ఏమిటో అర్థం కాలేదు సైరస్‌కు.




ప్రధానమంత్రి తనని మంత్రిగా నియమించ నిశ్చయించారని మానసి భర్తతో చెప్పినపుడు మిత్రా ఏమంత ఉత్సాహం చూపలేదు. అతనలా స్తబ్దుగా ఉండిపోవటం చూసి ఆమె కొంచెం కలవరపడింది. "నేనంటే అసూయ పెరుగుతోంది మీకు. జీవితమంతా మీకు తిండి ఒండిపెట్టి వంటింటి కుందేలులా పడి వుండాలని మీ ఉద్దేశం" అంది మానసి రోషంగా.

అమోల్ అలాగే మౌనంగానే కూచున్నాడు. "ఏమిటి జవాబు చెప్పరు?" రెట్టించింది అతని మౌనంతో మరింత రెచ్చిపోయి.

"ఇకనుంచి మీ చెప్పు చేతలలో వుండననీ, ఇల్లు పట్టకుండా తిరుగుతాననీ భయపడుతున్నారు కదూ!"

చదువుతున్న దినపత్రికను జాగ్రత్తగా మడిచి ఓ పక్కగా పెట్టాడు మిత్రా. నిదానంగా కళ్ళజోడు తీసి తుడుస్తూ ఆమెవైపు తిరిగి చిరునవ్వు నవ్వాడు.

"మనూ ! చిన్నపిల్లలా మాట్లాడుతున్నావు నువ్వు. ఈ ఇంటి యజమానురాలులా నువ్వు ఎప్పుడు ప్రవర్తించావు కనుక? ఏదో రకంగా నాతో దెబ్బలాడుదామని బొడ్డుకు మసి రాసుకు్కూచున్నావు. నువ్వు కేంద్ర మంత్రి వర్గంలో చేరబోతున్నావంటే నాకు చాలా సంతోషంగా వుంది. నువ్వు ఆ పదవికి అర్హురాలివే కూడా!" అతను ఎప్పటి ధోరణిలోనే మాట్లాడాడు.

మానసి వడివడిగా నడుచుకొంటూ వంటింటిలోకి వెళ్ళిపోయింది. వంటవాడితో సహా అక్కడ ఎన్నో మార్పులు వచ్చాయి. కొత్తగా వచ్చిన వంటవాడు ఆమెకు వంగి నమస్కారం చేశాడు. "అబ్దుల్ ! మధ్యాహ్నానికి వంట ఏం చేశావు? ఢిల్లీ నుంచి ఇద్దరు మంత్రులు ఈ పూట భోజనానికి వస్తున్నారు. మొఘలాయీల వంటలో నీ ప్రావీణ్యాన్ని ఇవాళ ప్రదర్శించు. సరేనా?" ఆజ్ఞలు జారీచేసి వెళ్ళిపోయిందామె.

అతిథులు వస్తున్నారని భర్తకు చెప్పాల్సిన అవసరం వుందని మానసి అనుకోలేదు. మిత్రా సాధారణంగా ఆఫీసు

కేంటీన్‌లోనే భోజనం చేస్తాడు. అక్కడ చెప్పుకోతగ్గ రుచి ఉండదుకాని తక్కువ రేటుకి భోజనం దొరుకుతుంది. వంట వాడితో మానసి చెప్పటం తాను విన్నాడు కానీ, ఆ విషయం భార్యను అడగాలని అతను అనుకోలేదు. ఒకవేళ అడిగితే 'మీరు కూడా ఉండండి! లేకపోతే బావుండదు' అంటుందేమో అని మిత్రాకు, భయం కూడా.!

అతను మొదటిసారిగా ఇంత కాలానికి తన దరిద్రావస్థితికి సిగ్గుపడ్డాడు. తనని ఎంత గొప్ప టైలరైనా మార్చలేడు. సహజ సిద్ధంగా వచ్చిన ఆకారాన్నీ, ముడతలుపడిన శరీరాన్నీ, గారపట్టిన పళ్ళనూ ఏ టైలరు మాత్రం ఏం చేయ గలడు?

ఇంత కాలం గుడ్డిగా, నిర్లక్ష్యంగా ఉన్నందుకు తనను తానే తిట్టుకున్నాడు. భార్యను అనవసరంగా ఇబ్బందులపాలు చేశాననుకున్నాడు.దంత వైద్యుని దగ్గరకు వెళ్ళి పళ్ళను శుభ్రపరచుకుని ఉండవల సింది. ఏదేనా యోగాసనాల కేంద్రానికి వెళ్ళి తన శరీరాన్ని అందంగా మలచుకొని ఉండవలసింది.జుట్టుకు రంగు వేసుకోవటం అలవాటు చేసుకొని వుండలసింది. అంత ఎందుకు ? అసాధ్యంకాని ప్రతి పనినీ అతడు చేసి వుండవలసింది. కానీ, ఇన్నాళ్ళూ అతని మస్తిష్కంలో వున్న ఆలోచన వేరు. 'నాకు జీవితంలో ఏం తక్కువైంది?' అనుకునేవాడతను.

ఇప్పుడు అలాంటివన్నీ అనవసరం. ప్రేమ పంజరంలోంచి బంగారు చిలక ఎగిరిపోయింది. అతను సంరక్షించినదాన్ని ఆమె పూర్తిగా నాశనం చేసిన తరవాతే ఆ చిలకను పట్టుకోగలడు.

ఇకనుంచీ ఆమెకు అతనితో ఇంటి పక్కనే వున్న హాల్లో మార్నింగ్‌షో చూడటానికి కూడా తీరిక వుండదు. సినిమా ఇంటర్వెల్‌లో ఆమెకోసం కొన్న ఐస్‌క్రీమ్‌ను పిల్లి పిల్లలా పళ్ళని నాలిక కొనతో చప్పరించటానికి ఖాళీ దొరకదు. ఆమెకు చెప్పలేనంత హడావుడి. చివరికి భర్త చెప్పే కబుర్లు వినటానికికూడా తీరికలేనంత హడావుడి.

పొద్దున్న టిఫిను చేయటానికి మానసి అతనికి ఎదురుగా కూర్చున్నపుడు ఆమె ఇంకా రాత్రి పడుకునేటపుడు కట్టుకున్న బట్టల్లోనే ఉంది. రాజ్యసభ సభ్యురాలు కావటానికి పూర్వం ఉదయాన్నే ఎనిమిది గంటలలోపలే స్నానాదికాలు ముగించు కొని టిఫిను చేయటానికి ముందే పూజ పూర్తి చేసేసేది. కాని ఇపుడామె నిద్ర కళ్ళతో, చెదిరిపోయిన జుట్టుతో టిఫినుకు రాగానే అమోల్ మిత్రా ఎందుకో బాధ పడ్డాడు. ఎప్పుడూ పొద్దున్నే చేస్తున్న పూజలు ఆమె ఎందుకు మానే సిందో అడగటానికి అతనికి ధైర్యం లేదు. మానసి ప్రాతః కాలంలో కాళీ పూజలు చేస్తే అధికార పార్టీకి ఏమైన హాని జరుగుతుందా? ఆమె నియమనిష్ఠ లని కొనసాగిస్తే పార్టీ పట్ల తనకుగల విధేయతను శంకిస్తారా ?

"ఏమిటి పేపరు విశేషాలు ? ప్రధాని రష్యా వెళ్ళటం గురించి ఏమైనా వార్త లున్నాయా?" మానసి అడిగింది.

"పొద్దున్న ఎప్పుడో చదివిన పేపర్లో నాకేవీ రలూ గుర్తుండవు. రాజకీయంగా దేశం ఏమైపోతోందో పట్టించుకోవాలని కూడా నాకు అనిపించటంలేదు. ఇప్పుడు నేను చదువుతున్న వార్తలన్నీ మరణ

వా ర్తలే!" నిర్లిప్తంగా సమాధానమిచ్చాడు

'ఎంత గుంభనంగా మాట్లాడుతున్నా రీయన' అనుకుని ఆశ్చర్యపోయింది మానసి. రొట్టెకు వెన్న రాసుకుంటూ జీవం లేని నవ్వు నవ్వింది. "బచ్చీకి ఉత్తరం రాశావా? కిందటిసారి అది వచ్చి వెళ్ళినపుడు ఇదివరకటిలా వారం వారం నువ్వు ఉత్తరాలు రాయట్లేదనిచెప్పింది."

"అవును. కిందటి నెలంతా ఢిల్లీలో పనుల వత్తిడి ఎక్కువగా ఉంది. ఎవరికీ ఉత్తరాలు రాయలేదు నేను. అన్నట్టు ఆ విషయం సరిగా జ్ఞాపకం ఉండటం లేదు కూడా"

"అనేకమందిలో అది కూడా ఒకత్తి అనుకోకు. సుపర్ణ మన కూతురు. మొన్న సెలవుల్లో అది నిన్ను చూడకుండానే వెళ్ళిపోయింది. నా ముందే ఏడిస్తే నేను బాధపడతానేమోనని అది ముఖం చాటు చేసుకొనేది! పిచ్చి పిల్ల! సైరన్



ఉన్నాడు కనుక ఎప్పటిలా దానిని షికార్లకీ, సభలకీ తీసుకెళ్ళాడు. లేకపోతే.."

"సైరస్‌గాణ్ని చీటికీ మాటికీ మన ఇంటికి రావద్దని చెప్పండి. రేపొద్దున్న కొంపతీసి ఆ వెధవ నా కూతుర్ని ప్రేమిస్తున్నానంటే ఎంత గొడవవుతుంది. అప్రతిష్టకూడా" చెప్పింది మానసి రొట్టె నములుతూ.

"వాళ్ళిద్దరూ ఒకర్నొకరు ప్రేమించుకొనిఉంటే వాళ్ళే పెళ్ళి చేసుకుంటారు. అంతే! ఇందులో గొడవ ఏముంది?"

"నాకు తెలుసున్నంత వరకు సైరస్ బుద్ధిమంతుడు, బాధ్యతలు తెలిసినవాడు. పైగా అమ్మాయంటే అతనికి వల్లమాలిన ప్రేమకూడా..."

"మీ ఇష్టం వచ్చినట్టు మాట్లాడకండి! సాలెపురుగులా రెపరెపలాడే ఆ బక్కపీనుగునా నా కూతురు పెళ్ళిచేసుకొనేది? వాళ్ళవి విరుద్ధ మనస్తత్వాలు. వాళ్ళేం సుఖపడతారు? అదంతా అలా వదిలెయ్యండి! నా కూతురు భవిష్యత్తు గురించి నాకు ఎన్నో గొప్పగొప్ప ఆశలున్నాయి. మిమ్మల్ని పెళ్ళి చేసుకుని ఈ ఇరవై ఏళ్ళలోనూ నేను అనుభవించిన నరకంలాంటిది నా కూతురు కలలో కూడా ఊహించకూడదు"

"ఏమిటీ? నువ్వు నావల్ల అంత ఇబ్బంది పడ్డావా? నువ్వు అసంతృప్తిగా ఉన్నావని నాకు తోచనైనా లేదు. జ్ఞాపకం తెచ్చుకో! మనం ఆనందంగా ఉన్న రోజు ఒక్కటి కూడా లేదంటావా? మనం విక్టోరియా గార్డెన్స్‌కు వెళ్ళినపుడు నువ్వు చాలా ఆనందంగా ఉన్నావు. నాకు బాగా గుర్తు. ఆ రోజున సుపర్ణకు కోతులను చూపించి నువ్వు ఎంతగా పగలబడి నవ్వావో! నవ్వినవ్వి నీ ముఖం ఎర్రని కెంపులా తయారయింది. ఆ రోజున సరిగ్గా నువ్వు అలాంటి రంగుచీర నల్లచారలది కట్టుకున్నావు కదూ. జుట్టు ముడికూడా వేసుకోకుండా అలాగే గాలికి వదిలేశావు వదులుగా."

"ఏ ప్రాముఖ్యమూ లేని అలాంటి చిన్న చిన్న సంఘటనలను కూడా జ్ఞాపకం పెట్టుకొని ఈ భూమ్మీద ఎలా బతుకుతారండీ మీరు? నాకు కొంచెం కూడా గుర్తులేదు"

"నీకు సంబంధించిన ఏ చిన్న విషయాన్ని నేను మర్చిపోలేను మనూ!" అన్నాడతను.

మాట మార్చేయటం మంచిదనే ఉద్దేశంతో "చాల్లే! నీ మధుర జ్ఞాపకాలు బాగానే ఉన్నాయికాని తింటున్నపుడు కబుర్లు, వాదించుకోవటాలూ ఎందుకూ?" అంది మానసి.

వాళ్ళు మౌనంగా టిఫిను తినటం పూర్తి చేశారు. టిఫినుగా వాళ్ళు తిన్నవి పాయసం, ఫ్రై చేసిన గుడ్లు, టోస్టు, పళ్ళు. ఇత్తడి గుండీలు మెరిసి పోతూన్నాయి అబ్దుల్ తెల్లచొక్కామీద. వంటవాడైనా ఆ డ్రస్‌లో హుందాగానే వున్నాడతను. అతనే వడ్డించాడు ఇవన్నీ. ఇంటిని ఇలా మార్చగలిగి నందుకు మానసి మనసు గర్వంతో పొంగిపోయింది. ఇల్లు మార్చేస్తే బావుండునని ఆమె చాలా కాలం నుంచీ ఆలోచిస్తోంది. ఈ ఇంట్లో ఖాళీతక్కువ. ఇరుకు. రెండే పడక గదులున్నాయి. ఒకటి భార్యాభర్తలకీ. రెండోది సుపర్ణకీ. ఎవరేనా అతిథులు వస్తే హడావుడే.

ఇల్లు మార్చటం గురించి ఆమె

దేశాయ్ తమ్ముడితో చెప్పే ఉంచింది. అతను మహారాష్ట్ర హౌసింగ్ శాఖ మంత్రి గారి బావమరిది. మెరీనా డ్రైవ్ ప్రాంతంలో నాలుగు పడక గదులున్న ఇల్లు చూడమని చెప్పింది. అక్కడైనా రాసుకుంటున్నపుడు సముద్రాన్ని చూస్తూ భావోద్రేకం తెచ్చుకోవచ్చునని ఆమె ఉద్దేశం.

కవిత్వం రాయటం గురించి జ్ఞాపకం వచ్చేసరికి ఆమె ముఖం ఆనందంతో వెలిగిపోయింది. కించిత్ గర్వం కూడా పొడ చూపింది. ఏడు నెలలుగా ఆమె ఒక అక్షరమైనా రాసి ఎరుగదు. విజయ్‌తో నడిపిన ప్రేమ వ్యవహారం ఆమె శక్తిని హరించివేసింది. ఆమెకు ఎప్పుడైనా తీరిక దొరికినా తెల్ల కాగితం లాంటి ఆమె మనసుమీద సున్నితమైన విజయ్ వీపు, వేటాడే అతని చూపులు ముద్రవేసుకుంటాయి.

"మనూ ! ఇవాళేనా బచ్చూకి ఉత్తరం రాయి" అన్నాడు మిత్రా టిఫిను పూర్తిచేసి కుర్చీలోంచి లేస్తూ.

"ఇవాళ విజయ్‌ని హాస్టలుకు వెళ్ళి సుపర్ణ ఎలా ఉందో చూసి రమ్మని చెప్పాను. అతనితో దానికి ఓ కాశ్మీరు సిల్కు చీరను కూడా పంపాను. నిన్న అతను లక్నో చేరి ఉంటాడు. ఇవాళ తన పని పూర్తయ్యాక అమ్మాయిని చూసి, నేను పంపిన బహుమతినీ, ఉత్తరాన్నీ ఇస్తాడు" అంది మానసి.

ఆ మాటలు వినగానే మిత్రా కంగారు పడ్డాడు. విజయ్ పేరున్న వ్యక్తి. అలాంటి వాడు ఓ హాస్టలుకు వెళ్ళి ఓ అమ్మాయికి చీర బహుమతిని ఇవ్వటం చూస్తే మిగిలిన వాళ్ళుఏమనుకుంటారు? అధికారోదాహంలో తాను కూతురుకు మంచి చేయటానికి బదులు హానిచేస్తున్నానని గుర్తించలేక పోతోందా? తాను చెప్పే ప్రతీ మాటకీ ఎదురు తిరుగుతూండటంతో ఆమెతో ఏ విషయానికి సంబంధించిన సంభాషణ ఆయినా అతడు కొనసాగించలేక పోతున్నాడు. ఇలాంటి సంఘటనలతో అతను విపరీతంగా భయపడిపోతున్నాడు. ఆఫీసుకి టైమవుతోందనే నెపంతో అతను పడక గదిలోకెళ్ళి బట్టలు వేసుకోసాగాడు.

మానసి అతన్ని అనుసరించింది. అలమార తెరిచి లోపల అరలలో ఉన్న వస్తువుల నన్నిటినీ పరీక్షగా గమనించింది. అమోల్ బట్టలవైపు చూస్తూ "ఈ అరలో ఉన్న మీ బట్టల్ని అమ్మాయి గదిలో ఉన్న అలమారకి మార్చుకోండి. ఢిల్లీ వెళ్ళేముందు నేను ఖద్దరు చీరలు కొనుక్కుంటాను. ఇకనుంచీ వాటినే కట్టుకోవాలి నేను. వాటికే చోటు చాలదు ఇందులో. తరవాత, మీ గడ్డం గీసుకొనే సామాను ఎలా చెల్లాచెదరుగా ఉందో చూడండి ? ఛీ ! ఛీ ! ఏం మనుషులు ? మీకు సంబంధించిన వస్తువుల నన్నిటినీ జాగ్రత్త చేసుకోవటానికి మరో గదిలో చోటే లేదా ? రాత్రికి..." రాత్రికి "ఇక్కడ నా అవసరం ఏమైనా ఉందా ? పక్కలో నేనుంటే నీకు చిరాగ్గా ఉంటుందేమో ?"

"అయ్యో ! మీరు మళ్ళీ నన్ను అపార్థం చేసుకున్నారు. మీకు ఈమధ్య కోపం ఎక్కువైనట్టుంది. నేనేం చెప్పినా మీకు వెగటుగానే ఉంటోంది. మీరు బాగా మారిపోయారు అమోల్ ! బరువు తగ్గిపోయావు. ముఖం పాలిపోయింది. ఒంట్లో ఎలా ఉంది? మన డాక్టరును పిలిచి ఓసారి పరీక్ష చేయించుకోకూడదూ ? బ్లడ్

ప్రెషరో, మరోటో మొత్తానికి ఏదో తేడా ఉన్నట్టుగా ఉంది."

"ముందు నీ బుర్రని పరీక్ష చేయించుకో" అని గొణుక్కుంటూ కోపంగా ఆ గదిలోంచి బయటకు వెళ్ళిపోయాడు. మానసి మంచంమీద కూర్చుని తనలో తనే కుమిలిపోయింది. "తప్పెవరిది?" జరిగిన దాని గురించి ఆలోచించసాగింది.



ఒకప్పుడు దయతలచి ఇంత నీడ ఇచ్చి ఇప్పటివరకూ తోడుగా ఉంటున్న అమోల్‌ను తనకు తెలియకుండానే తూలనాడుతోందా? కన్యగానే గర్భవతి అయిన తనవంటి ఆడదాన్ని అమోల్ మంచివాడు కనుక ఆదరించాడు. పెళ్ళి చేసుకున్నాడు. సుపర్ణ జన్మ రహస్యాన్ని ఇప్పటికీ గోప్యంగానే ఉంచాడు. ఇన్నాళ్ళనుంచీ ఇన్ని పోట్లాటలు జరుగుతున్నా, దాంపత్యం భగ్నమవుతుందన్న పరిస్థితికి వచ్చినా, ఆమెను దెప్పటానికి కాని, తాత్కాలికంగా భార్య నోరు మూయించటానికి కాని కూతురి రహస్యంగురించి ఒక్కమాట కూడా అనలేదు.

అమోల్ చాలా విచిత్రమైన మనిషి. అతను కూడా విజయ్‌లా అందంగా, బలిష్టంగా ఉండి ఉన్నా, ప్రధానిలా ఆకర్షణీయంగా ఉన్నా మానసి అమోల్ భార్యగానే వుండిపోయేది. అప్పుడు ఆమె సంతోషానికి ఎల్లలు ఉండేవి కాదు. ఇపుడు అమోల్‌ను కొత్త స్నేహితులకు పరిచయం చేయాలంటే అతన్ని వారు హేళన చేసారేమో అనే భయంతో ఆమె ఆ పని చేయలేకపోతోంది. అతని బట్టలు ఎంత దరిద్రంగా ఉంటాయో, ఆ బట్టలను అతను ధరించే పద్ధతి అలాగే ఉంటుంది. అతను ఇంతవరకూ ఏ రాజకీయ సమావేశంలోనూ పాల్గొలేదు. కాని దళసరి ఫ్రేమున్న పెద్ద పెద్ద అద్దాల కళ్ళజోడును పెట్టుకొని సభలలో నిశ్శబ్దంగా కూర్చుంటాడు. అతనికే గనుక ఎదుటి వారికి సిగరెట్లను ఎలా అందివ్వాలో సరిగ్గా తెలిసినా, పదిమందీ చూసి మెచ్చుకోగలిగేలా సొగసుగా నడవగలిగినా ...

* * *

అతిథులంతా వెళ్ళిపోయారు.

ఇంట్లో విజయ్ కాక ప్రధాని, మానసి మిగిలారు. విద్యుద్దీపాల గుత్తిలోంచి స్ఫటికంలాంటి వెలుతురు జారుతోంది. అక్కడ ఆ ముగ్గురూ అలా కూర్చుండిపోవటానికి ఎవరి కారణాలు వారికున్నాయి. సాధారణంగా ఏ విందుకైనా ప్రధాని ఆలస్యంగా వచ్చి, అందరికంటే ముందు అక్కడినుంచి వెళ్ళిపోతారు. కాని ఈసారి తలనెప్పిగా ఉందనేనెపంతో ఇంట్లోకి వెళ్ళి పడుకున్నాడాయన. మళ్ళీ బయటకు వచ్చేలోగా పనులుంటే మిగిలిన అతిథులంతా వెళ్ళిపోవచ్చునని కూడా చెప్పారు.

ప్రధానిని మానసి బాగా ఆకర్షించింది. ఆ విషయంలో అనుమానమేమీ లేదు. కానీ వయసులో ఉన్న విజయ్‌లాంటి అందగాడు ఆమె ప్రియుడు కదా! అలాంటప్పుడు ఆమె ప్రధానిని ఆదరంగా, అభిమానంగా చూస్తుందా? అయనకు ఇష్టమైన విధంగా ఆమె నడుచుకుంటుందా? విజయ్ అన్నింటికీ తెగించినవాడు. పట్టిన పంతం నెగ్గించుకోగలిగినవాడు. అవసరమైతే సొంత పెళ్ళాన్నైనా అప్పగించి ఎదుటివారి విశ్వాసాన్ని చూరగొంటాడు. కాని ప్రధాన మంత్రి అయిఉండీ ఆయన అలా సిగ్గుమాలి ప్రవర్తించగలడా? అందువల్ల మానసి ఒంటరిగా వున్న సమయం చూసి, విషాదంగా నవ్వుతూ "ఇప్పుడే నా తల నెప్పి ఎగిరిపోయింది" అన్నారు ప్రధాని. "కాని మీరు బాగా అలసిపోయినట్లు కనిపిస్తున్నారు. విజయ్‌ని కాఫీ పంపమని చెప్పాను... మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి" వినయంగా అంది మానసి.

"నువ్వు ఎంత మంచిదానివి మానసీ! మామూలుగా ఇలాంటి ప్రైవేటు పార్టీలకు నేను రావటానికి టైము ఉండదు. విజయ్ నీ పేరు చెప్పి ఎరవేయటంతో నేను రాక తప్పలేదు"

మానసి పెదవులపై మనోహరంగా, మందహాసం మెరిసింది. "నేనంటే అభిమానం కొద్దీ అలా అంటున్నారు" అంటూ ఆయన వైపు చూసింది. ఆమెకూ, ప్రధానికీ మధ్య ఓ టేబిలు మాత్రమే ఉంది. టేబిలు మీద ఏష్‌ట్రేలన్నీ సిగరెట్టు పీకలతో నిండిపోయి అసహ్యంగా కనిపిస్తున్నాయి. మానసి రెండు కాళ్ళనీ విశ్రాంతిగా ఎదరకు చాచి ఓ కాలును టేబిలు అంచుపై ఉంచింది. ఆమె కాలు మంచి గంధపు చెక్కలా తెల్లగా మెరిసిపోతోంది. కాలి గోళ్ళకు ఆకర్షణీయమైన గులాబీ రంగు కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. ప్రధాని ఆమె కాలి గోళ్ళను కాంక్షగా చూశారు.

"నేను అభిమానం కొద్దీ అలా అంటున్నానన్నావు. అంటే నీపట్ల నాకు అభిమానం ఉందనేగా. కాని నీకే నేనంటే అభిమానం లేదు" అన్నారాయన హఠాత్తుగా.

"ఇంకా నయం! మీరు ఏదో జోక్ చేస్తున్నారు. నాకు మీరంటే ఎనలేని గౌరవం. నానుంచి మీకు ఏం కావాలన్నా నిరభ్యంతరంగా అడగవచ్చు. నేను విశ్వసించ తగినదాన్నే. సమయం సందర్భం కోసం తటపటాయించనక్కర లేదు. మనస్ఫూర్తిగా అంటున్న మాటలివి. ఇలాంటివి నేను మీకు వేరే చెప్పేదేముంది ?" ఆశ్చర్యాన్ని మిళాయించి చెప్పింది మానసి.

"విశ్వాసం అనేది జంతు సంబంధమైన ఉద్వేగం లాంటిది. నీలాంటి మేధావినీ, అప్సరసనీ విశ్వాసానికి మించినది ఏదైనా ఆశించటం తప్పుకాదనుకుంటాను" గుంభనగా అన్నారు ప్రధాని.

ఆయనకి ఏభై ఏళ్ళు దాటాయి. కాని అంత వయసున్నవాడిలా కనిపించరు. సంవత్సరం నుంచీ అన్ని సుఖాలనూ అందిస్తున్న విజయ్‌ని కాదని, అతన్ని దూరంగా విసిరికొట్టేయటమా? ప్రధానికి ఇష్టురాలిగా, ఆంతరంగికురాలిగా ఉండటమా ? ఆమె ఓ క్షణం ఆలోచించింది. ప్రధాని తనను వాంఛిస్తున్నాడనీ, తనతో ప్రేమకలాపాలు సాగించాలనుకుంటున్నాడేనేది స్పష్టంగా తెలుస్తున్నదే ! మానసి మరోసారి చిరునవ్వు చిందించింది.

"పగలంతారాజకీయాలోనూ, చర్చలు, సమావేశాలూ, సభలతో దారుణంగా అలసిపోతున్నాను. రాత్రి ఇంటికి రాగానే నా ఆలనా పాలనా చూసేందుకు మా ఆవిడ లేనేలేదు. ఆమెకు తెలుసు తాను ఏం చేస్తే నేను విశ్రాంతి తీసుకుంటానో. ఆవిడకు కూడా నీకు మాదిరిగానే పొడుగైన వేళ్ళుండేవి. ఆమె నా జుట్టులోకి వేళ్ళు జొనిపి మర్దనా చేసినట్టు చేసేది. అప్పుడప్పుడు నా మెడ వెనుక నరాన్ని ఒత్తి నా బాధను ఉపశమింపచేసేది. ఈ చిన్న చిన్న రోగాలకూ, రొష్టులకూ కారణం నరాల ఉద్రిక్తతే. తెల్లవారుఝాము వరకూ నాకు నిద్రే పట్టదు. నీకు తెలియదేమో నేను చాలాకాలంగా ఒంటరితనంతో బాధపడుతున్నాను. దగ్గరవాడు అని చెప్పుకోవటానికైనా ఒక్క స్నేహితుడు కూడా లేడు."

మానసి తాను కూర్చున్న కుర్చీ

లోంచి లేచి ఆయన దగ్గరకు వెళ్ళింది. నాజూకైన వేళ్ళ కొనలతో పల్చగాఉన్న క్రాపుమీదనుంచి ఆయన తలను సుతారంగా మర్దనా చేయసాగింది. మెడవెనుక భుజాల పైన మెల్లిగా దువ్వింది. ఆమె చేతులు ఎందుకో వణికాయి. "ఇకనుంచి ఎప్పుడూ ఒంటరిగా ఉన్నాననుకోకండి. మీకు కావలసినవన్నీ నేను చూసుకుంటాను" అని సముదాయించి ఆయన ముఖాన్ని పైకెత్తి వెచ్చని చేతుల్లో ఇముడ్చుకుని పెదాలపై గాఢంగా ముద్దు పెట్టుకుంది. ఏ రకమైన బాధవల్లో కాని ప్రధాని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "ఛ ఛ! ఏమిటది? మీరలా బాధపడితే నేను చూడ లేను. మీలాంటి పెద్దలు చేయవలసిన పనేనా అది!"

'ఇలాంటి విషయాల్లో ఏ మగాడైనా ఇంతే!' అనుకుందామె. ఎంత గొప్పవాడైనా ఆడదాని కొంగు తగిలితే నిలదొక్కుకోలేడు. మానసి చేయి తిరిగిన శిల్పిలాంటిది. ఎవరినైనాసరే తనకు కావలసినట్టు తీర్చిదిద్దుకోగలదు.

ఆయన మెడ దగ్గర సుతారంగా రాస్తూ కళాఖండాన్ని తీర్చిదిద్దుతున్న అనుభూతి పొందిందామె. "ఇప్పుడెలా ఉంది?" లాలనగా ప్రధానిని అడిగింది మానసి. ఆయన నీరసంగా ఫరవాలేదన్నట్టు తల ఊపి ముద్దు పెట్టుకొనటానికి ఆమె చేతిని పట్టుకొన్నారు.

"నువ్వే నాకు తగిన స్నేహితురాలివి. ఎప్పటికీ నాదానివిగానే ఉండిపో" గుసగుసగా అన్నారు ప్రధాని.

విజయ్ కాఫీ పట్టుకొని ఆ గదిలోకి రాగానే వాళ్ళిద్దరినీ ఆ స్థితిలో చూసి ఒకడుగు వెనక్కి వేశాడు. వాళ్ళిద్దరినీ తానే అలా కలుసుకొనేలా చేశాడని వాళ్ళకి తెలియటం అతనికి ఇష్టం లేదు.

ప్రధాని ఒంటరివాడే కాదు, తుంటరి వాడు కూడా. ఇష్టంలేని స్త్రీతో కూడా వ్యవహారం సాగించగల ఘటికుడు. ఆమెతాను ఫలానావారి సొంతం అనిపించుకోవాలనుకుంటుంది. అది కూడా గొప్పవాళ్ళకే. ఆమె సరదాగా జోకులు వేస్తూ చిరాకు పరాకుల నుంచి దృష్టి మళ్ళించగలదు కూడా. ఆమె ఎవరితో ఉన్నా గొప్పే.

ప్రధానికి డాక్టరు ఎలాంటి సలహా ఇచ్చాడో అందుకు అనుగుణంగా నడుచుకోగల స్త్రీ మానసి. తాను పైపైకి వెళ్ళాలని తపన పడుతోందనేది తెలిసిన విషయమే అయినా అందువల్ల విజయ్ పలుకుబడి కూడా పెరుగుతుంది. ఆమె ద్వారా అతను కేంద్ర మంత్రివర్గంలో మూల స్తంభంగా రూపు దిద్దుకొంటున్నాడు.

"విజయ్! రా! ఈయనకు కాఫీ ఇయ్యి! దాంతో ఈయన తలనెప్పి మాయమవుతుంది" అంది మానసి తలుపు దగ్గరే తచ్చాడుతున్న విజయ్‌ని చూసి.

అతని చేతుల్లోంచి కాఫీ అందుకొని ప్రధానికి ఇచ్చిందామె. వాళ్ళిద్దరి చేతులూ రహస్యంగా కలుసుకున్నాయి. ప్రధాని కళ్ళల్లో ఎరుపు జీరలు చూసి విషయం అర్థం చేసుకున్నాడు విజయ్. కానీ, అదేం తెలియనట్లు ప్రవర్తించాడతను.

"మానసీ! బాగా పొద్దుపోయినట్లుంది. నిన్ను ఇంటి దగ్గర దింపమంటావా?" అడిగాడు విజయ్ సోదర వాత్సల్యాన్ని ప్రదర్శిస్తూ.

"పోనీ నేను తీసుకు వెళ్తాన్లే నిన్ను. రాత్రిళ్ళు విజయ్ సరిగా కారు నడపలేడు.

నువ్వు కారు తీసుకు రాలేదా! ఫరవా లేదులే. నేనున్నాగా!" అన్నారు ప్రధాని.

మానసి కారుకు పంక్చరయింది. ఆ విషయం విజయ్‌కి తెలుసు. మిగతా డ్రైవర్లతోపాటు మానసి కారు డ్రైవరు కూడా కాఫీ, టిఫిను తీసుకుంటుండగా ఏ కుర్రాడో ఈ దుడుకు పనిచేసి వుంటాడు. అందువల్ల ఆమె కారు నిరుపయోగంగా పడి వుంది. డ్రైవరును ఇంటికి పంపించే శాడు.

ప్రధానిని ఆమె మర్యాదకోసమైనా తన ఇంటికి పిలుస్తుందనీ, అప్పుడే జరగ వలసినదేదో జరుగుతుందనీ, రెప రెప లాడే ఆమె దుస్తులు, యావతో బరు వెక్కిన కంఠంనుంచి వచ్చే ఆమె మాటలు ప్రధాని వ్రతాన్ని భగ్నం చేసి తీరు తాయని విజయ్‌కి తెలుసు. ప్రధాని తల్లి పాల కోసం ఏడిచే చిన్న పిల్లాడులాంటి వారు. మానసిలాంటి ఎత్తు గుండెలున్న స్త్రీలను చూస్తే ఆయన నిగ్రహించుకో లేరని ఎవరో చెప్పగా విన్నాడు విజయ్. మానసితో పరిచయం కావటంతో ఆయన రొట్టె విరిగి నేతిలో పడినట్లయింది.

విజయ్ ఇంటి నుంచి బయటకు వచ్చే శాక మానసికి ఆనుకొనే కూర్చుని ఆమె వైపే రెప్ప వేయకుండా చూడసాగారు ప్రధాని. తన మంత్రి వర్గంలోని స్త్రీ నడుం చుట్టూ చెయ్యి వేసి ఏదోలా ప్రవ ర్తించటం ఒక దేశపు ప్రధానిలాంటి వారికి తగని పని. కారు అద్దంలోంచి ఎవరైనా తమని గమనిస్తారేమోననే ఇంగితం కూడా లేకుండా పోయిందాయనకి.

ఇంటి దగ్గర కారు ఆగగానే ఆయనను లోపలికి రమ్మని ఆహ్వానించింది మానసి.



"మా ఇంట్లో కాసేపు కూర్చుని వెళుదురు గాని రండి" అంది ఆమె ఇంటి గుమ్మం వైపు దారి తీస్తూ. ఆమె ఇల్లు వెన్నెలలో తెల్లగా మెరిసిపోతోంది. ఇంటి ముందు ఏవో తీగలు అందంగా పెరిగివున్నాయి. ఎక్కడి నుంచో చంపక పుష్పాలు వెద జల్లుతున్న సువాసనను గాలి మోసు కొచ్చింది. ఆమెను అనుసరించారు ప్రధాని. మానసి తాళం తీసి, తలుపును బార్లా తెరిచింది. లోపలికి అడుగుపెట్టగానే ఆయనకు కొయ్యతో చేసిన చక్కని ఒంపులు తిరిగిన శిల్పం కనిపించింది. ఇంతలో "పై అంతస్థులో కూర్చుందాం! అక్కడ నిశ్శబ్దంగా ఉంటుంది" అన్న మానసి మాటలు వినిపించాయి ఆయనకి.

పై అంతస్థులోని బాల్కనీలో ఫర్నీచ రంతా ప్రేముతో తయారు చేయించింది మానసి. వాటికి తన కిష్టమైన తెలుపు రంగు వేయించింది. అక్కడున్న ఓ కుర్చీలో మెల్లిగా కూర్చుని చిన్నగా నిట్టూర్చారు ప్రధాని.

"ఒక్క క్షణంలో వచ్చేస్తాను" అంటూ పసుగులాంటి నడకతో పడక గదిలోకి వెళ్ళిందామె. ప్రధాని కూర్చున్న చోటు నుంచి ఆ గది స్పష్టంగా కని పిస్తోంది. ఆకాశంలో మేఘాల గుంపులను చీల్చుకుంటూ త్వర త్వరగా పరిగెడు తున్నాడు చంద్రుడు. చంపకాలు పక్కనే వున్నట్టు సువాసన మరీ ఎక్కు వగా గుబాళిస్తోందక్కడ. 'ఆ చెట్టును ఓసారి చూస్తే బావుండును' అనుకొన్నా రాయన. ఆ వెంటనే ఆయనకి హఠాత్తుగా తల్లి జ్ఞాపకం వచ్చింది. ఆమె చనిపోయి ఏడేళ్ళు పైగానే అవుతుంది. ఈ మధ్య కాలంలో తల్లి గురుకు రావటం ఇదే మొదటిసారి. పెషావర్‌లో ఉండేటప్పుడు

రాత్రిళ్ళు అద్దాలు పగిలిపోయిన కిటికీ లోంచి పడమటి గాలి ఆయనను వణుకెత్తించేటపుడు తల్లి ఆయన ఒళ్ళు నిమిరేది. జేబులోంచి సిల్కు జేబు రుమాలు బయటికి తీసి ఆయన ముక్కు తుడుచుకున్నారు.

ఆయన తల్లి పాల నురుగులా తెల్లగా వుండేది. శీతా కాలంలో చర్మం పొడారిపోయి నల్లగా తయారయినా ఆమె కళ్ళు ఎప్పుడూ సంతోషంతో కళకళ లాడుతూ వుండేవి. వంటింట్లో పని చేస్తున్నపుడైనా సరే, చపాతీలు ఒత్తుతున్నపుడైనా సరే, వెన్న తీయటం కోసం మజ్జిగ



చిలుకుతున్నపుడైనా సరే, రాట్నం దగ్గర కూర్చుని నూలు ఒడుకుతున్నపుడైనా సరే ఆమె అలాగే వుండేది. కొడుకుతో ఆడుతుంటే ఆమె ఎంత నిండుగా వుండేది? తను అడిగినదేదైనా ఇవ్వకపోయినా ఎప్పుడైనా తనను వేళాకోళం చేసినా ఉక్రోషంతో ఏడుపు మొదలు పెడితే ప్రేమగా కౌగిలించుకొని ఏడ్పుమాని పించేది. "అమ్మో! నాకూపిరి ఆడటం లేదు..." తల్లిని గురించి ఆయన ఆలో చిస్తుండగా "నాకు డ్రింకులు తయారు చేయడం అంత బాగా రాదు" అంటూ రెండుగ్లాసులు పట్టుకుని వచ్చింది మానసి. అది ఐస్ వేసిన షర్బత్తు. "మీకు ఇదంటే ఇష్టమేనా?" అడిగిందామె.

"మా అమ్మగారు జ్ఞాపకం వచ్చేలా చేశావు నువ్వు!" అన్నారాయన గ్లాసు లోని పానీయాన్ని మెల్లిమెల్లిగా గుట కలు వేస్తూ. "మా అమ్మ చాలా అందంగా ఉండేది. యౌవనంలో ఉన్నపుడు ఆమెను అంతా పెషావరు గులాబీ అని పిలిచేవారు" చెప్పారాయన మానసి వైపే తదేకంగా చూస్తూ.

"మీరు నన్ను అనవసరంగా పొగుడు తున్నారు" అందామె ఆయన పక్కనే కూర్చుంటూ.

"మీరు, మీరు అనకు అసమాను. సోనా అని పిలు చాలు. మా అమ్మ నన్ను అలాగే పిలిచేది. చిన్నపుడు నేను స్కూలుకు వెళ్తే ఇంటికి వచ్చే సమ యానికి ఇంటి గుమ్మం దగ్గరే నిలబడి నాకోసం ఎదురు చూసేది. సందు చివర నేను కనిపించగానే 'రా! సోనా! రా! సోనా!' అంటూ మధురాతి మధురంగా, ప్రేమగా, ఆప్యాయంగా పిలిచేది."

మానసి గ్లాసులు తీసి దూరంగా ఉంచి ప్రధానిని గుండెలకు హత్తుకొంది. "ఇకనుంచి మీరు నాకూ సోనా యే! ఇప్పటినుంచీ ఈ క్షణం నుంచీ మీరు ఒక్క సెకనుకూడా ఒంటరితనంతో బాధ పడనక్కర్లేదు" అందామె ఆయన చెవిలో గుసగుసలాడుతూ.

"మరి విజయ్ మాటేమిటి? నువ్వు అతని ప్రియురాలివేమోకదా! నా గురించి నువ్వు అనవసరంగా లేనిపోని గొడవలు తెచ్చుకోకు" అన్నారాయన. "విజయ్ గురించి బెంగ పెట్టుకోకండి! అతనికి నిజంగా కావలసిన వాళ్ళంటూ ఎవరూ లేరు. పరమస్వార్థపరుడు. అతనికి ఎవరి ప్రేమ అక్కర్లేదు. కాని మీకు కావాలి" మానసి బదులు చెప్పింది.

ఆమె ఘన సంపద మధ్య ముఖం దాచుకొని ఆయన మౌనంగా ఉండి పోయారు. చంపక వృక్షం గురించి ఆమెను అడుగుదామనుకొన్నారుకాని వారి మధ్య రాజ్యమేలుతున్న నిశ్శబ్దం శుభ్రంగా కడిగిన స్ఫటికంలా అందంగా మనోహ రంగా ఉంది. అదీ ఇదీ మాట్లాడి ఆ నిశ్శ బ్దాన్ని భగ్నంచేయటం ఆయనకు ఇష్టం లేదు. ఆమె భుజాలమీదే అలాగే ఒరిగి పోయి నిద్రపోవాలనీ, మర్నాడు పొద్దున్న ఆమె ముంగురులు తనను గిలి గింతలు పెడుతూండగా మెళుకువవస్తే బావుండుననీ ఆయన అనుకున్నారు.

* * *

ముఖేష్ ప్రధానికి ఏకైక సంతానం. డిగ్రీ పూర్తిచేసి ఇంట్లో ఉన్నాడు. తండ్రికొడుకుల సంబంధాలు అంతంత మాత్రమే! ఎప్పుడైనా వాళ్ళిద్దరూ ఏకాంతంగా కలుసుకున్నా అక్కడ

నిశ్శబ్దం వేట కుక్కలా పరిగెడుతుంది.

కొడుకు తనని అంతర్గతంగా ద్వేషిస్తున్నాడని ప్రధానికి తెలుసు. ఆయన మాటని అతడు లక్ష్యపెట్టడు. తల్లి మరణానికి తండ్రి కారణం అని కుర్రాడు నిందమోపటం ఆయనకు బాధ కలిగించింది. వాళ్ళిద్దరూ ఓసారి హోరాహోరీగా మాటామాటా అనుకున్నపుడు "మా అమ్మను చంపిన కిరాతకుడివి నువ్వు" అన్నాడతను. "నువ్వు మీ అమ్మను వెనకేసుకొచ్చి మా అమ్మని అనుక్షణం వేధించావు. ఒక్కరోజున కూడా మా అమ్మని నువ్వు ప్రేమగా చూడలేదు. అందుకే ఇంక భరించలేక బట్టలకు నిప్పంటించుకొని ఆవిడ ఆత్మహత్య చేసుకుంది. దీనికంతటికీ కారణం నువ్వే"

ఆవిడ ఆత్మహత్య చేసుకోలేదనీ, ప్రమాదవశాత్తు అలా జరిగిందనీ కుర్రాడికి నచ్చచెప్పబోయారాయన. ప్రధాని భార్య నైలాన్ చీర కట్టుకొని స్టౌ దగ్గర వంట చేస్తోంటే పొరపాటున ఆ చీరకి నిప్పు అంటుకుంది. అక్కడకు గజం దూరంలో మరేదో పనిలోఉన్న వంటవాడు అది గమనించి వెంటనే లోపలికి వచ్చి మంటలార్పటంకోసం ఆమె మీద నీళ్ళు గుమ్మరించాడు. కాని అప్పటికే ఆమె ఒళ్ళంతా కాలిపోయింది. మరో అర గంటకి ఆవిడ చనిపోయింది. ఆమె శరీరం లోంచి ఎముకలు బయటకి పొడుచుకు వచ్చాయి. మాంసం అంతా నల్లగా ఉడికి పోయింది. బంధువులు ఆ స్థితిలోనే శవాన్ని చుట్టిపెట్టి కారులోనే శ్మశానానికి తీసుకు వెళ్ళారు. ఆ తరువాత ఆమె అస్తికలను గంగా నదిలో నిమజ్జనం చేశారు. "ఈ కుర్ర వెధవకి తెలియని విషయాలు ఎవరు చెప్పి ఉంటారు?" అని ప్రధాని తరచు ఆశ్చర్యపోతూంటారు.

శీతాకాలంలో పొద్దున్నపుడు పిట్టగోడ దగ్గర కూర్చుని టిఫిను చేయటమంటే ప్రధానికి చాలా ఇష్టం. ఆ పిట్టగోడ ఆయన ఇంటికీ, సదాశివరావు ఇంటికీ మధ్యగా ఉంది. ప్రధాని టిఫిను తిన టానికి అక్కడికి వచ్చేటప్పటికి ముఖేష్ అక్కడ కూర్చుని ఆదివారం పేపర్లో జోక్సు, కార్టూన్లు చూస్తున్నాడు. అతనికి ఇరవై రెండేళ్ళు.

ఓ గంటక్రితం ముఖేష్ ఇంకా నిద్ర పోతూనే ఉన్నాడు. సరిగ్గా అప్పుడే ప్రధానికి అత్యంత ఆప్తుడైన సక్సేనా వచ్చి ఆయనని కలిసి కళ్ళమ్మట నీళ్ళుపెట్టుకున్నాడు. ముఖేష్ కారణంగా సక్సేనా కుటుంబం పదిమందిలోనూ నవ్వుల పాలయ్యేందుకు సిద్ధంగా ఉంది. ఆయన కూతురు రోహిణి ముఖేష్‌తో తరుచు సినిమాలకూ, షికార్లకూ విచ్చలవిడిగా తిరిగేది. ఇప్పుడామె గర్భవతి. పెళ్ళి కాకపోయినా ఆమె అతనికి కాబోయే భార్యే కదా అని ఇంట్లో వాళ్లు చూసీ చూడనట్టు ఊరుకున్నారు. ఇంకో నెలలో ఆమెకూ అతనికీ పెళ్ళి జరుగుతుంది. కాని ఇప్పుడామెకు మూడో నెల నడుస్తోంది.

సక్సేనా ఇంచుమించు ప్రధాని కాళ్ళ మీద పడినంత పనిచేసి "నా కుటుంబ గౌరవాన్ని కాపాడండి! లేకపోతే నేను నలుగురిలోనూ తలెత్తుకొని తిరగలేను" అంటూ ప్రాధేయపడ్డాడు.

"సక్సేనా! ఛా! ఏమిటలా బెంబేలు పడిపోతావు? పెళ్ళికి నేను అన్ని ఏర్పాట్లు చేస్తాగా! కానీ ఈ పెళ్ళి

ఏ అట్టహాసమూ లేకుండా క్లుప్తంగా జరిగిపోవాలి. చక్కగా రిజిస్టరు మేరేజ్ చేద్దాం. దేశమంతా ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న ఈ సమయంలో నా కొడుకు ఆడంబరంగా పెళ్ళి చేసుకోవటం చూసేవారికి ఏ మాత్రం బావుండదు. అంతా నన్ను ఆడిపోసుకునే అవకాశం ఉంది" అంటూ ఓదార్చాడాయన.

"ముఖేష్! నేనిప్పుడు నీకు ఓ ముఖ్యమైన సంగతి చెప్పాలనుకుంటున్నాను" అన్నారు ప్రధాని కొడుకునుద్దేశించి, నేప్‌కిన్‌ను ఒళ్ళో పరుచుకొని. "ఇవాళ పొద్దున్నే సక్సేనా ఇక్కడికి వచ్చారు.



రోహిణి పరిస్థితి నీకూ తెలుసు. ఈ నెల లోనే నువ్వు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలి. పరువుగా బతుకుతున్న ఓ కుటుంబాన్ని ఫలనావారబ్బాయి రచ్చ కీడ్చాడనే చెడ్డ పేరు నాకు రావటానికి వీల్లేదు."

"ఏమిటి మీరనేది? మీ ఇష్టం వచ్చి నట్టు మాట్లాడకండి! దానికి కడుపు రావటానికి కారణం నేను కాదు. అది నాలాంటి వాళ్ళని ఎంత మందినో చూసింది. అయిదారుసార్లు నాతో కూడా వచ్చింది. అంతే! మరి మిగిలిన వాళ్ళ మాటేమిటి? రోహిణిలాంటి తిరుగు బోతుని పెళ్ళిచేసుకోవలసిన ఖర్మ నాకేం పట్టలేదు."

"అదిగో! మళ్లీ అబద్ధాలాడుతున్నావు. నీ బాధ్యతలను ఎలాగో ఒకలా వదిలించు కుందామని ప్రయత్నించకు. రోహిణి తన సర్వస్వమూ నీకే అర్పించిందని నీకూ తెలుసు"

"ఆ అమ్మాయి నీతో తప్ప వేరెవరి తోనూ తిరగలేదు. సక్సేనా మన కుటుం బానికి దగ్గర స్నేహితుడు. అలాంటివాడి మనసు బాధ పెట్టకు. ఇపుడా అమ్మా యిని తిరస్కరిస్తే రేప్పొద్దున మన గురించి దేశమంతా ఎలాంటి పుకార్లు చెలరేగుతాయో ఆ మాత్రం ఆలోచించ లేవూ! వచ్చే ఎన్నికలలో నేను తెరమరు గవటానికి ఈ చిన్న విషయం చాలు" కొడుకును తీవ్రంగా మందలించారు ప్రధాని.

"నీకెప్పుడూ ఓట్ల గొడవే! నా గురించీ, నా సంతోషం గురించీ ఒక్క సారన్నా నువ్వు పట్టించుకున్నావా? ఇప్పుడా కులుకులాడిని నాకు గుదిబండలా తగిలిస్తే ఇక నా జీవితం నరకమే! బయట ఎన్ని పనులు, ఎలాంటి చికాకు లతో సతమతమైనా ఇంటికి వచ్చేసరికి భర్తను లాలించి, ప్రేమించే భార్య కావాలి నాకు. ఏం! నా కోరిక గొంతెమ్మ కోరిక అంటారా?" పొడిపొడిగా అన్నాడు ముఖేష్.

"ఒక్క విషయం చెప్పు! రోహిణితో నువ్వు కలిసి మెలిసి తిరగలేదూ?"

"ఊఁ తిరిగాను" టిఫిను తింటూనే నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు ముఖేష్.

"అయితే ఈ నెలలో నువ్వా అమ్మాయిని పెళ్ళి చేసుకు తీరాల్సిందే" నిష్కర్షగా, ఆజ్ఞాపించినట్టుగా ఉన్నాయి ఆయన మాటలు.

"చచ్చినా దాన్ని పెళ్ళి చేసుకోను"

"తండ్రినే ఎదిరించేంత మొనగాడి వయ్యావా?" కోపంతో ఊగిపోయింది తండ్రి మనసు.

"ఈ విషయంలో నా మాటకు తిరుగు లేదు"

"అయితే నిన్ను ఇంట్లోంచి బయటకు గెంటవలసి వస్తుంది. నువ్వు నా కొడు కువి కాదనుకుంటాను"

"సరే! అలాగే కానీ! సంతోషంగా వెళ్ళిపోతాను"

"ముఖేష్! నా మాట విను. ఈ ఒక్క సారీ నా పరువు కాపాడు! రోహిణిని పెళ్ళి చేసుకో. ఆమె చాలా అందంగా ఉంటుంది. పైగా మనకు చిన్నప్పటినుంచీ ఆ కుటుంబం తెలిసున్నదే! స్వాతంత్ర్య యోధునిగా ఉత్తర ప్రదేశ్‌లో సక్సేనాకు మంచి పేరూ, పలుకుబడీ ఉన్నాయి. నాకు తెలుసున్నంతవరకూ ఆ అమ్మాయి చాలా తెలివైనది. కలుపుగోలుగా ఉంటుంది. నీకు తగిన జంట రోహిణి"

"నాన్నా! పోనీ రోహిణిని మీరే ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు?"

"ఇష్టం వచ్చినట్టు వాగకు" అసహ్యంతో మండిపడ్డారాయన.

"నీ గురించి ఎక్కడెక్కడ ఎంతెంత మంది ఎలా చెవులు కొరుక్కుంటూన్నారో నీకు తెలియదేమో! అలాంటి గాలి వార్తలకు ఫుల్‌స్టాప్ పెట్టాలంటే నువ్వు పెళ్ళి చేసుకోవటం ఒకటే మార్గం. ఢిల్లీలో ఉంటున్న ప్రతి ఒక్కడికీ నువ్వు సమాచార పౌరసంబంధాల శాఖ మంత్రిణితో ఏదో వ్యవహారం నడుపుతున్నావని తెలుసు"

"నువ్వు చాలా అవివేకంగా మాట్లాడుతున్నావ్"

"కావచ్చు! కాని అవినీతి పరుడిని కాదు"

"తక్షణం నువ్వు నా ఇంట్లోంచి ఫో! నీ ముఖం నాకు చూపించకు" కుర్చీలోంచి లేస్తూ అరిచారాయన.

"ఓయస్! ఇప్పుడే పోతాను" టిఫిను దగ్గర నుంచి లేచిపోయాడతను.

ప్రధాని చాలా ఆందోళనగా ఉన్నారు. ఆయన ఏమీ తినలేకపోయారు "వీటన్నిటినీ ఇక్కడినుంచి తీసెయ్యండి" నౌకర్లను కేకేశారు టిఫిను ప్లేట్లను చూపిస్తూ.

అయిదారు నిమిషాల తరువాత ముఖేష్ సూట్‌కేసుతో గేటులోంచి బయటకు వెళ్ళటం చూశాడాయన. "ముఖేష్ ఎక్కడికి వెళ్ళిపోతున్నావ్" పైనుంచే గట్టిగా అడిగారు ప్రధాని.

"సదాశివరావు మామయ్య గారింటికి వెళ్తాను. ఉండటానికి ఇంతచోటు, చేసేందుకు ఓ ఉద్యోగం దొరికేవరకూ అక్కడే ఆయనతో కలిసి వుంటాను" మామూలుగానే చెప్పాడతను. పండిపోతున్న జుట్టును అసహ్యంగా పీక్కుని, "అబ్బా" అని మూలిగారాయన బాధగా. ముఖేష్ చప్పుడు చేయకుండా గేటు మూసేసి నవ్వుతూ వెళ్ళిపోయాడు.



## 8

ముఖేష్ సదాశివరావు ఇంట్లో అడుగు పెట్టిన సమయానికి ఆ వృద్ధ రాజకీయ నేత భక్తి పారవశ్యంతో మౌనంగా ప్రార్థన చేస్తూ దేవతా విగ్రహాల ముందు కూర్చుని ఉన్నాడు. కంచుతో తయారయిన ఆ విగ్రహాలు తళతళ మెరుస్తున్నాయి. పక్కనే దీపారాధన చేసిన ఇత్తడి కుంది ఉంది. దీపం వెలుగులో దుర్గాదేవి విగ్రహం దయావర్షాన్ని కురిపించేస్తోంది.

ముఖేష్‌ని లోపలికి తీసుకు వచ్చిన నౌకరు అతన్ని కూర్చోమని చెప్పాడు కాని సదాశివరావు వెనకే నిలబడి విగ్రహాల దగ్గర వెలిగించిన అగరువత్తుల ధూపం విరజిమ్ముతున్న సువాసననూ, పూజకోసం తెచ్చిన పూవుల పరిమళాన్నీ ఆఘ్రాణించసాగాడు.

మరః కాస్సేపటికి కళ్ళు తెరిచి వెనక్కు తిరిగి ముఖేష్‌ని గమనించి "ఏం బాబూ! ఈ ముసలాడిని చూడటానికి ఇంత పెంద్రాళే వచ్చావేం?" అని అడిగారు సదాశివరావు నవ్వుతూ. ముఖేష్ కూడా అంతకంటే మధురంగా నవ్వి

"మావయ్యా! నువ్వు ఇంత గొప్పభక్తి కి తత్పరుడివనుకోలేదు" అన్నాడు విగ్రహాలను చూపిస్తూ.

"ఇదికూడా రాజకీయమే! నా పదవిని, స్థితిగతుల్ని భద్రంగా కాపాడవలసిందిగా నాకంటే గొప్పవాళ్ళని కోరుకోవటంలో తప్పేమిటి? నేను కాటికి కాళ్ళు చాచుకొని ఉన్న వాడిని. నేడో రేపో పై లోకాలకు పోవలసిన వాడినే. అక్కడి పరిపాలన వీళ్ళదే కదా! వీళ్ళని మంచి చేసుకోవాలంటే నైవేద్యాలూ సమర్పించాల్సి, పూజలూ చెయ్యాలి మరి! పదవి, పలుకుబడి లేకపోతే స్వర్గంలోకూడా నేను క్షణం ఉండలేను" అన్నాడా ముసలి నాయకుడు.

"ఆగు! ఆగు! ఇప్పట్లో నీకేం ఫరవా లేదు. నువ్వు నాకంటే ఆరోగ్యంగా ఉన్నావు! కావాలంటే పందెం కడతాను. నువ్వు నూరేళ్ళు బతుకుతావని" వేళాకోళంగా అన్నాడు ముఖేష్.

"నేనంటే గిట్టనివాళ్ళమాట ఆలోచించవేం? నన్నెలాగో అలా కాలరాసెయ్యాలని చూస్తున్నారు వాళ్ళు. ఆఖరికి నీ ప్రియాతి ప్రియమైన తండ్రికూడా మనసులో నేను చావాలనే కోరుకుంటున్నాడు"

ఆ తరువాత సదాశివరావు దేవతార్చన ముగించి వణుకుతూ లేచి నిలబడ్డాడు. ముఖేష్‌ని కూడా తీసుకువెళ్ళి టిఫిను దగ్గర కూచ్చుని "ఇంతకీ నువ్వు టిఫిను చేశావా?" అని అడిగాడు. "ఆఁ అయ్యిందిలే! టిఫిను తింటూంటేనే నాన్నకూ నాకూ పెద్ద దెబ్బలాట జరిగింది. ఆయనకి కోపం వచ్చి నన్ను ఇంట్లోంచి బయటకు పొమ్మన్నారు. అందుకే సూట్‌కేస్ తీసుకుని నీ దగ్గరికి వచ్చేశాను"

"అయ్యయ్యో! ఎంత పనిచేశావ్! నువ్వు చేసింది చాలా తప్పు. అదేదో ఆయనతోనే సర్దుబాటు చేసుకోవాలి గానీ ఇలా వచ్చేస్తే ఏం బావుంటుంది చెప్పు? బుద్ధిగా ఇంటికి వెళ్ళి నాన్నకి సారీచెప్పు" పెద్దమనిషి తరహాలో మాట్లాడాడు సదాశివరావు. "ఇది మరీబావుంది. తప్పుచేసింది ఆయనైతే నేను క్షమాపణ చెప్పుకోవాలా? అన్నీ అణగారిపోయిన ఆ రోహిణిని నాకు కట్టబెడదామని చూస్తున్నాడాయన. దానికి సాయం ఆ దరిద్రపు వెధవ సక్సేనా గాడొకడు! ఛఛ! నాకు దాన్ని చూస్తేనే అసహ్యం! అదో పెద్ద కామపిశాచి! నా స్నేహితులందరూ దాన్నో చూపు చూశారు. ఇప్పుడు దానికి కడుపొచ్చింది. దానికి కారణం నేనని చెప్పిందట వాళ్ళ నాన్నతో! అది శుద్ధ అబద్ధం. ఆ బజారు ముండని నేను చచ్చినా పెళ్ళిచేసుకోను"

"కాని నీ ఉద్దేశాన్ని నాన్నగారికే వివరంగా చెప్పి ఉండాల్సింది. ఆయనే ఏదో మార్గం ఆలోచిస్తారు" అన్నాడు సదాశివరావు చిటికెడు నశ్యాన్ని ముక్కుల్లోకి దట్టిస్తూ.

"అది నువ్వు చెప్పినంత తేలికకాదు మావయ్యా! ఇందాక మాటల మధ్యలో మానసి మిత్రాతో ఆయన సాగిస్తున్న వ్యవహారం గురించి నేనూ చెప్పాను. నేను ఎక్కడికి వెళ్ళినా అదే గొడవ. నాన్న పేరు చెప్పి నేనెక్కడా ముఖం ఎత్తుకు తిరగలేక పోతున్నాను. ఆయనకి అంతగా ఆడతోడు ఉండితీరాలి అనుకుంటే రెండో పెళ్ళి చేసుకోవటానికి అడ్డేం ఉంది? అంత పెద్ద పదవిలో ఉండి ఇంకొకడి పెళ్ళాంతో సరిపెట్టుకోవలసిన ఖర్మమేమిటి ఆయనకు? వద్దనేందుకు కూడా ఆయనకెవరూ లేరే? ఆయన చేస్తున్నది మాత్రం వంచన

కాదూ? నేను తలుచుకుంటే ఆయన భవిష్యత్తును సర్వనాశనం చేయగలను. ఆయన వెలగబెట్టిన ఘనకార్యాలన్నీ నాకు తెలుసు. ఆయన ఎంత నీతిమంతుడో నాకు తెలుసు. కొంతమంది పెద్దమనుషులు కోటీశ్వరులు ఆయనకు పంపిన ఉత్తరాల నకళ్ళు నా దగ్గర ఉన్నాయి. అప్రాచ్యపు వెధవలందరితోనూ చేరి చేయకూడని పనులు చేయటం, ప్రజలకు మాత్రం నీతులు బోధించటం! ఎవరికి తెలియని భాగోతం? ఇవన్నీ చూడలేక, చూసి ఊరుకోలేక నాకు చస్తే బావుణ్ణనిపిస్తోంది!"

"తండ్రి మీదే కత్తి కట్టటం ఏ కొడుక్కైనా భావ్యమంటావా?" సదాశివరావు అడిగాడు "ఆయన నాకు తండ్రిలా ఎప్పుడు ప్రవర్తించాడు? నన్నెప్పుడూ కొడుకులా చూడలేదాయన. కనీసం మా అమ్మనైనా ప్రేమగా చూడలేదు. అప్పట్లో మా తాతయ్య మంత్రిగా ఉండేవాడు. అధికారంలో ఉన్నాడుకనుక ఆయన కూతుర్ని పెళ్ళి చేసుకున్నాడీయన. అంతే! ఆమెను ఎప్పుడూ నీచంగానే చూసేవాడు. నౌకర్లముందు, బంధువులముందు విచక్షణారహితంగా పల్లెటూరిదైతు అనీ, నాగరికత తెలియదనీ అవహేళన చేసి అవమానించేవాడు! నిజమే! ఆవిడ గడగడా ఇంగ్లీషు మాట్లాడలేకపోవచ్చు; ఫోర్కులతోనూ, చెంచాలతోనూ భోజనం చేయలేకపోవచ్చు. కాని మా అమ్మ పరమసాధ్వి. దేవతకంటె ఎక్కువ. నీకు జ్ఞాపకం లేదూ? మా అమ్మ ఎంత బావుండేది?"

"నిజమే! మీ అమ్మ దేవతే! చాలా మంచిదే! అలాంటి సౌజన్యవతికి అన్నివిధాలా ఆదరించే భర్త లభించి తీరాలి. కాని గతాన్ని తవ్వకోటం ఎందుకు? అందువల్ల కలిసి వచ్చేదేముంది? పోనీ ఆవిడను మనం బతికించగలమా? ముఖేష్! నువ్వు కూడా నా మాదిరిగానే విధిని నమ్ముకో. దుడుకుతనంగా ఉండాలని ప్రయత్నించకు. దేవుణ్ణి నమ్ముకున్నవాడు ఎలాంటి ఎదురు దెబ్బలనైనా సునాయాసంగా తట్టుకోగలుగుతాడు"

కొంతసేపు ఇద్దరూ మౌనంగానే ఉండిపోయారు. నౌకరు ట్రేలో ఇద్దరికీ కాఫీ తెచ్చాడు. పైకప్పు బాగా ఎత్తుగా ఉండటంవల్ల గది చాలా విశాలంగా ఉన్నట్టుంది. గోడ మీద గిల్టు ఫ్రేముల్లో కొన్ని పెయింటింగ్స్ వేలాడుతున్నాయి. సదాశివరావు కళాత్మకంగా ఉండాలని పాకులాడేవాడు కాదు. ఖరీదైన సోఫా చేతుల మీద కూడా ఏదో మామూలు రబ్బరు గుడ్డలాంటిది తొడిగించాడు అతిథులు కూర్చున్నప్పుడు చెమటకో, మరో కారణంగానో అవి పాడయిపోకుండా.

గదిలో ఉన్న ప్రతీ టేబిలు మీద చనిపోయిన దేశనాయకుల పాలరాతి బొమ్మలు ఛాతీ వరకూ ఉన్నాయి. గది ద్వారాలకు ఉన్న తెరలు ఖద్దరువే. పొద్దున్నపుడు గదిలో ఎండపడే చోట ఓ మూలగా పాత కాలపు చరకా ఉంది.

"మావయ్యా! నువ్వు ఉపన్యాసాలు ఇచ్చేటపుడు మన మనసులు నిర్మలంగా ఉండాలి, కుహనాత్మకంగా ప్రవర్తించకూడదని చెబుతుంటావు కదా! మరి ఈ ఈ చరకాని పదిమంది దృష్టిలో పడేట్టుగా ఎందుకు ఉంచావిక్కడ? నువ్వు నిజమైన గాంధేయ వాదివనీ, గాంధిగారు బతికున్న రోజుల్లో నువ్వు కూడా నూలు వడికేవాడివనీ మీ ఇంటికి వచ్చిన వారు అనుకోవా

లనా ? అయినా, బూజు పట్టేసి ఉన్న ఈ రాట్నం మీద ఈ రోజుల్లో దారం ఒడుకుతావని ఎవరనుకుంటార్లే !"

"చూడు ముఖేష్ ! నువ్వు చెప్పింది నిజమే ! ఇప్పుడు ఈ చరకాని అలంకరణ వస్తువుగానే చూస్తున్నాను. నేను కుబుద్ధినే. గాంధీగారు బతికున్న రోజుల్లో ఎప్పుడూ ఆయనతో కూడా వెంట ఉండేవాణ్ణి. కాని కిందటి సంవత్సరం అక్టోబరు రెండున సెలవు అని మా సెక్రటరీచెబితే ఎందుకు ? అని అడిగాను. అదంతే మరి. చచ్చిపోయిన వాళ్ళని త్వరత్వరగానే మరిచిపోతాం. ఎంత మహాత్ములైనా జరిగేదదే ! జీవితంలో మనం నిలదొక్కుకోవాలంటే కొన్ని అక్కర్లేని విషయాలు మరిచిపోవాలి. అవసరమైనవే జ్ఞాపకం ఉంచుకోవాలి. ఏది మరిచిపోయినా మీ నాన్నగారి పుట్టినరోజు నాకు జ్ఞాపకం ఉంటుందిప్పుడు" సదాశివరావు ఏదో జోకు వేసినట్టు నవ్వుతూ అన్నాడు.

"జీవితం నాకు కొన్ని పాఠాలు నేర్పింది. సిసలైన బంగారానికి మెరుపూ ఉండదు. మృదుత్వమూ ఉండదు. దానికి రాగి కలిపాం అనుకో. ఎలాంటి నగలైనా చెయించుకోవచ్చు ఆ బంగారంతో.అప్పుడే దానికి ఓ విలువ ఏర్పడుతుంది ! మిరుమిట్లు గొలిపేలా మెరిసిపోతుంది. నిజం అనేది కూడా సిసలైన బంగారంలాంటిదే. దానికి ఆకర్షణ, శక్తి సామర్థ్యాలు ఉండవు.

అందుకే రాగిలాంటి లోహాలు అవసరం. మేలిమి బంగారంలాంటి నిజానికి ఎంత పరిమాణంలో రాగిలాంటి లోహం కలిపితే కాసు గీటు బంగారంలా నిజానికి ఓ వ్యక్తిత్వం ఏర్పడుతుందో ముందుతెలుసుకోవాలి. రాజకీయాల్లో ఎంత కలపాలి,సమాజంలో ఎంతకలపాలి, సాహిత్యంలో ఎంత కలపాలి. వ్యాపారంలో ఎంత కలపాలి... ? ఇది అవగాహన చేసుకోవాలి. నే చెప్పింది అర్థం అయిందనుకుంటాను !"

"అర్థం అయింది కాని నువ్వీ మధ్య బాగా మారిపోయావు ! నిజానికి బానిసవైపోయావు. అది నిన్నెప్పుడో ముంచేస్తుంది. పీకల మీదకు వచ్చినా ఆశ్చర్యపడక్కరలేదు" ఏదో శంకించినట్లు మాట్లాడాడతను.

"అవును నాకు తెలుసు. కాని నేనెందుకు బతికి ఉన్నట్లు ? రాను రాను ఈ దేశం మునిసిపల్ వేన్‌లో శవంలా కుళ్ళిపోతోంటే చూస్తూ ఊరుకోవటానికా ? నా చావుతో దేశంలోని అన్ని అరాచకాలు అణగారిపోతాయని ఎవరయినా అంటే నేను సంతోషంగా చచ్చిపోతాను"

"అయితే నువ్వు ప్రమాదంతో ఆటలాడుకుంటున్నావన్నమాట"

"రాజకీయాల్లో ఇప్పటివరకూ ఆడుకున్న మహామహులంతా దీన్ని ఆటే అన్నారు. ఇకనుంచి రాజకీయాలు నాకు మాత్రం ఆట కాదనిపిస్తోంది. నాకు వయసు మీరిపోయింది ఆటలాడుకోవటానికి. నేను ఈ విషయాన్ని సీరియస్‌గానే భావిస్తాను. ఇదే దండయాత్ర కావాలి. గొప్ప ప్రచారం చెయ్యాలి. నేనే కొనసాగించాలి"

"నీ దండయాత్ర మా నాన్నని పదవిలోంచి తొలగించటం వరకేనా?"

"కాదు! కాదు! పదవి లేకపోతే మీ నాన్నని పట్టించుకొనేదెవరు? కుళ్ళిపోయిన మన వ్యవస్థలో ఆయన ఒక భాగం. కాకపోతే అగ్రస్థానం మాత్రం ఆయనది. ఆ

మాలిన్యం తొలగిపోయేలా నేనుచూస్తాను. అప్పుడు దేశానికి పునర్జన్మ వస్తుంది. కొత్త విలువలు వెలుస్తాయి. నూతనత్వం అంతటా దర్శనమిస్తుంది. కొత్త ఆదర్శాలు తలెత్తుతాయి"

"కాని అవన్నీ సాధ్యమేనంటావా?"



"తప్పకుండా! నువ్వు సాయం చేస్తానంటే సాధ్యం కానిదేమీ ఉండదు" అన్నాడు సదాశివరావు కుర్రాడ్ని ప్రోత్సహిస్తున్నట్టుగా.

* * *

సదాశివరావు సి.జె. హాల్లో ఉపన్యసించటానికి వెళ్ళాడు. ఉపన్యాసం వినటానికి వచ్చిన జనంలో సగం మందికి పైగా యువతరమే ఉంది. ఆ నెలలో అతను అక్కడ ప్రసంగించటం అది మూడవసారి. 'బహుశా వీళ్ళంతా పక్కనే ఉన్న కాలేజీ విద్యార్థులైఉంటారు' అనుకున్నాడాయన. కాగితం జండాలు అలంకృతమై ఉన్న ఆ హాలులో తన ఉపన్యాసం గురించి ఎదురుచూస్తున్న ప్రజానీకాన్ని ఓ సారి గమనించాడు. అంతలో అతని కడుపులో ఏదో మెలి తిరిగినట్లయి కొంచెం బాధగా ఉన్నట్టు అనిపించింది.

భవిష్యత్తులో దేశాన్ని ఎవరు పాలించాలి అనే విషయం మీద ఆయనఅక్కడ మాట్లాడవలసి ఉంది. వినటానికి వచ్చిన వారు రాజకీయంగాపొరపాటు దొర్లితే పీక పట్టుకోగల సత్తా ఉన్న యువకులు.

ఒకప్పుడు ఆయనకు ఎంత డబ్బు కావాలన్నా వచ్చి కాళ్ళదగ్గిర పడేది. కాని ఇప్పుడు ప్రధానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తుండటంతో సదాశివరావు తమ వైపు ఉంటే ఎందుకైనా మంచిదనే దూరదృష్టితో ఏదో నామమాత్రంగా చిన్న చిన్న మొత్తాలు ముడుతున్నాయతనికి. రాజకీయాలంటేనే అంత. ఎంత ఎతుకు ఎదిగినా మరొకడు ఆ స్థాయిని చేరటానికి మొదటివాడు తగ్గవలసిందే! సదాశివరావు చుట్టూ అతని రాష్ట్రానికి సంబంధించిన శాసన సభ్యులు తిరుగుతున్నంత

కాలం ఆయనను పన్నెత్తి మాట అనగల ధైర్యం ఎవరికీ ఉండదు.

కాని యువకులు అలా కాదు. రాజకీయాల్లో వాళ్ళు తల మునకలు కాలేదు. లాభనష్టాలతో వారికి పనిలేదు. ఎన్నో జతల కళ్ళు అతనిని మామూలుగా కల్లా కపటం లేకుండా చూస్తున్నాయి. "ఇన్ని కళ్ళలో ఒక్క జత అయినా పేదల పట్ల కనికరంతో దయార్ద్రం కావా?" అని ఆలోచించసాగాడు ఆ వృద్ధ నాయకుడు. భారతదేశానికి ఏమాత్రం అదృష్టం ఉన్నా ఈ కుర్రాళ్ళలోనే ఒకడు నాయకుడుగా మారి దేశాన్ని సరైన పంథాలో నడిపిస్తాడు.

రాజకీయ నాయకుడు గొంతు సవరించుకొని కళ్ళజోడు సర్దుకొన్నాడు. తెల్ల ఖద్దరు కోటు, పాశ్చాత్యుల పద్ధతిలో పేంటు ధరించాడు. చర్మంతో తయారయిన కళ్ళజోడుపెట్టె జేబులోంచి బయటకు కనిపిస్తోంది. సంస్థ సెక్రటరీ వేదిక మీదకు వచ్చి సదాశివరావును ఆహ్వానించి "ఇలాంటి పెద్ద మనుషులను మీకు పరిచయం చేయనక్కర్లేదనుకొంటాను" అన్నాడు. గులాబీల దండ వేశారు సదాశివరావుకి. ఆయన ఆదండను సున్నితంగా మెడలోంచి తీసి తన కుర్చీపై ఉంచాడు. ఆ తరువాత ఆయన ఉపన్యసించటం ప్రారంభించాడు. అప్పటివరకూ తమలో తామే గట్టిగా ఏదో చర్చించుకొంటున్న సభికులంతా నిశ్శబ్దంగా వినసాగారు.

"యువ మిత్రులారా! సత్యంవద అనే సూత్రాన్ని నమ్మినవాడిని నేను. నా ప్రజలకు కొన్ని నిజాలు వెల్లడించాలనుకుంటున్నాను. నిజం చెప్పటంలో పెద్ద కష్టమేముంది అని మీరు నన్ను అడగవచ్చు! నిజంలో మరే డొంకతిరుగుళ్ళూ ఉండకూడదు. సత్యమార్గం స్పష్టంగానే కనిపిస్తూ ఉంటుంది. చిన్నపిల్లాడు కూడా తడబడకుండా ఆ దోవలో వెళ్ళగలడు. నిజమే! కాని రాజకీయ నాయకులకు అలా కాదు. ఆ దోవ వారికి కంటకప్రాయంగా ఉంటుంది. భారతదేశపు రాజకీయాల్లో నేనూ, చచ్చి స్వర్గంలో ఉంటున్న నా ఒకనాటి సహచరులూ ఆత్మవిమర్శ చేసుకునే ధైర్యం ఉన్న వాళ్ళం. తరువాత తీర్చగలమా లేదా అనే దృష్టి లేకుండా మీకు ఇదివరకు అనేక వాగ్దానాలు గుప్పించేశాం. వాగ్దానాలనేవి నిజాయితీ లేని రాజకీయ నాయకులు సమయానుకూలంగా ఉపయోగించుకొనే ఆయుధాల లాంటివి. మేము చేసిన ఓ ఘోర తప్పిదం వల్ల మీ ఎదుట నిలబడటానికి ఇప్పుడు నాకు మొహం చెల్లటం లేదు. మేము ఇంతవరకు మాకు ఓట్లు వేసి మమ్మల్ని పైకి తీసుకువచ్చిన ప్రజల భవిష్యత్తు గురించి కించితు కూడా పాటుపడలేదు. ఇప్పటివరకూ మా పార్టీ పటిష్టంగా ఉంటే చాలనుకున్నాం.

మా లక్ష్యం నెరవేరటం కోసం మాలో మేం కూడబలుక్కొన్నాం. ఏడేళ్ళ క్రితం మన ప్రియతమ ప్రధాని కీర్తిశేషులైనపుడు మాకు అన్ని విధాలా నమ్మకస్థుడులా ఉన్న వ్యక్తిని ఆ పదవికి ఎన్నుకోవాలనుకున్నాం. అప్పట్లో మా పదవులకు ముప్పులేని అసమర్థుడు మాకు నాయకుడుగా ఉంటే చాలని మా ఉద్దేశం. మేం చెప్పినట్టు విని, మాకు విశ్వాస పాత్రంగా ఉండేందుకు సిద్ధపడే కొత్త మనిషి కోసం గాలించాం. అతన్ని

మా చేతుల్లో కీలుబొమ్మగా ఉంచుకోవాలని చూశాం. దేశంలోనూ, విదేశాల్లోనూ మా ఉద్దేశాలూ, మా పథకాలే అతని నోటివెంట చిలకపలుకుల్లా పలికించాలనుకున్నాం.

అలాంటి వ్యక్తి ఎవరా అని మాలో మేమే చర్చించుకున్నాం. అందరమూ కలిసి సంతోషంగా, ఏకగ్రీవంగా ఒకరిని ఎన్నుకున్నాం. అప్పుడతను అమాయకంగా, ఏమీ తెలియని వాడిలా నటిస్తే ఈ మేధకుడు మనల్నేం మోసం చేస్తాడులే అని తృప్తి పడ్డాం! తనకు రాజకీయాల గురించి ఏమంత పరిజ్ఞానం లేదని అతనంటే- ఎందుకూ! మేమంతా లేమా అని అతని వీపు తట్టి ధైర్యం చెప్పాం. అసమర్థుడైన రాజుగారికే చాతుర్యం గల సలహాదారులు కావాలని అతనికి నచ్చచెప్పాం.

కాని మాకు తెలియదు అతనెంత మోసగాడో! తనకు స్వర్గంచూపించిన ఆడదాన్ని "నీకాపరం చెడగొట్టకపోతే నీరంకు మొగుణ్ణేకాదు" అని బెదిరించగలిగినంత నయవంచకుడతను గూఢచారులను నియమించి మా ప్రతి చర్యనూ ఆయన ఆరాతీశాడు. సి.ఐ.డి.లు మమ్మల్నినీడలా వెంటాడేవారు. మాకు వచ్చే టెలిఫోన్లను వక్రమార్గాల ద్వారా ఆయన విన్నాడు. మాకు ఎక్కడెక్కడినుంచో వచ్చేఉత్తరాలు ముందుగా ఆయనకే అందేవి. ఆయన చదివిన తరవాతనే అవి మాకు చేరేవి. బడా బడా పారిశ్రామికవేత్తలతోనూ, అవినీతిపరులతోనూ, స్మగ్లర్లతోనూ ఆయనకు రహస్య సంబంధాలుండేవి. ఆయన వాళ్ళదగ్గరనుంచి లెక్కలేనంత డబ్బు లంచాలు తీసుకొని,వాళ్ళు ఎలాంటి తుచ్ఛపు పనులు చేసినా ఏ విధమైన ఇబ్బందీ కలగకుండా ఆదుకొనేవాడు. రకరకాల లైసెన్సులను, పర్మిట్లనూ చిన్నపిల్లలకు బిళ్ళలు పంచి పెట్టినట్లు ఎంతోమందికి పంచి పెట్టాడు.

అయినా ఆయనను అనవలసిన పని ఏముంది? మేమే ఆయనకు అన్నీ నేర్పించాం! మేము సృష్టించిన మహా రాక్షసి చివరికి మాపైనే ఎదురు తిరిగింది. ఆయన్ని ఘోరంగా, కర్కశంగా విమర్శించే పత్రికా విలేఖరులనూ, రచయితలనూ తన ఇంటికి విందుకు ఆహ్వానించి, అతివినయం ఒలకబోసి అధికారం సమకూర్చి పెట్టిన తేజస్సుతో, రాజకీయాలు నేర్పిన చాకచక్యంతో వాళ్ళని ఉక్కిరిబిక్కిరి చేశాడు.

అలాంటి మేధావులను తోలుబొమ్మల్ని ఆడించినట్టు ఆడించాడు. వాళ్ళ సలహాలు మార్గదర్శకత్వం కావాలని కోరాడు. నోటితో పలకరిస్తూనే నొసటితో వెక్కిరిస్తున్నాడని తెలియని అంత గొప్ప మేధావులూ అతని తియ్యని మాటలకూ, వినయ విధేయతలకూ పొంగిపోయారు. అప్పటి వరకూ తామేదో తప్పు చేసినట్టు బాధపడిపోయారు. ఆ బాధను దిగమింగుకోవటానికి విదేశీ మద్యాలు, స్వదేశీ ఫలహారాలు స్వీకరించి సర్దుకున్నారు. అతని పెదవులు మాత్రమే నవ్వే చిరునవ్వుల వెన్నెలలో వారు తడిసి ముద్దైపోయారు.

అప్పటి నుంచీ వారంతా ధారావాహికంగా, మృదు మధురమైన భాషలో ఆయన గురించి పేపర్లలో వ్యాసాలు రాయడం మొదలు పెట్టారు. ప్రజల

కష్టాలు తీర్చటానికి సాక్షాత్తూ దేవుడే ఆయన రూపంలో దిగివచ్చాడనీ, మత ప్రచారం చేసినట్లుచేసి ఆ పెద్ద మనిషికి ఓ ప్రత్యేకతను సంతరించి పెట్టారు. దాంతో ఆయన ఆకాశం అంత ఎత్తు ఎదిగి పోయాడు. కుబేరుడంత ధనవంతు డయ్యాడు. అతడంటే ఓ ఆకర్షణ ఏర్పడటంతో డబ్బూ అధికారం రెండింతలు పెరిగాయి. అవి-రెండూ, రెండూ నాలుగవటం మానేసి, ఇరవై రెండు అయి కూర్చున్నాయి.

పేదరికం అంగుళం అంగుళాన తాండవించింది; కాని దీన్ని పట్టించుకున్న నాథుడే లేకపోయాడు. ఆ పేదవాళ్ళను చూసిన ప్రతివాడూ తాము ఈ భూమ్మీద కాక మరేదో గ్రహంలో నివసించే వారిలా ప్రవర్తించారు. వాళ్ళెవరికీ కార్లోంచి కాలు కింద పెట్టవలసిన అగత్యంలేదు. అలాంటి వాళ్ళకి చస్తూ బతుకుతున్న వారి గురించేం తెలుస్తుంది ? సంక్షోభంలోనూ కష్టాలలోనూ ఇరుక్కున్న విదేశాలకు మనదేశం నుంచి ఆహారం రూపంలోనూ, డబ్బు రూపంలోనూ సహాయం అందేది. కాని మన దేశంలో వాటి అవసరం ఉన్న వారికి సహాయం చేసేదెవరు ? అంతర్జాతీయంగా మన దేశం పరువు ప్రతిష్టలు పెంచటానికి అపారంగా కృషి జరిగింది. నిజమే కాని మన దేశంలో ఉన్న కోట్లాది పేద ప్రజానీకం దృష్టిలో మన ప్రభుత్వానికి ఉన్న విలువ ఏమిటి ?

నేను చేసిన నేరాలను నేను ఒప్పుకొంటున్నాను. నా ఉపన్యాసం పూ ర్తయ్యాక కావాలనుకుంటే మీరు నన్ను మీ చేతులతోనే చంపెయ్యండి. ఇప్పుడు నేను నిజాయితీతో అసలు విషయాలు చెప్పకపోతే నేను మళ్ళీ ఋజుమార్గంలో నా దేశానికి సేవ చేసే యోగ్యత కలగదు. నేను హత్య చేయబడవచ్చు. లేదా వృద్ధాప్యం వల్ల చనిపోవచ్చు. రేపొద్దున తెల్లారగానే నేను శవాకారం దాలుస్తానేమో ఎవరికి తెలుసు? పైగా ఇవాళో రేపో నేను చచ్చిపోయినా ఏకారణంగా ఎలా చచ్చిపోయానో అని ఎవరికీ అనుమానం కూడా రాదు. అప్పుడు నేను ఫలానా రోగంవల్ల చచ్చిపోయానని డాక్టర్లు నిర్ణయించ..."

ఇంతలో హఠాత్తుగా పెద్ద శబ్దం వచ్చి ఏదో బాంబు పేలినట్లయింది. ఆ వెంటనే సన్నగా మూలుగులు వినిపించాయి. స్టేజీ కూడా చాలా వరకూ నాశనమయింది. ఎంతో మందికి గాయాలయి అక్కడే దొర్లసాగారు. ముక్కుమీంచి ఎగిరి పడిపోయిన కళ్ళజోడు ఎక్కడ ఉందో అని చుట్టూ వెతకసాగాడు సదాశివరావు. తన కనుబొమల మీదనుంచి రక్తం కారుతున్నదని ఆయన గ్రహించాడు. అతని కణతకు పెద్ద దెబ్బే తగిలినట్లుంది. ఇంకా చాలాచోట్ల చిన్నచిన్న గాయాలున్నాయి.

అతన్ని లేవతీయటానికి వచ్చిన వ్యక్తిని చేతులతో గెంటేస్తూ "నాకేం ఫరవాలేదు. మిగిలిన వాళ్ళకేం దెబ్బలు తగిలాయో చూడండి అన్నాడు సదాశివరావు. మెల్లిగా ప్రాణాలు కూడగట్టుకొని జాగ్రత్తగా లేచి స్టేజీ మీద బాగా ముందుకువచ్చి సభికులతో "ఎవరో దుండగులు చేసిన ఈ నీచపు పనికి నాకు చాలా బాధగా ఉంది. నన్ను అంతమొందించాలని బాంబు పేల్చారు కాని స్వల్ప గాయాలతో నేను తప్పించుకోగలిగాను. మీరెవరూ అనవసరంగా భయపడి పోకండి. ఇక్కడినుంచి త్వరగా బయటపడండి!

ఇలాంటి దుశ్చర్యలను నేను ఖండిస్తున్నాను" అని ప్రజలకు ధైర్యం చెప్పాడు. అతడు నిలబడి ఉన్నచోట లైటు వెలుగు బాగా పడుతోంది.

అతనికి లోలోపల ఏదో భయంగా ఉంది. శరీరం అంతా గాలి లోకి తేలిపోతున్నట్టనిపించింది. అక్కడి నుంచి అమాంతంగా కిందపడిపోతున్న అనుభూతి కలిగింది. ఓ యువకుని సాయంతో ఆయన మెల్లిగా మెట్లు దిగి వణుకుతూ నడవలేని పరిస్థితిలో కారు దగ్గరకు చేరాడు. కడుపులో మళ్ళీ నరాలు మెలి తిరుగుతున్న బాధ... డ్రైవరు సాయంతో కారులోకి ఎక్కబోతుండగా ఓ రాయి వచ్చి అతని తలకు బలంగా తగిలింది. దాంతో ఆయన రోడ్డు మీద పడిపోయాడు. ఎవరో అదృశ్యంగా ఉండి అతనిపై దౌర్జన్యం చేయిస్తున్నారని స్పష్టమైంది.

సధాశివరావు కారు డ్రైవరు రోడ్డు కడ్డంగా నిలబడి సహాయం కోసం కేకలు పెట్టసాగాడు. అతని మంచీచెడ్డా కనుక్కోవటానికి ఎవరూ కార్లు ఆపలేదు. ఆ చుట్టుపక్కల కూడా ఒక్క పోలీసు కూడా కనిపించలేదు. ఇంతలో మరో రాయి వేగంగా వచ్చి కారును తాకి పెద్ద శబ్దం చేసింది. పడిపోయిన సదాశివరావుని ఎలాగో ఒకలా పైకి లేవ తీయాలని శక్తి వంచన లేకుండా కష్టపడ్డాడు డ్రైవరు. "మనం ఇక్కడి నుంచి త్వరగా బయట పడాలిసార్! వెధవలు ! మీ రక్తం కళ్ళజూశారు ! వెంటనే ఇంటికి చేరటం అన్నివిధాలా శ్రేయస్కరం" అని అతను తొందర చేశాడు. అప్పుడే విజయ్ బెంజికారు అటు వచ్చింది. ఓ క్షణం అది అక్కడ ఆగింది. కాని సదాశివరావు డ్రైవరు విజయ్‌ని గుర్తించి సహాయం చేయవలిసిందిగా అరుస్తున్నా హడావుడిగా ఆ కారు ముందుకు పరిగెత్తింది. "ఆ కార్లో విజయ్‌గారున్నారు సార్ ! నేను అరిచి పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయారేమిటి విచిత్రంగా" అంటూ సదాశివరావుతో చెప్పి ఆ కారు డ్రైవరు ఆశ్చర్యపడ్డాడు.

సదాశివరావు తడబడుతూ మొత్తానికి కారు ఎక్కి వెనక సీట్లో నిస్త్రాణగా పడిపోయాడు. "వెంటనే బొంబాయి హాస్పిటల్‌కి పోనీ" అని డ్రైవరుతో చెప్పాడు లోగొంతుకతో.

డ్రైవరు భయంతో వణికిపోయాడు. కారు అక్కడినుంచి కదలటానికి మొరాయించింది. కారులో ఏదో లోపం ఉంది. కారు ఎందుకు కదలటంలేదో చూద్దామని కిందకు దిగిన డ్రైవరుకు మతిపోయింది. నాలుగు చక్రాల టైర్లలోనూ గాలిపోయి నీరసంగా పడి ఉన్నాయి. "ఓరి భగవంతుడా ! ఎంత మోసం జరిగింది ?" అని బిగ్గరగా ఏడుపులాంటి స్వరంతో అరిచాడు ఆ డ్రైవరు.

"నన్నేమైనా సహాయం చేయమంటారా ?" అని కారులోకి తొంగి చూస్తూ ఓ కుర్రాడు అడిగాడు. అతని ముఖం మీద మొటిమలున్నాయి. "సదాశివరావుగారు బాంబు తాకిడికి గాయపడటం చూశాను. ఆసుపత్రికి తీసుకు పోదామనడు" అంటూ డ్రైవరును తొందరపెట్టాడా కుర్రాడు.

"మీరెవరు ?" కుర్రాడిని అడిగాడు డ్రైవరు. "నా పేరు సైరస్ కంట్రాక్టర్. బొంబాయి ఆసుపత్రికి మా నాన్నగారు ట్రస్టీ. నేను కూడా మీతో ఆసుపత్రికి

వస్తాను. నాకు సదాశివరావుగారంటే చాలా అభిమానం, గౌరవం!" జవాబు చెప్పాడు క్రూరాడు.

"కాని ట్రైన్లలో గాలిలేదే! ఆ పక్కగా ఉన్న కిళ్లీకొట్లో సిగరెట్టు కొనుక్కోవటానికి వెళ్ళినపుడు ఎవరో ఈ వెధవ పని చేసుంటారు! ఇప్పుడు నేనేం చేయగలను?" బాధ పడ్డాడు డ్రైవరు.

"నేను టాక్సీని పిలుస్తాను" అని చెప్పి అటుగా పోతున్న టాక్సీని ఆపి "ఇది ఎమర్జన్సీ కేసు! త్వరగా ఆసుపత్రికి పోవాలి" అని టాక్సీ డ్రైవరుతో చెప్పాడు. టాక్సీ మెల్లిగా సదాశివరావు కారు పక్కగా వచ్చి ఆగింది. సదాశివరావు బాధతో కళ్ళు మూసుకొనే మూలుగుతున్నాడు. డ్రైవరు సాయంతో సదాశివరావును పైకి లేవదీసి టాక్సీలో కూర్చోబెట్టాడు సైరస్. తరవాత ఆయన తలను తన ఒడిలో పెట్టుకొని కూర్చున్నాడు. మరికొంతసేపటికి అతని నీలం రంగు పేంటు రక్తంతో తడిసిపోయింది.

ఆసుపత్రిలో ఎంక్వైరీ కౌంటర్‌లో ఉన్న వ్యక్తి సదాశివరావును గుర్తించాడు. సైరస్ వెంటనే ఎవరికో ఇద్దరికి ఫోను చేశాడు. ఆ వెంటనే "రండి మనం కేజువాలిటీ వార్డులోకి వెళ్తాం! నేను ఇప్పుడు మా నాన్నగారి స్నేహితుడికి ఫోన్ చేశాను. ఆయన త్వరలోనే వచ్చేస్తారు" అని చెప్పి సదాశివరావుని లోపలికి తీసుకువెళ్ళాడు.

గాయాలకు కట్టుకట్టటం అయ్యాక పదకొండవ అంతస్థులో ఉన్న ఓ పెద్ద గదిలోకి స్ట్రెచర్ మీద తీసుకు వెళ్ళారు సదాశివరావుని. ఆ గదికి ఎయిర్ కండిషన్ సౌకర్యం వుంది. అప్పటికి పత్రికా విలేకరులు ఆసుపత్రి చుట్టూ మూగేశారు. బహుశా మర్నాటి వార్తాపత్రికలలో "బాంబు పేలుడులో సదాశివరావుకి గాయాలు" అనేది బేనర్ చేస్తారేమో! ఒకవేళ ఆయన చనిపోతే ఎంత ఆసక్తికరంగా వ్యాసాలు రాస్తారో! గాయాలు తగిలి కట్టు కట్టించుకున్న సదాశివరావుని ఒక్క ఫొటో తీసుకుంటామని మహాపట్టు బట్టారు. వాళ్ళని ఓ నిమిషంపాటు సదాశివరావు దగ్గరకు వెళ్ళనిస్తే...!

"లాభం లేదండీ! అది కుదిరే పని కాదు. అదీ కాక ఆయన ఇప్పుడు ఆసుపత్రి దుస్తుల్లో ఉన్నారు. ఆయనకి మత్తుమందిచ్చారు. అప్పుడే నిద్రపోతున్నారు కూడా. రేపొద్దుటి వరకూ ఆయనకు నిద్రా భంగం కలిగించకూడదని డాక్టర్లు చెప్పారు" అన్నాడు సైరస్ సౌమ్యంగా.

"మీరెవరు? బాంబు పేలినపుడు ఆయనకు గాయాలవటం మీరు చూశారా? మీ పేరేమిటి? మీరు ఏ రాజకీయ పార్టీకి చెందిన వారు? మీరు ఆర్.యస్.యస్. మనుషులా?" విలేకరులు ప్రశ్నల వర్షం కురిపించారు.

"నా పేరు సైరస్ కంట్రాక్టర్. ఈ సంఘటన జరిగినపుడు ఆ సభలోనే కూర్చుని వున్నాను. నాకూ, ఆయనకూ ఏ బంధుత్వమూ లేదు. కానీ ఆయన మేనల్లుడికి నేను ఫోన్ చేసి ఈ విషయం చెప్పాను" సమాధానం చెప్పాడు సైరస్.

"ఆయన భార్యకే ఫోన్ చేసి చెప్పవచ్చుగా" ఓ విలేకరి కూపీ లాగాడు.

"సదాశివరావు గారికి పెళ్ళి కాలేదు"

వివరంగా చెప్పాడతను.

పత్రికా విలేకరులంతా పగలబడి నవ్వారు. దాంతో సైరస్ ముఖం సిగ్గుతో ఎర్రబడి పోయింది.




ఇనుము, ఉక్కు శాఖ మంత్రి విజయ్ రాజ్. ఆ కాలేజీ హాస్టలుకు వెళ్ళేసరికి చీకటిపడి గంట దాటింది. ఆ కాలేజీ హాస్టల్‌లోనే మానసి కూతురు సుపర్ణ వుంటోంది.

ఆడపిల్లలంతా ఓ పెద్ద హాలులో కూర్చుని మర్నాటి పరీక్షకు హడావుడిగా చదువుకుంటున్నారు. ప్రభుత్వాధికారులు ఉపయోగించే కారును, అందులో వున్న ఖరీదయిన మనుషుల్ని చూడగానే హాస్టల్ వార్డెన్ కంగారు పడిపోయి సుపర్ణను పిల్చుకు రావటానికి ఆవిడే స్వయంగా వెళ్ళింది.

విజయ్ ఓ పేము కుర్చీలో జార్లబడి కూర్చుని అక్కడ కుర్చీలకూ, బెంచీలకు వేసిన వార్నీషు వాసననీ, రకరకాల పూవుల వాసననీ శ్వాసించసాగాడు. తాను కూర్చున్న కుర్చీ చాలా ఇరుకుగా వున్నట్టనిపించిందతనికి. బిగుతుగా వున్న ఖద్దరు దుస్తులు అతన్ని మరీ ఇబ్బంది పెట్టాయి. జేబులోంచి వెండి సిగరెట్ కేసు తీశాడు. కాని అక్కడ సిగరెట్టు కాల్చటానికి అభ్యంతరాలుంటాయేమోనని ఆగిపోయాడు.

అక్కడ అంతా స్త్రీత్వమే అతనికి గోచరించింది. ప్రతీ ముక్కాలి పీట మీద లేసుతో అల్లిన గలేబులున్నాయి. వాటి అంచులకు రంగు రంగుల ఎంబ్రాయిడరీ కుట్టారు. పాల నురుగులాంటి తెల్లని వస్త్రం మీద అడ్డంగా "ప్రేమే దైవం" అని రాసి వుంది.

"ఇదిగో సుపర్ణ వచ్చింది" అంది హాస్టల్ వార్డెన్. మరుక్షణంలో మెరుపు తీగలా ఓ అందమయిన అమ్మాయి సిగ్గు ఒలకబోస్తూ గుమ్మంలో ప్రత్యక్షమైంది. అతని చేతిలో వున్న పాకెట్ సన్నగా వణికింది. మానసి కూతురు ఇంత అప్సరసలా వుంటుందని విజయ్ ఊహించలేదు. 'ఈ అమ్మాయిది కళ్ళు చెదిరే అందం' అనుకొని కంగారు కంగారుగా ఆమె మీద నుంచి దృష్టి మరల్చుకొన్నాడతను.

"నా పేరు విజయ్ రాజే. మీ అమ్మగారు బహుశా నీకు వుత్తరం రాసే వుంటారు నేను లక్నో వస్తున్నానని! మీ అమ్మ నీకో బహుమతి పంపారు. అది నీ పుట్టిన రోజు కానుక అట" అన్నాడు అతను.

"మీరు కూర్చోండి! నేను ఒక్క క్షణంలో మీకు టీ తీసుకు వస్తాను" అంది వార్డెన్.

"ఓ యస్! తప్పకుండా. కాని మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నానేమో అనిపిస్తోంది" అన్నాడు విజయ్.

"అహహ! అలాంటిదేం లేదు! ఇప్పుడే వచ్చేస్తాను" అంటూ వార్డెన్ అక్కడినుంచి అదృశ్యమైపోయింది.

ఆ అమ్మాయి యింకా అలాగే,

అక్కడే నిలబడి ఆ కొత్త వ్యక్తివైపు తేరిపార చూస్తోంది. "ఏమిటి అలా నిశ్చేష్టురాలివై పోయావు?" నవ్వుతూ అడిగాడు విజయ్. "ఓహ్! అయామ్ సారీ" సిగ్గుపడింది సుపర్ణ. ఆమె బుగ్గలు ఎరుపు ముద్దలై పోయాయి. ఆమె పక్వానికి వచ్చిన పండులా, నిండుగా ఉంది. నిడుపాటి నల్లని కురులు ఎగరకుండా ఆమె ఎర్రని రిబ్బను కట్టుకుంది కానిఅవి ఆమె మాట వినకుండా గాలిలో అలా అలా ఎగురుతూనే ఉన్నాయి. ఆమె ఆ సమయంలో నీలం పరికిణీ, బుట్టల చేతులున్న తెల్ల జాకెట్టు వేసుకుని ఉంది.

విజయ్ ఆమె గుండెల ఒంపులు మీద నుంచి దృష్టి మరల్చుకుందామనితీవ్రంగా ప్రయత్నించాడు. అతని మనసు అందుకు అంగీకరించలేదు. గొంతు పొడారిపోయి గుటకలు మింగసాగాడు. "నేను సిగరెట్టు కాల్చుకోవచ్చా!" గొంతు పెగుల్చుకొని అతి కష్టంమీద సుపర్ణని అడిగాడు విజయ్. "ఏమోమరి! ఇక్కడ సిగరెట్టు కాలుస్తూండగా నేనెవర్నీ చూడలేదు... కాని మీరు" అంది అర్థోక్తిగా.

"మీ వార్డెన్ చాలా మంచిదిలా ఉంది. నాకు టీ కూడా తీసుకువస్తానంది" అన్నాడతను ఆమెను కబుర్లలోకి దింపుతూ. సుపర్ణ మందహాసం చేసింది.

ఇందాకటి తన పరిస్థితిని గుర్తుకు తెచ్చుకుంటూ విజయ్ మామూలుగా నవ్వాడు. "మేము రావటం నువ్వు చూశావా?" యధాలాపంగా అడిగినట్టు అడిగాడతను. "ఆఁ! మేం చదువుకుంటున్న హాలులోంచి మీ కారు రావటం కనిపించింది. కాని నా కోసమ్మే మీరు వస్తున్నారనీ, నేనే అదృష్టవంతురాలిననీ అనుకోలేదు" అందామె.

"మీ అమ్మ నీకు ఉత్తరం రాయ

లేదా?" అడిగాడతను. ఆమె కంఠంలో వినిపించిన తిరస్కారం అతన్ని ఆశ్చర్య పరిచింది. 'నన్ను ఆటపట్టిస్తోందా?' అనుకున్నాడతను.

"ఆర్నెల్ల నుంచీ మా అమ్మ నాకు ఉత్తరాలు రాయటంలేదు" అంది సుపర్ణ



కిటికీలోంచి బయటకు చూస్తూ. క్రమ క్రమంగా చీకటి నలుపురంగును పులుము కొంటోంది. విజయ్ అసహనంగా కూర్చు న్నాడు. ఆమె తేనెరంగు కళ్ళు తనని ముద్దాయిగా చూస్తూండటం విజయ్ భరించ లేకపోతున్నాడు. మానసితో అతనికి ఉన్న ఆ ప్రత్యేక సంబంధం గురించి సుపర్ణకు తెలిసిపోయిందా?

"కూర్చో! అలాగే నిలబడిపోయావేం. నన్ను చూసి అలా భయపడిపోతా వేమిటి?" అన్నాడతను విజయ్ మళ్ళీ తెచ్చిపెట్టుకున్నట్టు నవ్వి.సుపర్ణ కూర్చో లేదు. అతను ఇచ్చిన పాకెట్టును అందు కుంది. కానీ విజయ్‌తో కాసేపు మాట్లాడ దామనుకున్నట్టు కనిపించలేదు "మీ అమ్మకు ఏదేనా కబురు చెబుతావా? రేపు నేను ఆవిడను రాష్ట్రపతి భవన్‌లో కలుసుకుంటాను. రేపు అక్కడో పార్టీ ఉందిలే" అడిగాడతను.

సుపర్ణ మౌనంగా ఉండటాన్ని బట్టి ఆమెకు తనతో మాట్లాడటం ఇష్టం లేదని అర్థం చేసుకున్నాడతను. కనీసం విజయ్ వెదజల్లే ఆకర్షణీయమైన చూపులు కూడా ఆమెను చైతన్యవంతం చేయలేదు.

"కిటికీలోంచి నువ్వు చూస్తున్న దేమిటి? గూటికి చేరుతున్న పక్షులనా? తెల్లని మేఘాల్లోంచి సావకాశంగా ఎగురు తున్న గద్దలనా? మంటల్లా కనిపిస్తున్న గుల్‌మొహార్ పువ్వులనా?" అతను అడి గాడు. ఆమె మెల్లిగా తల ఇటు తిప్పి అతనిని చూసింది. విజయ్ ఆమె నేత్ర ద్వయాన్ని మళ్ళీ గమనించాడు. గులక రాయి ముక్కల్లా ఉన్న చక్కని కళ్ళూ, ఎదుటివారిని బానిసలుగా చేయగల చూపులూ ... అసహనంగా అతను ఓ సిగరెట్టు బయటికి తీసి వెలిగించాడు. అతని చేతులు వణకసాగాయి.

"అందంగా కనిపిస్తున్న ఈ చీకటిని చూస్తున్నాను" అందామె. "చీకట్లో ఏం చూడగలవు నువ్వు?" ఉత్సాహంగా అడిగాడతను. ఇంతకు ముందు నువ్వు తదేకంగా చూస్తున్నదేమిటా అని నేనూ బయటకు చూశాను. గుత్తుగుత్తులుగా ఉన్న ఎర్రని గుల్‌మొహార్ పువ్వులూ, ఆకా శంలో స్వేచ్ఛగా ఎగురుతున్న పక్షులు నాకు కనిపించాయి. వాటినే నువ్వు చూస్తున్నావనుకున్నాను. ఎదురుగా ఉన్న అతిథిని వదిలేసి అలా పక్షులనీ వగైరా లను చూడటం..." అంటూ అతనేదో చెప్పబోతూండగానే "మీరు పిలవని పేరంటానికి వచ్చిన అతిథులు. మిమ్మల్ని ఇక్కడికి రమ్మని ఆహ్వానించినట్లు నాకు జ్ఞాపకం లేదే" అందామె.

"నువ్వు మీ అమ్మలాంటి దానివికాదు. ఆమెకూ నీకూ పోలికే లేదు. నువ్వు పరమ మూర్ఖురాలివి. ఇలాంటి దానివని ఊహించనైనా లేదు" అన్నాడతను చిరాగ్గా సిగరెట్టును కాలికింద నలిపేస్తూ.

"అవును. నాకూ మా అమ్మకూ పోలికే లేదు. ఈ విషయంలో నేనూ, మా నాన్న ఒకటి" అందామె కూర్చుని పరికిణీ సరిచేసుకుంటూ.

"నువ్వు అలా కనిపించటంలేదు" అన్నాడు విజయ్. "అయితే అది మీ దృష్టి దోషం" అంది సుపర్ణ రోషంగా.

"కాదు! బహుశా ఇది నీ వయసు తెచ్చిపెట్టిన అహంభావం చేస్తున్న తప్పు. అదే నీకు ఇప్పుడు ముప్ఫైఏళ్ళో, నలభై ఏళ్ళో ఉంటే నీ అందాన్ని మహాసంప దలా కాపాడుకోవటానికి, మరింత పెంపొం

దించుకోవటానికి మహా తాపత్రయ పడుతూ ఉండేదానివి. సుపర్ణా! అందం అనేది ఎంతో కాలం ఉండదు! ఒకసారి అది నిన్ను విడిచి వెళ్ళిపోతే మళ్ళీ ఎప్పటికీ దాన్ని నువ్వు అందుకోలేవు..." ఇంకా అతనేదో చెప్పబోయాడు.

ఇంతలో హాస్టల్ వార్డెన్ ట్రేతో టీ తీసుకు వచ్చింది. ట్రేలో లేసు అల్లిన నేప్‌కిన్ ఉంది. సుపర్ణ కుర్చీలోంచి లేచి ఆ ట్రే అందుకొని వారి మధ్యగా ఉన్న టేబిల్ మీద ఉంచింది. "సుపర్ణా! మీ అంకుల్‌కి టీ ఇవ్వు" అంది వార్డెన్.

సుపర్ణ శంఖంలా ఉన్న నున్నటి మెడను వంచి కప్పులో టీ పోయటానికి ఉపక్రమించింది. ఆమెను ఆ భంగిమలో చూసి సుపర్ణ పొందుకోసం తహతహ లాడాడు విజయ్! కప్పు అందిసున్న సుపర్ణ వేళ్ళను తమకంగా తదేక దీక్షతో చూశాడు. ఆమె వేళ్ళగోళ్ళు బాదంకాయల్లా సహజ-సౌందర్యంతో కనిపించాయతనికి. నాగరికతనీ, కట్టుబాట్లనీ పక్కకు నెట్టి ఆమె చేతి వేళ్ళ కొనలను గట్టిగా కసి తీరా కొరకాలనుకున్నాడు. నొప్పితో ఆమె బిగ్గరగా కేక పెట్టేలా చేయాలనుకున్నాడు—'ఏమిటి నేనింత దారుణంగా ఆలోచిస్తున్నాను? ఈ పిల్ల నేను మనస్ఫూర్తిగా ప్రేమించిన మానసి కూతురు. అంటే నాకూ అంతే అవుతుంది. వావి వరసలు మరిచిపోయి ఈ పద్దెనిమిదేళ్ళ బంగారు బొమ్మతో సుఖించాలనుకోవటం ఏమిటి?' తన ఆలోచనలు తననే భయపెట్టాయి!

"ఏం? టీ బావుండలేదా?" ఆత్రంగా అడిగింది వార్డెను. "లేదు! లేదు! సరిగ్గా నేనెలా తాగుతానో అలాగే ఉంది! సుపర్ణ టీ చక్కగా కలిపింది" అన్నాడతను.

వార్డెను సుపర్ణ వైపు దృష్టి సారించింది. అతని మాటలు ఆమెపై ఎలాంటి ప్రభావాన్నీ చూపించలేదు. ఆమె అతన్ని అసహ్యించుకుంటోందా? అదే నిజమైతే అతను చేయవలసినదొక్కటే. ఆమెను తనతో పాటు బయటకు తీసుకు వెళ్ళి బ్రహ్మాండమైన విందు ఇవ్వాలి. ఆమెకు తనపై గల అసహ్యమంతా ప్రేమలా మారేలా పెద్దమనిషి తరహాగా ప్రవర్తించాలి. సుపర్ణను లక్నోలో ఉన్న పెద్ద పెద్ద హోటళ్ళకి అతను తీసుకు వెళ్ళగలడు. పువ్వులూ, చాక్లెట్లు కొని ఇవ్వగలడు; సరదాగా, హాస్యయుతంగా మాట్లాడగలడు. ఆమెతో ఉన్నంత సేపు మడి కట్టుకున్నట్టుగా వ్యవహరించగలడు.

"సుపర్ణని నాతోపాటు హోటలుకు తీసుకు వెళ్ళమంటారా? సరదాగా నాతో భోజనం చేసి వస్తుంది! అఫ్‌కోర్స్! మీరు కూడా వస్తే బావుంటుందనుకోండి" అడిగాడు విజయ్. వార్డెన్ సంతోష పడిపోయింది ఆ మాటతో! చిన్నగా నవ్వుతూ "నేను రాలేనండి" అని మాత్రం అంది. "సుపర్ణని తీసుకు వెళ్ళండి! ఆమెకు కావల్సిన పైనాపిల్ ఐస్‌క్రీమ్ తినిపించండి. అన్నట్టు ఇవాళ ఆమె పుట్టిన రోజు కూడా!" అంది ఆ తరవాత.

"అరే! నాకు తెలియదు. వీళ్ళమ్మగారు ఈ చీర సుపర్ణ పుట్టినరోజు కానుకగా పంపిస్తున్నానని చెప్పారు. కాని పుట్టిన రోజు ఎప్పుడో సరిగ్గా చెప్పలేదు. పుట్టిన రోజు శుభాకాంక్షలు సుపర్ణా! ఈ అంకుల్‌తో వచ్చి భోజనం చేయటానికి నీకేమైనా అభ్యంతరమా?" అన్నాడతను.

"కాని మళ్ళీ పది గంటలలోపులో—

తీసుకు వచ్చెయ్యండి! మేము ఆ విషయంలో మహా స్ట్రిక్టు. ఏమిటి ఈవిడ మహా తిక్క మనిషిలా ఉందే అనుకోకండి" అంది వార్డెన్.

"అరెరే! ఎంతమాట! మిమ్మల్ని చూస్తూ ఎవరూ అలా అనుకోరు. పదయ్యేసరికి సుపర్ణని ఇక్కడ దింపేస్తాను. సుపర్ణా! వెళ్ళి బట్టలు మార్చుకు వస్తావా! త్వరగా తెములు మరి! మనం మాంచి హోటలుకు వెళ్ళి భోజనం చేద్దాం" అన్నాడు విజయ్ సంతోషంతో ఉప్పొంగిపోతూ.

సుపర్ణ చిరచిరలాడుతూ లేచి ఆ గది లోంచి వెళ్ళిపోయింది.

"వాళ్ళ అమ్మగారు రాజకీయాల్లోకి దిగటం సుపర్ణకు ఇష్టం లేదు. ఇదివరకు ఆమె పెద్దపెద్ద ఉత్తరాలు రాసేది ఈ అమ్మాయికి. ఆవిడ ఢిల్లీ వెళ్ళిపోయాక బొత్తిగా ఉత్తరాలే కరువయ్యాయి. మీరైనా చెప్పండి ఆవిడతో! కనీసం నెలకో ఉత్తరమేనారాయమని. ఆఖరికి ఓ కార్డు ముక్క రాసినా చాలు. సుపర్ణ మనసు చాలా సున్నితమైంది. అదే మరొకరైతే వాళ్ళ అమ్మగారు కేంద్రంలో మంత్రిగా ఉంటున్నందుకు గర్వంతో విర్రవీగేవారు. కాని ఈ పిల్ల ఆ విషయం గురించి నోరైనా మెదపదు. ఏ రకంగా చూసినా సుపర్ణ వింతగా తోస్తుంది" అంది వార్డెన్ ఏదో రహస్యం చెబుతున్నట్టు.

"ఈ అమ్మాయిని చూడగానే అనుకున్నాను. మీరు చెప్పినదాన్నిబట్టి అది నిజమేనని నిర్ధారణ చేసుకున్నాను" అన్నాడు అతను.

"మీకు సుపర్ణ తల్లిదండ్రులతో చాలా కాలంనుంచి సంబంధం ఉందనుకుంటాను! అవునా!" తను అలా చెప్పటానికి గల కారణాన్ని ఒత్తి పలుకుతూ అడిగింది వార్డెన్.

"అవునవును! చాలా కాలంగా వాళ్ళు నాకు తెలుసు" అన్నాడు విజయ్ రాజ్.




సైరస్ రాత్రి పదిగంటలకు ఆసుపత్రి నుంచి ఇంటికి తిరిగివచ్చాక ఆ రోజున సుపర్ణకు ట్రంకాల్ చేసి పుట్టినరోజు శుభాకాంక్షలు చెప్పాలనుకున్నట్లు జ్ఞాపకం వచ్చింది. ఆమెతో ఏం మాట్లాడాలో అతను ముందుగానే నిర్ణయించుకున్నాడు. ఇప్పుడతను ట్రంకాల్ బుక్‌చేసినా, ఆమె లైన్లోకి వచ్చేసరికి కనీసం రెండు గంటలు పడుతుంది. సుపర్ణ నిద్రలోంచి లేచి ఫోన్ అందుకోవలసిందే! అసలు ఆ రోజు పొద్దున్న అయిదు గంటలకే ఫోన్‌చేద్దామని ప్రయత్నించాడతను. కాని లైన్లు పాడయిపోయాయని సమాధానం వచ్చింది.

ఏది ఏమైనా పుట్టినరోజు గడిచిపోయింది. అతను ఈ పన్నెండేళ్ళలోనూ ఆమెకు పుట్టినరోజు శుభాకాంక్షలు తెలియజేయని సంవత్సరం ఇదే! 'విధి మమ్మల్ని వేరుచేస్తోంది' అనుకున్నాడతను. 'బహుశా వాళ్ళమ్మగారికి మేము స్నేహంగా ఉండటం ఇష్టం లేదేమో' అనికూడా భావించాడతను.

మానసి, సుపర్ణ వాళ్ళమ్మగారు రాజ

కీయాల్లో చేరాక ఆడకుక్క కంటే కనా కష్టం అయిపోయింది. జుట్టు సగానికి కత్తిరించుకొని సినిమా తారల్లా నిర్లక్ష్యంగా అలా వదిలేస్తోంది. సిగరెట్లుకూడా కాలుస్తున్నట్టుంది. బహుశా తాగుడు కూడా మొదలు పెట్టిందేమో! నిస్సందేహంగా ఆమె రూపం మారిపోయింది. ఆమె కనుల కింద నల్లని మచ్చలు కమిలిపోయినట్లు కనిపిస్తున్నాయి. బుగ్గలు బూరెల్లా ఉబ్బాయి.బరువుకూడా బాగాతగ్గిపోయింది. ఇరవై సంవత్సరాల పాటు సాహిత్య రంగంలో మహారాణిలా వెలిగిపోయిన ఓ బెంగాలీ స్త్రీకి తగని విధంగా చౌకబారు ఊత పదాలు అలవాటయ్యాయి.

స్నేహితురాలి తల్లిలో వచ్చిన దారుణమైన మార్పుల పట్ల సైరస్‌కు అసహ్యం కలిగింది. బూట్లు విప్పేసి మామూలు చెప్పులు తొడుక్కొని తల్లి ఉన్న గదిలోకి వెళ్ళాడు. "సారీ మమ్మీ! ఆలస్యమైపోయింది. నేను పెంద్రాళే వచ్చేద్దామనుకున్నాను కాని అక్కడ సి. జె. హాల్లో సదాశివరావుగారు ఉపన్యసిస్తూంటే మహా ఘోరం జరిగిపోయిందిలే!" అన్నాడు సైరస్.

సైరస్ హడావుడిగా భోజనం ముగించి టెలిఫోన్ దగ్గరకు వచ్చాడు. మొత్తానికి సుపర్ణ లైన్లోకి వచ్చేసరికి ఒంటిగంట యింది. ఆమె కంఠం నిద్రపోతున్న మనిషి లేచినట్లుగా బరువుగా లేదు. 'నేను ఫోన్ చేస్తానని ఎదురు చూస్తూ కూర్చుందా సుపర్ణ!'

"హలో! సుపర్ణా! నేను సైరస్‌ని" అన్నాడు అతను ఆమె మృదుమైన కంఠం ఫోన్‌లో వినిపించగానే.

"మెనీ హాపీ రిటర్న్స్ అఫ్ ది డే" అతను శుభాకాంక్షలందజేశాడు.

ఆమె నవ్వింది ఆ మాటలు విని. "థాంక్యూ సైరస్! నువ్వు ఇంత ఆలస్యంగా ఫోన్ చేశావేం?" అడిగిందామె.

సైరస్ కూడా నవ్వసాగాడు. "మరేం లేదులే! ఇవాళ నేను మహా హడావుడిగా ఉన్నాన్లే.సాయంత్రంనుంచీ అన్నీ గమ్మత్తు సంఘటనలే జరిగాయి. రేపు అన్నీ వివరంగా ఉత్తరం రాస్తాలే" అంటూ చెప్పాడు సైరస్.

"ఎవరేనా అమ్మాయితో ప్రేమలో పడ్డావా ?" సుపర్ణ వేళాకోళంగా మాట్లాడింది.

"పిచ్చిపిచ్చిగా మాట్లాడకు. సి.జె. హాల్లో జరిగిన బహిరంగ సభ గురించి మాట్లాడుతున్నాను నేను. సదాశివరావు గారు బాగా గాయపడ్డారు పాపం! అవును! బాంబు వేశారెవరో! ఆం కొంచెం ఎక్కువగానే గాయాలు తగిలాయి. ఇంతకంటే ఘోరం మరొకటి ఉండదేమో!"

"ఛ! ఏమిటలా మాట్లాడతావు? స్త్రీల పత్రికల ముఖచిత్రాల్లో ఉండే కాన్వెంటు పిల్లల్లా! మీలాంటి వాళ్ళందరూ పై చదువులకు విదేశాలు వెళ్ళటం, సలక్షణమైన మొగుడు దొరికే వరకూ ఎదురు చూడటం ...అంతే! అందుకు తప్ప ఇంకెందుకు పనికిరారు" అన్నాడు సైరస్ మామూలు ధోరణిలో.

"నువ్వు మాత్రం ఏం పొడిచేశావేం? పెద్ద గొప్ప నాయకుడులా మాట్లాడుతున్నావు! ఇంత రాత్రివేళ నిద్రలేపింది నన్ను ఎందుకూ పనికి రాని దానివని తిట్టటానికేనా? ఇలా అర్ధరాత్రి అపరాత్రి ఆడ పిల్లలకు ట్రంకాల్స్ చేసి తల్లిదండ్రుల డబ్బు వృధా చేయకూడ

దోయ్ ? నాకుచెప్పకు కబుర్లు !" సుపర్ణ ఆటపట్టించింది.

"మూడు నిమిషాలయింది" అంది టెలిఫోన్ ఆపరేటరు. ఆ వెంటనే "సుపర్ణా ! గుడ్‌లక్ !" అన్నాడు. మరు క్షణంలో "గుడ్‌నైట్" అని సుపర్ణ కంఠం మధురంగా వినిపించింది సైరస్‌కి. రిసీవర్ని టెలిఫోన్ క్రెడిల్‌మీద పెట్టేసి నవ్వు ముఖంతో సైరస్ పడక గది చేరాడు.

"ఆమెలో ఏ మార్పూలేదు. ఎంత అదృష్టవంతుడిని నేను ?" అనుకున్నా డతను. ఇప్పటికీ ఆమెకు అతనంటే అభిమానం ఉంది. ఇదివరకటిలాగే అత వితో సరదాగా దెబ్బలాడుతోంది. ఆమె తల్లి సహచరుల విషదంష్ట్రిలలో చిక్కు కోకుండా ఆమె ఎప్పటి సుపర్ణలాగానే ఉంటే అంతకంటె కావల్సిందేముంది ?

సైరస్‌తో ఫోన్‌లో మాట్లాడిన తర వాత సుపర్ణ తన గదిలోకి వెళ్ళింది. తొడుక్కున్న నైట్ డ్రెస్‌ను కొంచెం పక్కకు తొలిగించి అద్దంలో భుజాల వెనుక చూసుకొంది. కుడి భుజం మీద ఎర్రగా కందిపోయి కమిలినట్లుగా ఉంది. నిగ్రహించుకోలేని ఉద్రేకంతో విజయ్ ఆమెను కుడి భుజంమీద కొరికేశాడు. అతను అంత తుచ్ఛంగా ప్రవర్తిస్తాడను కోలేదామె. ఆ తరవాత అతను ఆమె కాళ్ళమీదపడి క్షమించమని కోరాడు. అక్కడున్నంతసేపూ సుపర్ణ గుండెలు ఆదిమజాతులవారి జాతర్లో మోగేడప్పుల్లా భయంకరంగా కొట్టుకున్నాయి. "నన్ను క్షమించలేవా ?" విజయ్ దీనంగా అడిగాడు. అతను కొరికినచోట ఉప శమనంగా రుద్దుకొంటూ మౌనంగా ఉండి పోయింది. "ఓ హ్! సుపర్ణా! ఈ ఒక్కసారికీ నన్ను క్షమించు. ఇంకొక్క అవకాశం ఇయ్యి! నా మంచితనాన్ని రుజువు చేసుకుంటాను. నువ్వంటే ఎంత గౌరవమో స్పష్టంగా తెలియజేస్తాను" అని ప్రాధేయపడ్డాడు విజయ్. అయినా ఆమె మాట్లాడలేదు. నిశ్చలంగా ఉండిపోయింది.

ఆ తరవాత ఆమెను హాస్టలు దగ్గర దింపేశాడు. దోవలో తన గురించి కానీ, తన ప్రవర్తన గురించి కానీ సుపర్ణను రెక్కించకుండా సీదాసాదాగా కూర్చు న్నాడు. ఆమె మెట్లెక్కి హాస్టలు గుమ్మం దగ్గరకు వెళ్ళగానే విజయ్ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ కారులో ఎక్కి కారును స్టార్ట్‌చేసి మెత్తని దుమ్ములేపుతూ వెళ్ళిపోయాడు. హాస్టలు హాల్లోని కిటికీలోంచి అతను వెళ్ళిపోవటంచూసి ఆమె తన గదిని చేరింది. అప్పటివరకూ మెలకువగానే ఉండి ఏదో పత్రిక చదువు కుంటున్న హాస్టలు వార్డెన్ ముక్కుమీదనుంచి కళ్ళజోడు తీసి సుపర్ణను చూసి పలక రింపుగా చిరునవ్వు నవ్వింది. "బాగా కాలక్షేపం అయిందా ?" ఆప్యాయంగా అడిగిందామె. సుపర్ణ ఊఁ అన్నట్టు తల ఊపింది.

గదిలో మంచంమీద పడుకొని నిద్ర పట్టక దొర్లుతూ 'ఈ విజయ్ ఎందుకలా పశువులా ప్రవర్తించాడు?' అని ఆశ్చర్య పోయింది ఆమె. అతనిపట్ల ఆమె నిర్ల క్ష్యంగా ఉండటం వల్లనే విజయ్ సహనం కోల్పోయాడా? ఆ సంఘటన జరగటానికి సుపర్ణ మౌనమే కారణమా? 'నేనంటే అస హ్యమా నీకు' అని అతను ఓ సారి అడి గాడు కాని సుపర్ణ మౌనవ్రతం వదలలేదు.

తరవాత సుపర్ణకు ఇష్టంలేని అనేక చెత్త విషయాల గురించి, ఢిల్లీలో ఉన్న తన శత్రువుల గురించి తనను పదవి లోంచి దింపెయ్యటానికి వాళ్ళు పన్ను తున్న పన్నాగాల గురించి ఏ వేవో చెప్పాడు. చివరికి విసుగెత్తి "నువ్వూ. మా అమ్మా ఏ గంగలో దూకినా నేనేం పట్టించుకోను" అంది సుపర్ణ.

ఆ మాటవిని రాజే దిగ్భ్రమంతో ఆమె వైపు చురచురా చూశాడు. "నీకూ, మా అమ్మకూ మధ్య జరుగుతున్న భాగోతం నాకూ తెలుసు. మీ ఇద్దరూ అంటే నాకు పరమ అసహ్యం" అంది ఆమె.

"నువ్వు నన్నెప్పటికీ అసహ్యించుకో లేవు" అన్నాడతను కోపంతో ముఖాన్ని ఎర్రపరచుకొని రెట్టిస్తూ. "నువ్వు నన్ను ప్రేమించేలా చేస్తాను" అంటూ భుజాలు దొరకబుచ్చుకొని నిరాచ్ఛాదితంగా ఉన్న మెడమీద, ఆ కింద ఎత్తుగా ఉన్న చోట్ల లోనూ, భుజాలమీద ముద్దుల వర్షం కురి పించాడు. ఆ ముద్దులు ఆమెను సమ్మెట పోట్లులా బాధించాయి. "ఛీ! రాస్కెల్! బ్రూట్! నా జాకెట్టు చింపేశావు" అంటూ ఆమె అరిచింది "నిన్ను చంపేస్తాను" ఆమె కోపంతో ఊగిపోయింది. కాని అతను ఆమెకు లొంగడు. అప్పటికే సుపర్ణ ఆవేశంతో బాగా అలసిపోయింది. వెంటనే ఆమె అవయవాల్లో వణుకు చల్లా రింది. "నేను... నిన్ను ... నిన్ను ఈ జన్మలో మరిచిపోను" అంది ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూ.

నిజమా ? ఇంచు మించు మానభంగం చేసినంత పని చేసిన విజయ్‌ని ఆమె జన్మలో మరిచిపోలేదా? విజయ్ నాభికి పైనా, కిందా పెరుగుతున్న నల్లని జుట్టును, సున్నితమైన అతని అవయ వాలనూ చూసిందామె. 'ఎంత మగసిరి గలవాడతను' అనుకుంది. అతని కళ్ళు ఆమెకు మాదిరిగానే తేనె రంగులో ఉన్నాయి. ఆమెను క్షమించమని అడిగి నపుడు ఆర్ద్రమైన ఆ కళ్ళను ఆమె ఎలా మరచిపోతుంది.?

అతని కళ్ళను చూసి ఆమె వరవశించి పోతోందా? "కుక్క! ఊరకుక్క" చీకట్లో పక్కమీద దొర్లుతూ సుపర్ణ లోలోపలే చీదరించుకుంది. 'ఎప్పుడో ఓ రోజున వీడి మీద పగ తీర్చుకుంటాను. వీడిపతనం కళ్ళారా చూస్తాను' అను కుందామె. మరు క్షణంలో సుపర్ణ బిగ్గర గానే ఏడవసాగింది.

ఏమైనాసరే ఒక్కసారి సైరస్‌ను చూసి అతనిలో ఒదిగిపోవాలనిపించింది. బహుశా సైరస్ ఒక్కడే ఆమెనూ, ఆమె పరి స్థితినీ అర్థంచేసుకొని మృదువుగా మనసు కుదుటపడేలా చేయగలడేమో! 'ఓ వారం రోజులు సెలవుపెట్టి బొంబాయి వెళ్ళి సైరస్‌ను చూడాలి. ఎంత త్వరగా వీల యితే అంత త్వరగా సైరస్‌ను కలుసుకు తీరాలి' అని నిశ్చయించుకుందామె.



దీపావళి పండుగ సందర్భంగా ప్రఖ్యాత నర్తకి సీత నాట్య ప్రదర్శన ఏర్పాటు చేశాడు కృష్ణన్. అదే సందర్భంగా ఒక సావనీరు వేయించాలని అందుకు కావల

సిన వ్యాపార ప్రకటనల కోసం సొంత ఫియట్ కారులో వ్యాపారస్థుల దగ్గరకూ, స్నేహితుల దగ్గరకూ తెగ తిరిగాడు.

ఈ కార్యక్రమం వెనుక ఓ రహస్యం ఉంది. ఒక అనాథ శరణాలయిం నిర్మాణానికి అవసరమైన డబ్బును సమకూర్చి పెడతానని అతను వాగ్దానం చేశాడు. ఇప్పుడున్న శరణాలయ భవనం పాతది. గట్టిగా వర్షాలు వస్తే కూలిపోయేలా ఉంది.

భవిష్యత్తులో ఎందుకేనా ఉపయోగిస్తార్లే అని అనాథ స్త్రీలను చూడటానికి నరూన్‌హాతో శరణాలయానికి వెళ్ళినపుడు ఆ భవనం పగుళ్ళు విచ్చి పడిపోవటానికి సిద్ధంగా ఉన్నట్లు గమనించాడు కృష్ణన్. నరూన్‌హా ఆ శరణాలయానికి సూపరింటెండెంటే కాక, మేనేజింగ్ ట్రస్టీ కూడా.

తనంటే మంచి అభిప్రాయం కలగటానికి ఆమెతో "మీ శరణాలయానికి కొత్త బిల్డింగ్ కట్టించేందుకు అవసరమైన ఆర్థిక సహాయం అందేలా నేను ప్రయత్నిస్తానెండి" అని మాటిచ్చాడు తను.

"నువ్వు ధర్మాత్ముడివి నాయనా" అంది నరూన్‌హా. "మీలాంటి పలుకుబడి ఉన్న వ్యక్తులు ఈ శరణాలయం విషయంలో శ్రద్ధ చూపిస్తే నేను ఏ చీకూ చింతా లేకుండా ఈ తనువు చాలిస్తాను! ప్రభుత్వానికి ఎన్నోసార్లు విజ్ఞప్తి చేశాను. ఎన్నోసార్లు ఉత్తరాలు రాసి ఈ శరణాలయానికి కొత్త బిల్డింగు నిర్మించటానికి సహాయం చేయవలసిందిగా ప్రాధేయపడ్డాను. కాని ఎవరో కిట్టనివాళ్ళు మా గురించి లేనిపోని పుకార్లు పుట్టించి ఆ పని జరగకుండా అడ్డు పడుతున్నారు" అంది నరూన్‌హా బాధగా.

"అంతెందుకు? ఓసారి పోలీసులను కూడా పంపారు, నేను ఇక్కడ ఈ శరణాలయం పేరుతో వ్యభిచార గృహాన్ని

నడుపుతున్నాననే వంకతో. అసలే అనాధలేమో, దాంతో మా వాళ్ళు మరీ బెంబేలు పడిపోయారు. ఈ శరణాలయం ఎంత పవిత్రమైనదో భగవంతుడికి తెలుసు. నా భర్త చనిపోతూ బోల్డంత ఆస్తి నాకు వదిలేసి వెళ్ళిపోయాడు. నాకా పిల్లలు లేరు.అందుకే అనాధలను చేరదీసి వాళ్ళకో దోవ చూపించే ఏర్పాటు చెయ్యాలనుకుని ఈ శరణాలయాన్ని ముగ్గురు పిల్లలతో ప్రారంభించాను. ఇప్పుడు ఇక్కడ ఇరవైఏడు మంది ఆడపిల్లలు ఉంటున్నారు" తన కష్టనిష్టూరాలు చెప్పుకొంది ఆమె.

మిషను కుడుతున్న ఆ యువతులవైపు ప్రశంసాపూర్వకంగా చూశాడు కృష్ణన్. వాళ్ళంతా పుష్టిగా, ఆరోగ్యంగా ఉన్నారు. వారిలో ఓ అమ్మాయి మరీ అందంగా, అమాయకంగా కనిపించింది. ఆమె ఒకసారి తల పైకెత్తి అతనిని చూసి వెంటనే కంగారు కంగారుగా తల దించేసుకొంది. ఆమెను చూపిస్తూ "ఆ అమ్మాయి పేరేమిటి?" అని అడిగాడు కృష్ణన్.

"స్టెల్లా. పంధొమ్మిదేళ్ళ క్రితం మా ఇంటి గుమ్మంముందు ఆ అమ్మాయిని ఎవరో పొత్తిళ్ళలో పడుకోబెట్టి వదిలేశారు. ఆ అమ్మాయి మొహం చూస్తే తెలియటంలా ఆమె తల్లిదండ్రులు కాశ్మీర్‌కు చెందిన వాళ్ళో, పంజాబ్‌కు చెందినవాళ్ళో అయి ఉంటారని? పరిచయం చెయ్యమంటావా? దురదృష్టవశాత్తూ ఆమె మూగది చెవిటిది కూడా. కాని స్టెల్లావల్ల మాకు ఎప్పుడూ ఏ ఇబ్బంది కలగలేదు. ప్రతిరోజూ నా బట్టల్ని స్టెల్లాయే ఉతికి ఇస్త్రీ చేసి పెడుతుంది. వంట చేయటం కూడా ఆమెకు తెలుసు. దయగలవారెవరేనా ఆమెను ఏ వంటకత్తెగానో పెట్టుకోవటానికి అంగీకరిస్తే నేను కొంత ఊపిరి పీల్చుకోగలుగుతాను. సాయంత్రం పూట ఈ పక్కనే ఉన్న ఫ్యాక్టరీలో పని చేసే వాళ్ళు ఈ చుట్టు పక్కలే తచ్చాడుతూ ఉంటారు. వాళ్ళు ఈ అమాయకులను ఏం చేస్తారోనని భయపడుతున్నాను. వాళ్ళు అనాధలే! నిజమే! కాని పాపాత్ములు కాదు కదా! నా సంరక్షణలో పెరిగిన ఈ పిల్లలలో ఏ ఒక్కరికీ చెడ్డ పేరు రావటం నేను సహించలేను"

"అవునవును! చాలా జాగ్రత్తగా ఉండాలి!" అన్నాడు కృష్ణన్ చెవిటి స్టెల్లా వైపు చూస్తూ. 'అంతఃపురాల్లో ఉండవలసిన పిల్ల' అనుకున్నాడు తనలో తనే. కృష్ణన్ ఏదోరోజు స్టెల్లాను విజయ్ పడక గదిలోకి పంపిస్తాడా? విజయ్ ఈమధ్య మారిపోయినట్లు కనిపిస్తున్నాడు కాని కృష్ణన్ పట్ల అతని అభిమానం అలాగే ఉండి ఉంటుంది. ఇదివరకటిలా కృష్ణన్‌కు తరచుగా ఫోన్ చేయటం లేదు విజయ్. బెంగాల్ కవయిత్రి మానసి మిత్రా అసలే గజిబిజిగా ఉన్న అతని జీవితంలో ప్రవేశించి ఆ జీవితాన్ని మరింత గజిబిజిగా మార్చింది.

విజయ్ దగ్గర కృష్ణన్‌కున్న పలుకుబడి బాగా తగ్గిపోయినట్టుంది. వయసు మీద పడిన ఆ మానసి వలలోంచి విజయ్‌ని తప్పించి అంతకంటే అందంగా, కసిగా ఉండే మరో అమ్మాయిని అతనికి పరిచయం చేస్తే తప్ప కృష్ణన్ ప్రాబల్యం పెరిగే అవకాశం లేదు. పర్మిట్లు, లైసెన్సులు సంపాయించటం అప్పుడు అతనికి మహా తేలికవుతుంది.

"ఇదేం ధర్మ సత్రం కాదు కదా! వాళ్ళందరినీ మీ జీవిత కాలం పోషించ టానికి! అప్పుడప్పుడు వాళ్ళకి బయటకు వెళ్ళే ఏర్పాటు చేయండి. వాళ్ళనీ వాళ్ళనీ కలుసుకుంటారు! వాళ్ళ జీవన విధానాన్ని వాళ్ళే నిశ్చయించుకుంటారు"

"అది నిజమే! కాని వాళ్ళని చూడ టానికి ఇష్టపడే పెద్ద మనుషులెవరున్నార్లే! ఎవర్నీ నమ్మటానికి లేదు! ఏ వేళప్పుడేం చేస్తారో ఈ పిల్లల్ని!"

"అందర్నీ అలా అనుమానిస్తే ఎలా? ప్రతీవాడూ దుర్మార్గుడేనా ఏమిటి? మన ప్రధాన మంత్రిగారున్నారు చూడు! ఆయనకు భార్య పోయి చాలా కాలం అయింది. పైగా వృద్ధాప్యం వస్తోంది కూడా. ఆయన మంచివారు. నాగరికత తెలిసిన వ్యక్తి! ఆయన గురించి పిస మెత్తు దుష్ప్రచారం చేసే దమ్ములు కూడా ఎవరికీ లేవు. పోనీ ఆయన్ను అలా వదిలెయ్యండి! మా స్నేహితుడు విజయ్‌రాజే ఉన్నారు. మీకు తెలుసుగదా! ఆయన ఇనుము, ఉక్కు శాఖామంత్రి. మీరు మరో శరణాలయం నిర్మిస్తానంటే ఆయన తప్పకుండా సహాయం చేస్తారు. చాలా మంచి మనిషి!"

"ఎవరూ? విజయ్‌రాజే?" ఆమె గొణి గింది. "ఆయన గురించి వాళ్ళూ వీళ్ళూ చెడుగా చెప్పుకొంటారే!"

"హహ్హహ్హ! మీరు భలేవారండీ! అలాంటి పెద్ద మనుషుల పైన కూడా పుకార్లు పుట్టిస్తూంటారు కొందరు. విజయ్ ఎవరి వలలోనో పడటమా? అలా జరిగే అవకాశమే లేదు. అలాంటి కాలక్షేపాలకు విజయ్‌కి తీరికెక్కడ? రోజుకు ఇరవై నాలుగ్గంటలూ ఆయన ఏదో పనిచేస్తూనే ఉంటారు. ఆయన నాకు చాలా సన్ని హితుడు. అతని అలవాట్లు నాకు తెలుసు. ఓ యోగిలాంటి వారాయన. అందులో సందేహమేమీ లేదు! ఎవరేనా విజయ్ గురించి చెడుగా చెప్పటానికి వారికి అతనిపై గల అసూయే కారణం! కావా లంటే ఓసారి మిమ్మల్ని ఆయన దగ్గ రకు తీసుకువెళ్తాను. అప్పుడే చూద్దురు గాని విజయ్ ఎలాంటి మనిషో! పోనీ ఓసారి ఆయన్నే ఇక్కడికి రమ్మని ఆహ్వానించకూడదూ మీరు? దీపావళి రోజున నేను ఏర్పాటు చేస్తున్న డాన్స్ ప్రోగ్రాంకి ఆయన వస్తున్నారు. ఆ రోజు కార్యక్రమానికి విజయ్‌రాజే ముఖ్య అతిథి"

"అదే జరిగితే నేను ఎప్పటికీ ఆయనకు, నీకు ఋణపడి ఉంటాను. మా శరణాలయాన్ని చూడటానికి రమ్మని ఆయనను తప్పకుండా పిలుస్తాను. అది సరే కానీ ఆయనకి తీరిక ఉంటుం దంటావా రావటానికి?" అడిగిందామె.

"విజయ్ చాలా ఉదార స్వభావంగల వ్యక్తి! ఇలాంటి సంస్థలను చూడటం ఆయనకు చాలా ఇష్టం! కాని పిల్లలను చూసి ఆయన ఎక్కడ బాధపడిపోతారో నని నా భయం. ఆయన చెల్లెలు సరిగ్గా ఇలాగే వుండేది పాపం! టైఫాయిడ్ వచ్చి 19వ ఏట చనిపోయింది. ఇపుడు ఆయనకు తోడూ నీడా ఎవరూ లేరు"

"అయ్యయ్యో! ఎంత పని జరిగింది! కనీసం తల్లిదండ్రులు కూడా లేరా?"

"వారిద్దరూ ఎప్పుడో చనిపోయారు. విజయ్‌కి ఓ అన్న ఉండేవారు. కాని ఆయన కూడా ఓ విమాన ప్రమాదంలో చనిపోయారు. ఆ తరవాతే చెల్లెలు

పోయింది. ఇక ఇప్పుడు దేశమే విజయ్ మంచిచెడ్డలు చూడాలి. ఓసారి ఆయన నాతో ఏమన్నాడో తెలుసా? 'కృష్ణా! ఈ భారతదేశమే నాకు తల్లి, సోదరి, కూతురు...ఈ దేశమే నా సర్వస్వం' అన్నారు"

"చిత్రంగా ఉందే! మనిషంటే అలా ఉండాలి! ఆయనను ఏమైనాసరే ఇక్కడకు ఓసారి తీసుకురావలసిందే! మా స్టెల్లాను చూస్తే ఆయన మనసేమన్నా కుదుటపడుతుందేమో!అందరిలా మాట్లాడలేక పోయినా తానేమనుకుంటోందో సంజ్ఞల ద్వారా అర్థం అయ్యేలా చెప్పగలదులే!" విజయ్‌మీద సానుభూతి కురిపించింది నరూన్‌హా.

"అవును! ఆ అమ్మాయి కళ్ళు చాలా పెద్దవి కదూ! విశాలంగా ఉన్నాయి కనుక ఏ భావమైనా స్పష్టంగా తెలిసిపోతుంది. ఆమె ముక్కు మొహం వగైరాలన్నీ చనిపోయినచెల్లెలిని ఆయనకుజ్ఞాపకంచేస్తాయి! వీలునుబట్టి ఓరోజు సాయంత్రం స్టెల్లాను విజయ్ రాజే ఇంటికి తీసుకు వెళ్ళమంటారా? బహుశా ఆయన ఈ అమ్మాయికి ఏదైనా మంచి ఉద్యోగం చూడవచ్చు! ఆయనకు కొన్నివందలమంది స్నేహితులున్నారు. అంతెందుకు? ప్రధానమంత్రి గారింట్లో పనిచేయటానికి అంటే...అదే! ఇంటి పనులన్నీ చూచుకోవటానికి ఓ అమ్మాయి కావాలని ఈ మధ్య ఆయన చెప్పారు" అన్నాడతను.

పైగా ఈ విషయం వినండి! మన ప్రియతమ ప్రధాని చాలా కాలంగా ఒంటరి జీవితం గడుపుతున్నారు. ఆయనకున్న ఒక్కగానొక్కకొడుకు కూడా దగ్గర లేకుండా పోయాడు. తండ్రి మంచిచెడ్డలు చూచుకుంటూ ఆయన బాధని మరిపించవలసింది పోయి, తల్లి చిన్న వయసులోనే అకస్మాత్తుగా చనిపోతే అతను కూడా తండ్రిని వదలి దూరంగా వేరే ఉంటున్నాడు. ఆయన్ని చూసినప్పుడల్లా నాకు భరించలేనంత దుఃఖం కలుగుతుందనుకోండి! నిజానికి ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకొని ఉండవలసింది. కాని ఆయన ఏకపత్నీవ్రతుడు. ఆవిడపోయి ఇన్ని సంవత్సరాలైనా ఆమెనే తలచుకొంటూ జీవితం వెళ్ళదీస్తున్నారు"

"అయితే ఆయన చాలా గొప్పవారికిందే లెక్క. దురదృష్టవశాత్తూ ప్రధానిమంత్రిని ఎప్పుడూ కలవడం కుదరలేదు. కిందటి సంవత్సరం మా పిల్లలు రిపబ్లిక్ దినోత్సవ వేడుకలను చూపించమని అడిగారు కాని నేనే వద్దన్నాను. ఆ రోజున అక్కడికి చాలామంది జనం వస్తారు కదా! నాకు జనం అంటే మహా భయం అనుకో! ఈ పిల్లలేమైనా చేస్తే ...! మేము అలాంటి వేడుకలలో పాల్గొనటానికి ఎవరైనా ఒక ఆహ్వానంలాంటిది ఇప్పిస్తే వెళ్ళినా బావుంటుంది.

"వచ్చే రిపబ్లిక్ దినోత్సవ వేడుకలకు మీకు ఆహ్వానం అందేలా నేను చూస్తానులెండి ! నిస్వార్థంగా సంఘసేవ చేస్తున్న మీలాంటి త్యాగమూర్తులు ఇలాంటి వేడుకలకు రావాల్సిందే! అసలు మిమ్మల్ని వాళ్ళు ఎందుకుమరిచిపోతున్నారో నాకు అర్థం కావటం లేదు. కనీసం వచ్చే ఏడాది మీకు పద్మశ్రీ బిరుదైనా ఇవ్వాలి. ఇలాంటి సందర్భాల్లో ఎలాంటి మోసాలు జరుగుతాయో నాకు తెలుసు. ఎందుకూ పనికిరాని చవటలు వాళ్ళ కాళ్ళో పీళ్ళ

కాళ్ళో పట్టుకుని అలాంటి గొప్ప గొప్ప బిరుదులు కొట్టేస్తారు. నిజంగా అలాంటి గౌరవ పురస్కారాలు చేయించుకోవలసిన మీలాంటి సమర్థులను పక్కకు నెట్టేస్తారు, మీ విషయం గురించి రేపు నేను రాష్ట్రపతితో మాట్లాడుతాను"

నరూన్‌హా పెదవులు సంతోషంతో సన్నగా కదిలాయి. ఆమె కళ్ళల్లో ఆనంద భాష్పాలు మెరిశాయి. కృష్ణన్ చేతులు పట్టుకొని "నేనంటే చాలా అభిమానం చూపిస్తున్నారు మీరు. ఎవ్వరూ ఇప్పటివరకూ నాతో ఇలా మాట్లాడలేదు. నా గురించి పట్టించుకోలేదు. మీ ఋణం ఎలా తీర్చుకోగలను? మిమ్మల్ని మీ బంధు మిత్రులను ఆయురారోగ్యాలతో వర్ధిల్లేలా చేయమని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను" అంది నరూన్‌హా పెల్లుబికిన ఆప్యాయతతో.

"అయితే మరి స్టెల్లాను ఓ గంట పాటు నేను బయటకు తీసుకువెళ్ళనా? విజయ్ రాజేకు పరిచయం చేస్తాను. ఆయనకు ఈ అమ్మాయి ప్రవర్తన నచ్చినట్లయితే ఆమెను ప్రధానమంత్రిగారి దగ్గరకి పంపే అవకాశం ఉందికదా!"

"తప్పకుండా తీసుకువెళ్ళండి! దేవుడే మిమ్మల్ని ఇక్కడికి పంపాడనుకుంటున్నాను. నాకు మీరు పరిచయం కావటం ఆయన సంకల్పమే. భగవంతుడు మీ ద్వారా నాకు సహాయం చేయాలనుకుంటున్నట్టున్నాడు" అంది ఆవిడ తన్మయత్వంతో. "ఏ పనైనా పరమాత్ముని నిర్ణయం మేరకే జరుగుతుంది" అన్నాడు కృష్ణన్ ఆవలిస్తూ.

* * *

ప్రధాన మంత్రి రానురాను ప్రతి చిన్న విషయానికి విజయ్‌రాజే మీద ఆధారపడుతున్నారు. విజయ్ చొరవ, తెలివితేటలు ఇప్పుడు అవసరమైతే ప్రధానిని బ్లాక్ మెయిల్ చేయగలవు. రాజకీయాలను ఎంత చాకచక్యంగా నడిపించాలో విజయ్‌కి బాగా తెలుసు.

అవకాశాలను విజయ్ బాగా ఉపయోగించుకుంటున్నాడు. మంత్రి వర్గంలో ఓ శాఖకు చెందిన వ్యక్తి హఠాత్తుగా మరణించాడు. అతను ఆ శాఖను చాలా కాలం నుంచీ నిర్వహిస్తున్నాడు. ఇపుడాశాఖను ఓ వ్యక్తికి ఇస్తే బావుంటుందన్నాడు విజయ్. ఆ వ్యక్తి ఇదివరకటి మంత్రి వర్గంలోంచి రిజైన్ చేసినవాడు. అతని మీద ఎన్నో ఆరోపణలున్నాయి.

"ఏమిటి? సేన్‌గుప్తాకు ఆ శాఖను అప్పగించమంటావా?" ప్రధాని ఆశ్చర్యపోయారు విజయ్ చెప్పిన వ్యక్తి పేరు విని. "సేన్‌గుప్తా తప్ప ఇంకెవరూ దొరకలేదా నీకు. అతనిమీద ఎన్ని అవినీతి ఆరోపణలున్నాయో నీకు తెలియదూ? ఇప్పుడు అతని దుశ్చర్యల గురించి విచారణ సంఘం కూడా నియమితమై లేదూ?అప్పట్లో ఆయిల్ కుంభకోణంలో ఎంత డబ్బు కూడబెట్టాడో తెలియని విషయమా? అలాంటి రాస్కెల్ని అంత ధండాలుణ్ణి మన మంత్రి వర్గంలోకి తీసుకోమంటావా?" మొహం ఎర్రగా చేసుకొని ఉద్రేకపడిపోయారాయన.

ప్రధాని అంత తీవ్రంగా మాట్లాడుతోంటే విజయ్ అతి మామూలుగా ఓ సిగరెట్ తీసి వెలిగించి చిరునవ్వు చిందించాడు. "అలాంటి వాళ్ళుంటేనే మనం మన అధికారాన్ని పదిలంగా నిలబెట్టుకోవచ్చు. పైగా మనకు ఎప్పుడూ అణిగి

మణిగి పడి ఉంటారు. ఎప్పుడు కావాలంటే అప్పుడు ఏదో వంకపెట్టి ఉద్వాసన చెప్పేయవచ్చు. మనం ఏంచేసినా అదే మని అడిగే దమ్ములుండవ్. పది కాలాల పాటు మన పదవులకేం ఢోకా ఉండకూడ దనుకుంటే అలాంటి దిష్టిబొమ్మలే కావాలి! నీతినే ఎప్పుడూ అంటపెట్టుకొనే వాళ్ళు ఎప్పుడో చెప్పాపెట్టకుండా మనల్ని గాలిలో నిలబెట్టేస్తారు"

ఆ మాటలు విని ప్రధాని మౌనంగా ఉండిపోయారు. ఆయనకు తల నెప్పితో కణతలు పగిలిపోతున్నాయనిపిస్తోంది. ఎయిర్ కండిషనర్ పనిచేయటంలేదని పని మనుషులు ఆ గది కిటికీ తలుపులు బార్లా తెరిచి ఉంచారు. కిటికీలోంచి వీస్తున్న వేడిగాలిని ఆయన భరించలేకపోతున్నారు. పడక గదిలోకి వెళ్ళిపోయి ఓ గంట పడు కుంటే బావుణ్ణనిపించిందాయనకి. కాని విజయ్‌ని నొప్పించటం ఆయనకు ఇష్టం లేదు.

విజయ్ చెప్పేమాటల్లో దాగిఉన్న నిజం ప్రధానిని ఆశ్చర్యంలో ముంచె త్తింది. "ఎన్నికలు దగ్గర్లోనే ఉన్నాయి. మనం మళ్ళీ విజయాన్ని వరించ వల సిందే" అన్నాడు విజయ్. అంతకంటే చేసేదేంలేదు. విజయ్ చెప్పినట్లు ఇవాళ కాకపోతే రేపైనా ముసలి మంత్రులు రోడ్డెక్క వలిసిందే! నిజాయితీ పరులంతా తుడిచి పెట్టుకు పోవలిసిందే!

ప్రభుత్వ వైఫల్యాల మీంచి ప్రజల దృష్టి మరల్చాలంటే దేశంలో ఏదైనా ప్రళయం సంభవించాలి. అప్పుడు తప్ప ప్రభుత్వం మధ్యతరగతి ప్రజల సాను భూతి సంపాయించలేదు. కనీసం ఓ యుద్ధం వచ్చినా చాలు... పొరుగున ఉన్న దేశం నిజంగా స్నేహం ప్రదర్శించటం లేదు.నిజానికి ఆ దేశ నాయకునికీ,విజయ్‌కీ ఆ వ్యవహారం గురించి రహస్య సంప్ర దింపులు జరుగుతూనేఉన్నాయి.చాలాఏళ్ళ క్రితం ఆయనా, ఈయనా కేంబ్రిడ్జిలో కలిసి ఉండేవారు. అప్పుడే ఓ ఇంగ్లీషు అమ్మాయి గురించి ఇద్దరూ పోటీ పడ్డారు. "ఆ అమ్మాయి పేరేమిటి?" అనుకున్నా డతను ఆలోచనగా పై పెదవిమీద గట్టిగా రాసుకొంటూ. మెడలైన్? బార్బరా? బ్రిడ్‌గెట్? విజయ్ ఆలోచిస్తూనే ఉన్నాడు.

రెండు దేశాలమధ్య ఓ ఉత్తుత్తి యుద్ధం జరగవలసి వుంటుందని చెప్పాడు విజయ్. ఆ యుద్ధం నిజంగా ఆవేశకావేషాలతో జరుగుతున్నట్లు కనిపించాలి. ఎంతో మంది అమాయకులు, యువసైనికులు చచ్చి పోతారు. ఓ పదిహేను రోజులపాటు యుద్ధం జరిగాక, పక్షం రోజులపాటు రేడియోలలో దేశభక్తి గురించి ఉపన్యా సాలు ఇచ్చాక ఆ రక్తపాతం ఆగిపోతుంది. యుద్ధం పరిసమాప్తమవుతుంది. దాంతో ప్రధాని ప్రతిష్ట మరింత పెరుగుతుంది. మరోసారి ఆయన దేశానికి ప్రియతమ నాయకుడవుతారు. దేశంలో వుండే ముసలీ, ముతక, చిన్నా పెద్దా అంతా ఆయన్ని మహా నాయకునిలా కొలుస్తారు.

ఈ ఆలోచన ప్రధానిని కలవరపరి చింది. విజయ్ నోటినుంచి ఆ మాటలు వెలువడగానే "నేను చేయలేని పని" అన్నా రాయన. "నన్ను నేను మోసం చేసుకో లేను" స్పష్టంగా చెప్పారు ప్రధాని. ఆ క్షణంలో ఆయనకు తల్లి మనసులో మెదిలింది. కానీ ఆ తరువాత మంచి మాటలతో నచ్చచెప్పి ఆయనని ఒప్పిం

చాడు విజయ్.

తనకు తాను నిలదొక్కుకోగలగటం కూడా చెప్పుకోదగ్గ కళే. తన అసమర్థతను గుర్తించో, తన స్థానాన్ని పదిలంగా ఉంచుకోవటానికో అదే మంచి మార్గమని పించిందాయనకు.

"సరే! సేన్‌గుప్తాను మన మంత్రి వర్గంలోకి తీసుకుందాం" అన్నారు ప్రధాని ముక్తసరిగా. "కానీ ముందోసారి అతన్ని కదిపి చూడు. అసలే ముసలాడు. ఢిల్లీలో వుంటూ మంత్రివర్గంలో పని చేయటానికి ఇష్టపడకపోవచ్చు" అనుమానిస్తూ చెప్పారాయన.

"నేనెప్పుడో అడిగాను. నిన్న బొంబాయి రేస్‌కోర్స్‌లో ఆయనను కలిశాను. తనకి ఇంకా దేశసేవ చేయాలని వున్నట్లు చెప్పారు. ఇంటిదగ్గర కూర్చుని ఆ పాతబడి పోయిన చరఖాని తిప్పటం ఆయనకు విసుగ్గా వుందిట. ఆయన ఒప్పుకోరనే భయం మీకక్కర్లేదు" చెప్పాడు విజయ్.

ఆ మాటలకు 'అసలు నా మంత్రి వర్గంలో ఒక్కడయినా నిజాయితీపరుడు వున్నాడా?' అని ఆశ్చర్యపోయారాయన. అన్నీ లొసుగులే! వాళ్ళ చెడు ప్రవర్తన వల్ల వారి నాయకుని పదవి మాత్రం క్షేమంగానే వుంటుంది. నిజాయితీపరుడు వాళ్ళని చూసి భయపడవలసి వస్తోంది. గత్యంతరంలేదు. విజయ్ చెప్పిన సలహాను ప్రధాని అనుసరించవలసిందే. ఏ ఒక్కడూ తనవైపు వేలు చూపిస్తూ నేరం చేసినట్లు మాట్లాడటం ఆయనకు ఇష్టం లేదు. నిజమే! అందుకే ఆయన పదవిలో వున్నా డబ్బు మూటలు కట్టుకోలేదు. అధికారాన్ని దుర్వినియోగం చెయ్యలేదు. కానీ ఆయనకీ కొన్ని బలహీనతలున్నాయి. తాను ప్రాణ ప్రదంగా అభిమానిస్తున్న మానసిపై ఎలాంటి నిందలూ రావటానికి ఆయన ఇష్టపడరు. 'మానసి...మై సింగింగ్ బర్డ్ ఆఫ్ పేరడైజ్...' అనుకున్నారు ప్రధాని.

"అది సరేకానీ, మన సదాశివరావు గారు ఆసుపత్రిలో శీఘ్రంగా కోలుకుంటున్నారుట" అన్నాడు విజయ్ గొంతు తగ్గించి రహస్యం చెబుతున్నట్టు.

"ఆహా! అలాగా! చాలా సంతోషంగా వుంది."

"అదేమిటి విచిత్రంగా మాట్లాడుతున్నారు? మళ్ళీ ఆయన పాత పాటే పాడటం ప్రారంభిస్తాడు. మన గురించి దుష్ప్రచారం కొనసాగిస్తాడు. ఆయన్ని అలాగే వదిలేస్తే ఏదో ఓ రోజుకి ఆయన మాటలే నిజమని ప్రజలు నమ్ముతారు. మీకు మంగళహారతి పాడేస్తారు. నేనే మీ పదవిలో వుండి వుంటే సదాశివరావు ఈపాటికి శ్రీకృష్ణ జన్మస్థానంలో వుండేవాడు."

"అదెలా సాధ్యం! మనది ప్రజాస్వామ్య దేశం. అందరికీ వాక్స్వాతంత్ర్యం ఉందికదా!" అనుమానంగా అడిగారాయన.

"నిజమే! కానీ స్మగ్లింగ్ చేసే హక్కు లేదుకదా!" వెంటనే జవాబు చెప్పాడు విజయ్.

"ఏమిటీ, సదాశివరావు స్మగ్లరా? నేను నమ్మను" ప్రధాని ముఖం కోపంతో జేవురించింది.

"అవున్లెండి! మీరెందుకు నమ్ముతారు? అందుకే ఆయన గుట్టుచప్పుడు కాకుండా తన పని తాను చేసుకుపోతున్నాడు. ఎవ్వరూ ఆయనను అనుమానించరు. ఆయనకి పెద్దగా ఆస్తి కూడా లేదు. పెళ్ళాం, పిల్లలు లేరు. ఈ రోజుల్లో

కూడా కఠిన బ్రహ్మచర్యం పాటిస్తున్నాడు. కానీ ఆయనకు వుండవలసిన వ్యవహారాలు ఆయనకూ ఉన్నాయి.ఆయన రహస్యాలు తెలుసుకోవటానికి ఎన్నో సంవత్సరాలు పట్టింది నాకు. ఆయన తన రాష్ట్రంలో హోం మంత్రిగా వున్నప్పుడు స్మగ్లర్లను స్వేచ్ఛగా వ్యాపారం చేసుకోనిచ్చాడు. ప్రతిఫలంగా వారి లాభాల్లో కొంత వాటా తీసుకొనేవాడు. ఇప్పటికీ ఆయన భక్త బృందం అప్పటి వాటాలను వసూలు చేస్తుంటారు. ఆయన ఇలాంటి వాడని తెలుసా మీకు? స్మగ్లర్లు ఆయనని తమ నాయకునిగా చెప్పుకొంటారు.ఇప్పుడు ఆయన కోరలు పీకిన పాములా వున్నా తనకు అందవలసిన సొమ్ము అందుతూనే వుంది. తన చేతిలో వున్న గూండా ముఠాతో ఏదయినా గొడవ చేసి తమకు ముప్పు కలిగిస్తాడేమోనని ఆ స్మగ్లర్లు భయపడుతున్నారు. ఆ య న స్విస్ బ్యాంకులో చాలా పెద్ద మొత్తంలో డబ్బు దాచుకున్నాడు..." అతని గురించి ఇంకా ఏదో చెబుతుండగానే "విజయ్! నువ్వు చెప్పేది వింటూంటే నాకు మతి పోతోంది" అన్నారు ప్రధాని.

"ఇంకా ఇలాంటి వెన్నో వున్నాయి! మీ అంతం చూడాలని కోరుకుంటున్న వాళ్ళకు సదాశివరావే నాయకుడు. మన సి.ఐ.డి.లు ఈ విషయం చెప్పారు. మీరు అనవసరంగా కంగారు పడతారనే ఉద్దేశం తోనే ఇవేవీ మీకు తెలియనివ్వలేదు!" చివరి సమిధ వేశాడు అతను.

"విజయ్! నేనేం పిరికి వాడిని కాదు. చావంటే నాకేం భయం లేదు" ఉక్రోషంగా అన్నారాయన.

"నాకా విషయం తెలుసు. కానీ మీరేమీ బాధ పడకండి. రక్షణ ఏర్పాట్లన్నీ పటిష్టంగా చేయించాను. ఆఖరికి మీ గదులు తుడిచే పని మనుషులు కూడా ఆర్మీలోంచి రిటైరయిన వాళ్ళే! మీ



రక్షణ కోసం వాళ్ళు దగ్గర ఎప్పుడూ పిస్తోళ్ళుంటాయి. మీ మీద ఈగ వాల కుండా చూసుకుంటారు వాళ్ళు. ఇక్కడ కాని, బయట కాని మీ దగ్గరకు కొత్త వాళ్ళెవరూ రాలేకుండా కట్టుదిట్టమయిన ఏర్పాట్లు చేయటం పూర్తయింది"

"నేను కేవలం అలంకార ప్రాయం అయిపోయాను విజయ్!" ప్రధాని గొణి గారు.

"మానసి మిత్రా ఇంట్లో కూడా నమ్మదగిన వ్యక్తుల్ని నియమించాను" చెప్పాడతను.

ప్రధాని ముఖం సిగ్గుతో కంది పోయింది! తల తిప్పేసుకున్నారాయన.

"సదాశివరావు వ్యవహారం నేను చూసుకుంటాన్లెండి!" అంటూ విజయ్ అయిపోయిన సిగరెట్టును ఏష్ట్రేలో జలంగా నలిపేశాడు. అతని ఆ చర్యలో ప్రధానికి ఏదో హింస గోచరించింది. ఆయన లోలోపలే వణికిపోయాడు. భయంతో ఆయన ముఖం పాలిపోయింది. "విజయ్! ఎందుకో పొద్దుణ్ణించీ ఒంట్లో నాకేం బావుండలేదు" అన్నారు ప్రధాని నిస్త్రాణగా.

"వెళ్ళి కాసేపు విశ్రాంతి తీసుకోండి!" సలహా ఇచ్చాడు విజయ్! ప్రధాని మెల్లిగా ఆ గది వదిలి వెళ్ళిపోయారు తాత్కాలికంగానయినా వెధవ సమస్యల నుంచి విముక్తి లభించిందన్న సంతృప్తితో.

* * *

ఆసుపత్రి మొదటి అంతస్థులో వున్న కృష్ణ మందిరం ముందు నుంచి చక్రాల కుర్చీలో వెళ్తున్న సదాశివరావును చూసి తనలో తానే నవ్వుకున్నాడు విజయ్. రాజే. వార్డుబోయ్ కుర్చీని తోస్తున్నాడు. విజయ్ చేతిలో పూల గుత్తి వుంది. సదాశివరావు తాను వుంటున్న 565 నెంబరు గదికి వెళ్తున్నాడనుకున్నాడు విజయ్. ఆ గదిలో ఎయిర్ కండిషనర్ వుండటంవల్ల చల్లగా వుంటుంది. పైగా కిటికీలకు చక్కగా ఏవో తీగలు అల్లుకొని వున్నాయి. ఆ గది 5వ అంతస్థులో ఓ మూలగా వుంది.

సదాశివరావు ఆ కృష్ణ మందిరం దగ్గర ఓపిగ్గా చాలా సేపు వున్నాడు. పూజారి బయటకు వచ్చి ఓ ఆకులో కొంచెం ప్రసాదం కుంకుమ ఇచ్చాడు. ఆ పూజారి రాజస్థాన్ నుంచి వచ్చాడు. అతను ముసలాడే కాని దృఢంగా వున్నాడు. ఎప్పుడూ తెల్లని వస్త్రాలు ధరిస్తాడు. కాషాయ రంగు తలపాగా చుట్టుకొంటాడు.

"ఎలా వుంది ఈ పేళ?" అడిగాడు పూజారి. "ఫరవా లేదు. బాగానే వుంది. గాయాలన్నీ మాడిపోయాయి. ఇంక ఇంటికి పోతే బావుణ్ణనిపిస్తోంది. బహుశా వచ్చే ఆదివారం నన్ను పంపించేస్తారేమో! దేనికయినా ఆ భగవంతుడే వున్నాడు"

"శ్రీకృష్ణ పరమాత్మ మంచివాళ్ళ నెప్పుడూ కాపాడతాడు"అన్నాడు పూజారి

సదాశివరావు పది రూపాయల నోటు పూజారికిచ్చి అక్కడి నించి బయలు దేరాడు. చక్రాల కుర్చీ నీరసంగా, సావకాశంగా కదిలింది. ఫ్రీ వార్డులలో స్టూడెంటు నర్సులు రోగుల శరీరాలను సబ్బు నీళ్ళలో ముంచిన స్పాంజితో హడావుడిగా శుభ్రం చేస్తున్నారు.

"బేటా! నువ్వెపుడు వచ్చావ్?" విజయ్‌ని ఉద్దేశించి అడిగాడు సదాశివరావు. చక్రాల కుర్చీతో తన గదిలోకి ప్రవే

శించి అప్పటికే అతను వచ్చి అక్కడ కూర్చుని చాలా సేపయింది. ఏం తోచక సిగరెట్లుకాల్చుకుంటున్నాడతను. "చాచా! నా మీద లేనిపోని నిందలు వేయటంతో ఇక్కడికి రాక తప్పలేదు. మీరు రోడ్డు పక్కన గాయాలతో పడి వున్నపుడు నేను కార్లో అటు వెళ్ళానని ఉద్దేశపడు తున్నారని ఎవరో అంటే వచ్చాను. అది శుద్ధ అబద్ధం. కావాలంటే ప్రమాణం చేస్తాను. ఆఖరికి నేను ఆ రోజున బొంబాయిలో కూడా లేను.లక్నోలో ఉన్నాను. నన్ను నమ్మండి చాచా! ఎవరో మీకూ నాకూ మధ్య మనస్పర్థలు లేవదీయాలని చూస్తున్నారు. మనం శత్రువులుగా మారితే చూడాలని ఎవరో ఇలా లేని పోనివి కల్పిస్తున్నారు"

సదాశివరావు ఓ చిటికెడు ముక్కు పొడుం తీసి దట్టిస్తూ చిరునవ్వు నవ్వాడు. "ఇపుడు ఆ గొడవలెందుకులే! జరిగిం దేదో జరిగిపోయింది. చేత్తో పువ్వులు పట్టుకొని, పెదాలమీద సంజాయిషీ నింపు కొని ఇక్కడికి వచ్చావు. అదే చాలు! అయినా నిన్ను సంజాయిషీ ఎవరడిగా రసలు? పువ్వులు అభిమానానికి చిహ్నం కాదు. మనం పాశ్చాత్యులం కాదుకదా! అనవసరంగా వాటి కోసం బోల్డంతడబ్బు ఖర్చు పెట్టావు! అవునుకానీ నువ్వు పైకి ఎప్పుడు వచ్చావు? నిన్ను నేను చూడ లేదే! మొదటి అంతస్థులోనే ఉన్నాను ఇప్పటివరకూ, ముందు నువ్వేదో పూల కొమ్మ తీసుకువచ్చావనుకున్నాను. పొర పాటు పడ్డానన్న మాట. ముసలాడినై పోయాను కదూ! చూపు మందగించిందిలే! చరమాంకంలో ఉన్నాను. ఏమంటావు విజయ్!"

"చాచా! నువ్వు ఏం చెప్పినా నేనె ప్పుడూ అర్థం చేసుకోలేను" అన్నాడు విజయ్ ఇబ్బందిగా కదుల్తూ.

"మానసి మిత్రా ఎలా ఉన్నారు? కేంద్రమంత్రివర్గంలో ఆవిడ కొత్తగా చేరారు కదూ! నువ్వనుకున్నట్టు అన్నీ సవ్యంగా నిర్వహిస్తున్నట్టేనా?"

"నేననుకున్నట్టా? అదేం కాదు. మీకు తెలిసే ఉంటుంది, ప్రధానమంత్రే ఆవిడని మంత్రివర్గంలో చేర్చుకున్నారు".

"ఎవరో అన్నార్లే!ఆవిడ నిన్ను పెళ్ళి చేసుకోవటానికి భర్తకు విడాకులిస్తుందని చెప్పుకొంటున్నారు. పోన్లే! ఇప్పటికైనా పెళ్ళి చేసుకుంటున్నావు"

విజయ్ ముఖం జేవురించింది. "మీరు విన్నదంతా పచ్చి అబద్ధం.మానసి నేను ఒకర్నొకరు ప్రేమించుకోనూ లేదు. పెళ్ళి చేసుకోవటమూ లేదూ! ఆవిడ ఎవరితోనైనా చనువుగా ఉంటుందీ అంటే అది ప్రధానితోనే!" ఇంచుమించు అరిచి నట్లే అన్నాడు విజయ్!

ఇంతలో తలుపు చప్పుడైంది. దాంతో వారి సంభాషణ ఆగిపోయింది. తలుపు తెరవగానే ఓ కుర్రడాక్టరు చేతిలో ఇంజ క్షన్ సిరంజ్ పట్టుకొని వచ్చాడు. "మీకు ఇంజక్షను ఇవ్వాలి. డాక్టర్ కొఠారీఇవాళ సెలవు పెట్టారు. ఆయన బదులు నేను వచ్చాను. ఏదీ! చెయ్యి ఇలా ఇవ్వండి! ఇంజక్షన్ చేసి వెళ్ళిపోతాను" వినయంగా అడిగాడు డాక్టరు.

"ఏం ఇంజక్షన్ అది? నేను బాగానే ఉన్నానే! గాయాలన్నీ తగ్గిపోయాయి. ఇంకా ఇంజక్షన్ ఎందుకు?"

"ఇది మత్తు ఇంజక్షన్. పెద్ద డాక్టరు గారు ఈ ఇంజక్షన్ మీకు చెయ్య

మన్నారు. దాని వల్ల ఆసుపత్రి వది లేసే నాటికి శుభ్రంగా విశ్రాంతి తీసుకున్నట్టవుతుంది"

సదాశివరావు చేయి ముందుకు జాపి చొక్కా పైకి మడతపెట్టుకుని "సరే! పనికానిచ్చి పెంద్రాళే బయటకు వెళ్ళు!" అన్నాడు. డాక్టరు ఇంజక్షన్ చేసి వెళ్ళి పోయాడు.

"చాచా! మరి నేను వెళ్తాను. ఢిల్లీ వెళ్ళాలి. విమానం బయలుదేరే టైమవుతోంది!" సెలవు తీసుకుంటానన్న ధోరణిలో అన్నాడు విజయ్. "మంచిది వెళ్ళిరా!" అన్నాడు సదాశివరావు ఒత్తిగిలి పడుకొని కళ్ళు మూసుకొంటూ.

మధ్యాహ్నం భోజనం చేశాక సదాశివరావుని చూసిపోదామని సైరస్ ఆసుపత్రికి వచ్చాడు. తీరా చూసేసరికి ఆయన స్పృహతప్పి ఉన్నాడు. కంగారు కంగారుగా నర్స్‌ని పిలిచాడు. "ఏం జరిగింది?" అంటూ నర్సు హడావుడిగా వచ్చింది "నిన్న రాత్రి వరకూ ఆయన బాగానే ఉన్నారే! ఇవాళ ఏం తేడా చేసిందో? వెంటనే డాక్టరుగారిని పిలవండి! శరీరం చల్లబడిపోయినట్లుంది" సైరస్ ఆతృతగా అన్నాడు.

పెద్ద డాక్టరు ఆ గదిలోకి వచ్చి సదాశివరావుని చూడగానే బ్రాంతపడి పోయారు. సదాశివరావుకి బ్లడ్ ప్రెషరు దారుణంగాపడిపోయింది.ఆయన బతకటం బతకక పోవటం కేవలం అదృష్టం మీద ఆధారపడి ఉందనుకున్నాడు డాక్టరు. "నర్స్! ఈ వార్డు డాక్టరును పిలు. ఈయనకు ఇవాళ ఏయే మందులిచ్చారసలు?" అసహనంగా అరిచాడాయన.

"ఈ వార్డు ఇన్‌చార్జి ఇవాళ సెలవు పెట్టారు. ఆయన చెల్లెలు పెళ్ళిట!" జవాబిచ్చిందా నర్స్.

"ఆయనే చెల్లెల్ని పెళ్ళి చేసుకుంటున్నాడా ఏమిటి? ఇంకెవరికేనా డ్యూటీ అప్ప చెప్పాడా లేదా" చిరాకుతో మండి పడ్డాడు పెద్ద డాక్టరు.

"లేదండీ! నాలుగింటి కల్లా వచ్చేస్తానని చెప్పారు. పైగా ఈ వార్డులో ఉన్న పేషెంట్లలో ఎవరికీ సీరియస్‌గా లేదు. 515 గదిలో ఉంటున్న కాన్సర్ పేషంటు నిన్న రాత్రి పదింటికి చనిపోయాడు. డాక్టర్ దేశాయ్ చేయవలిసిన అన్ని ప్రయత్నాలూ చేశారు. లాభం లేక పోయింది" అంటూ సదాశివరావు చేతి వంక చూసి "సర్! ఈయనకు ఎవరో ఇంజక్షన్ ఇచ్చారు" అంది ఇంజక్షన్ చేసినట్లున్న గుర్తును చూపిస్తూ. డాక్టరు కూడా ఆ చిహ్నాలు చూసి "ఇవాళ ఈయనను చూడటానికి ఎవరెవరు వచ్చారు?" అన్నాడు సాలోచనగా. "నేను ఈ పక్క గదిలో ఉన్న కాన్సర్ పేషెంటును చూడటానికి వచ్చినపుడు ఎవరో మంచి ధనవంతుడిలా ఉన్న ఒకాయనని చేతిలో పూల గుత్తితో ఇక్కడ చూశాను. ఆ. ఇదిగో ఆ పూల గుత్తి" అంది నర్స్.

ఆ పూల గుత్తికి అంటించి ఉన్నకార్డు మీద సదాశివరావు పేరు తప్ప ఏదేనా సందేశం కాని, ఆ గుత్తిని తెచ్చిన వ్యక్తి సంతకంగాని లేవు. పెద్ద డాక్టరు ఆ పూల గుత్తిని తీసి చూశాడు. అందులో రకరకాల పూవులు శాటిన్ రిబ్బన్‌తో ముడి వేసి ఉన్నాయి. గుత్తిని కింద ఉంచేసి నిట్టూర్చాడు. "మిగతా వ్యవహారాలు చూడటానికి సర్జన్‌ని పంపిస్తాను. ఇంక

లాభం లేదు! చెయ్యి దాటిపోయింది ఈయన పరిస్థితి" డాక్టరు వెళ్ళి పోయాడు.

ఎంక్వైరీలో సదాశివరావు గదికి వచ్చిన వ్యక్తి ఎలా ఉంటాడు అని అడిగాడు డాక్టరు. "ఏమో సర్! నేను ఆయన వచ్చిన సమయంలో ఏ బాత్ రూమ్‌కో వెళ్ళి ఉంటాను. నేనుండగా ఒక్కళ్లుకూడా సదాశివరావుగారి గది నెంబరు అడగినట్లు జ్ఞాపకం లేదు" అన్నాడా గుమాస్తా.

"ఇప్పుడు పెద్ద చిక్కే వచ్చి పడింది! పూర్తిగా ఊబిలో కూరుకుపోయాం" డాక్టరన్నాడు సైరస్‌తో. అతను తలూపి "అవును! ఇది హత్యే! సదాశివరావు గారికి శత్రువులు చాలామందే ఉన్నారు"

"ఈయన బంధువులు ఎక్కడెక్కడుంటారో తెలుసా ?"

"నాకు తెలియదు. ఇప్పుడాయనకి కావల్సినవాళ్ళంటూ ఎవరూ లేరని నా అనుమానం ఒకప్పుడు విజయ్ రాజే ఈయనకు కొడుకులా ప్రవర్తించేవాడు. ఆ తరవాత ఎందుకోమరి దూరంగా ఉంటున్నాడు. ఆయనకే ఈ విషయం తెలియజేస్తే మంచిదేమో! నాకు ఆయన ఇల్లు తెలుసు"

కాని విజయ్ ఇంట్లో పని మనిషి "ఆయన ఢిల్లీ వెళ్ళి మూడు రోజు లయింది. బహుశా రేపు వస్తారేమో" అని చెప్పాడు.

"సదాశివరావుగారి లాయర్‌ని పిలవటం మంచిది. ఈయన అప్పుడప్పుడు లాయర్ గురించి చెబుతూ ఉండేవారు. బహుశా ఆయనొక్కడే ఈయనకున్న స్నేహితుడేమో!"

సదాశివరావు చనిపోయాడని చెప్పగానే లాయరేమీ ఆశ్చర్యపోలేదు. "ఇలాంటిదేదో జరుగుతుందని ఆయన భయపడుతూనే ఉన్నారు. క్రితం వారం నన్ను పిలిచి ఇద్దరు సాక్షుల ఎదుట తన ఆస్తినంతటినీ దేశానికే ఇవ్వవలిసిందిగా వీలునామా రాశారు" అన్నాడు లాయరు.

"ఆస్తి సరే! ఈయన ఉంచుకున్న ఆడవాళ్ళనందరినీ దేశం ఏం చేసుకుంటుంది?" డాక్టరు అడిగాడు. లాయరు నవ్వాడు కాని సైరస్ మౌనంగానే ఉండి పోయాడు. "ఇలాంటి విమర్శలు చేయటానికి ఇదా సమయం? సదాశివరావుని ఎవరో హత్య చేశారనేది స్పష్టం. కాని ఆ శత్రువు లోపలికి ఎలా ప్రవేశించ గలిగాడు? విషప్రయోగం ఎలా చేయ గలిగాడు ?" తనలో తనే ప్రశ్నించుకున్నాడు సైరస్. హంతకుడిని అలా గాలికి వదిలివేయటం అతతికి ఇష్టం లేదు.

సదాశివరావు గది బయట ఉన్న చెత్త బుట్టలో గదులు శుభ్రం చేసేవాడికి ఓ ఇంజక్షన్ సీసా కనిపించింది. "ఈయనని అంతం చేసినది ఈ ఇంజక్షన్ సీసాయేనా ?" సైరస్ తీరని అనుమానాలతో ఉక్కిరి బిక్కిరయ్యాడు. అతను డాక్టర్లు, నర్సుల ముఖాలలోకి పరిశీలనగా చూడ సాగాడు. వాళ్ళంతా ఏదో తప్పు చేసినట్లు బాధపడి పోతున్నారు. సదాశివరావు మరణంతో అందరికంటే బాగా కలతపడి పోయింది సైరస్ ఒక్కడే.

సి.జె. హాలులో సదాశివరావు మృతి సందర్భంగా ఏర్పాటు చేసిన సంతాప సభలో సైరస్ ఇంచు మించు ఏడ్చేశాడు. ఆ హాలులో వెనుకగా ఉన్న గోడ అతని దృష్టిలో పడింది. నెల్లాళ్ళ క్రితం ఆ

హాలులో పేలిన బాంబువల్ల ఆ గోడ పూర్తిగా బీటలు ఇచ్చింది. ఎన్నో సంతాప సందేశాలు వచ్చాయి. వాటిలో ప్రధాని పంపినది కూడా ఉంది. "సదా శివరావు గొప్ప దేశభక్తుడు. స్వాతంత్ర్య యోధుడు. నిజాయితీపరుడు. ఆయన మరణం దేశానికి తీరని లోటు" అని ప్రధాని తమ సంతాప సందేశంలో పేర్కొన్నారు.

"విజయ్‌రాజే మాట్లాడుతూ సదాశివ రావుతో తన చిన్నప్పటి అనుభవాలూ, ఆయన తనకు చేసిన మాట సహాయం, ధనసహాయం వగైరాల గురించి చెప్పాడు. "ఆయననాకు తండ్రిలాంటి వారు.ఇప్పుడు నాతండ్రి చనిపోయారు.నన్ను ఒంటరివాణ్ణి చేసి వెళ్ళిపోయారు" అంటూ విజయ్ వెక్కి వెక్కి ఏడ్చాడు. పత్రికల నుంచి వచ్చిన ఫొటోగ్రాఫర్ల కెమేరాలు విజయ్ విషణ్ణ వదనాన్ని ఫొటోలు తీశాయి. జాతీయ జండాను ఒకరోజు పాటు అవనతం చేశారు.

సదాశివరావు అంత్యక్రియలు, కర్మకాండ, పీలునామ చదవటం, ఉపన్యాసాలు అన్నీ సవ్యంగానే జరిగాయి. అంత హడావుడిలోఉన్నా సైరస్ సుపర్ణ గురించి మరిచిపోలేదు. మర్నాడు పొద్దున్న ఆమె వస్తోంది. రైల్వేస్టేషన్‌కు వెళ్ళి సుపర్ణను ఇంటికి తీసుకు రావాలి. తాను విశ్రాంతి తీసుకోవటానికి బొంబాయి వస్తున్నాననీ, సెలవు పెట్టాననీ సైరస్‌కు ఉత్తరం రాసింది సుపర్ణ.

"అంత విశ్రాంతి తీసుకోవాల్సి వచ్చేటంతగా కష్టపడి పోయిందా!" అనుకొని ఆశ్చర్యపోయాడు సైరస్. ఇప్పుడు పరీక్షలు రాయటం మానేసి ఈలోగా బాగా చదివి మరో ఆరు నెలల్లో జరగబోయే పరీక్షలు రాద్దామని అనుకుంటోందా? సర్లే! ఎందుకు వస్తేనేం? కొన్నాళ్ళు సరదాగా సుపర్ణతో కలిసి తిరగొచ్చు" అను కున్నాడు సైరస్ రాత్రిపూట పడుకొని తలగడని నలిపేస్తూ.




రైలు ఠంచనుగా పదకొండున్నరకు స్టేషను చేరింది. కాని పన్నెండయినా సుపర్ణ రైలు దిగలేదు. సైరస్ కంగారు కంగారుగా సుపర్ణ కోసం ప్రతీ బోగీ వెదకసాగాడు. చివరికి ఓ సెకండు క్లాస్ కంపార్ట్‌మెంట్లో మూలగా నిశ్శబ్దంగా ఏడుస్తూ కూర్చున్న స్నేహితురాలు అతని కంట పడింది. "సుపర్ణా ! ఏమిటి ఇంకా ఇలాగే కూర్చుండిపోయావు. రైలు దిగు" ఆశ్చర్యంగా అరిచాడతను.

ఆమె సీట్లోంచి లేవలేదు. దిక్కులేని దానిలా మాసిపోయిన నీలం రంగు జీన్సు వేసుకొంది సుపర్ణ. ముఖం వాడిపోయి దీనంగా ఉంది. "ఏమిటి? ఏం జరిగింది?" సైరస్ అడిగాడు ఆమె భుజాలు పట్టుకొని కుదుపుతూ. ఆమె కళ్ళలోకి చూశాడతను. పెద్ద పెద్ద కళ్ళలో ఎర్రని జీరలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆమె చాలా సేపటినుంచి ఏడుస్తోందని నిశ్చయించుకున్నాడు. "లే! ముందు బండి దిగు" సైరస్ చేయి అందించాడు. సుపర్ణ

లేచింది. కాని నిలబడలేక పోయింది. సైరస్ ఆమె బాగ్ పట్టుకొని, సుపర్ణను కూడా కిందకు దించాడు. "రా! బచ్చూ! జాగ్రత్తగా దిగు"

చిన్నప్పుడు తనను పిలిచినట్లు సైరస్ "బచ్చూ" అని పిలిచేసరికి సుపర్ణకు దుఃఖం ఆగలేదు. బిగ్గరగానే వెక్కి వెక్కి ఏడిచేసింది. ప్లాట్ ఫారమ్ మీదే ఒకటి రెండు నిమిషాలు ఇద్దరూ అలాగే ఒకరిని ఆనుకొని మరొకరు ఉండిపోయారు. ఆ తరువాత ఆమె భుజాలచుట్టూ చేయి వేసి సుపర్ణను రైల్వే హోటలుకు తీసుకు వెళ్ళాడు. వేడివేడి టీ తాగితే కొంత ఉపశమనంగా వుంటుందని అతని ఉద్దేశం. ఇద్దరూ ఫేమిలీ రూంలో కూర్చున్నారు. ఆ చిన్న గది మహా ఇరుకుగా వుంది. "ఏమిటసలు? ఏం జరిగింది?"

సుపర్ణ చేతుల్లో ముఖం దాచుకుని ఇంకా వెక్కుతూనే వుంది. తెల్లగా వున్న ఆమె కంఠంమీద ఏదో గీరుకుపోయినట్లు కనిపించిందతనికి. ఆ తరువాత మోచేతి మీద కూడా అలాంటి గాట్లే కనిపించాయి. 'ఏమిటిది? ఎవరేనా సుపర్ణను మానభంగం చేశారా?' కుర్చీలోంచి లేచి ఆమె దగ్గరగా వెళ్ళాడు. చేత్తోఆమె తలపైకెత్తి "బచ్చూ! చెప్పు ఏం జరిగింది? ఎవరేనా నిన్ను ఏమైనా చేశారా? చెప్పు! వాడి అంతు చూస్తాను. ఎవరు ఇంత నీచానికి పాల్ప డింది?" మెల్లిగా బతిమాలాడు సైరస్.

'అవును' అన్నట్టు తలూపింది సుపర్ణ. ముఖంమీద నుంచి ఆమె చేతులను తొలగించి ముఖంమీద, గడ్డంమీద, పెదాల మీద వున్న గాట్లను ఆశ్చర్యంతో చూశాడతను. ''ఏమిటీ గాట్లు?'' గట్టిగానే అడిగాడు. పట్టలేని కోపావేశంతో సైరస్ కంఠం కీచుమంది.

ఆమె సమాధానం చెప్పలేదు. అతను హఠాత్తుగా ముందుకు వంగి ఆమె కను బొమల మీద ముద్దు పెట్టుకున్నాడు. ''బచ్చూ! చెప్పు నువ్వు అలా మౌనంగా కూర్చుని నన్ను అయోమయంలో పడెయ్యకు. నేను నీ స్నేహితుడిని. ఎప్పటికీ నిన్ను ప్రేమిస్తూనే వుంటాను. నేను బతికున్నంతవరకూ నీమీద ఈగని కూడా వాలనివ్వను.''

అప్పటికీ ఆమె మౌనంగానే వుండి పోయింది. వెంటనే అతనికి ఏదో జ్ఞాపకం వచ్చింది. ఆ వెధవ పని ఎవరు చేసి ఉంటారో అతను ఊహించాడు. నిజం చెప్పటానికి సుపర్ణ భయపడుతోందను కున్నాడు. ''విజయ్ కదూ!'' ఆతృతగా అడిగాడతను. ''అవును''అంది నీరసంగా. వెంటనే మళ్ళీ ఏడుపు మొదలుపెట్టింది.

సైరస్ హృదయంలో ప్రతీకారవాంఛ తలెత్తింది. ''ఆ వెధవ నీమీద చెయ్యి వేసాడా? ఇంత ఘోరంగా హింసిసాడా?'' పళ్ళు పటపటకొరికాడతను. ''ఎవరితో నైనా చెప్పావా?'' లేదన్నట్లు తలూపింది సుపర్ణ.

సర్వరు ప్లేటుతో టీ, పకోడీలు తీసుకు వచ్చాడు. టీని కప్పులో పోస్తూ "రేప్ చేసేశాడా" అన్నాడు, ఆ మాటలలో తన కసినంత పలికిస్తూ.

"లేదులేదు! ప్రయత్నించాడు"

"అయితే ఈ విషయం మీ అమ్మకు చెప్పాలి!"

"వద్దువద్దు! అమ్మకి విషయం తెలియ కూడదు" గాభరాగా అందామె. ''ఏం? మీ అమ్మ బాధపడకూడదనా?" కోపంగా అడిగాడు సైరస్.

"నాకు అదేం తెలియదు" అందామె. తన తల్లి విజయ్‌తో ప్రేమలో పడిందని సుపర్ణకు తెలుసు. విజయ్ కూడా ఆమెను తలమునకలుగా ప్రేమించాడనీ తెలుసు. కానీ అలాంటివాడు ఒళ్ళు తెలియకుండా సుపర్ణను బాధపెట్టాడు. ఆమెకు విజయ్‌పై జాలి కలిగింది. డాక్టరుకు పేషెంటుమీద కలిగే జాలిలాంటిదది. కానీ సైరస్‌ని ఎలా సముదాయించడం? సైరస్ ఎప్పుడూ హుందాగా, పెద్దమనిషి తరహాగానే ప్రవర్తించాడు. విజయ్‌లాంటివాడిని అతను ఉపేక్షించలేడు. 'నేను ఇక్కడికి రాకుండా ఉండవలిసింది' అనుకుంది సుపర్ణ.

"కనీసం నువ్వు ఇక్కడికి వస్తున్నట్టు మీ నాన్నగారితోనయినా చెప్పావా?"

"లేదు! నేను కేవలం నిన్ను చూడటానికే వచ్చాను. ఒకటి రెండు రోజులు ఏదేనా చిన్న హోటలులో వుండి ఆ తరువాత లక్నో వెళ్ళిపోదామని నా ఉద్దేశం. నా ఇబ్బందులు, సమస్యలతో నాన్నగారిని ఎందుకు నొప్పించటం?"

"మరి మీ కాలేజీ ప్రిన్సిపాల్‌తో ఏమని చెప్పావ్?"

"మా అమ్మను చూడటానికి వెళ్ళాలన్నాను. అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా మెక్సికోలో జరిగే సభలకు అమ్మ వెళ్ళిందికదా! విదేశాలకు వెళ్ళేలోగా అమ్మనోసారి చూడాలనుకుంటున్నానని చెప్పాను! అంతే!"



'అలాగా' అన్నట్టు తలూపాడు సైరస్. హోటళ్ళలో ఉండటం కంటే సుపర్ణను ఇంటిదగ్గర ఉంచటమే మంచిదని పించిందతనికి. "బయట ఏ హోటల్‌లోనో ఉండటం అంత మంచిది కాదు. ఇంటికి వెళ్ళిపోదాం! బెంగపెట్టుకుని చూడటానికి వచ్చావని నాన్నగారితో చెప్పు. ఆయన నీ కలలోకి ఏచ్చారనో ఏదో సాకు చెప్పు"

మొత్తానికి సుపర్ణ ఇంటికి వెళ్ళింది. బాత్‌రూమ్‌కు వెళ్ళి నగ్నంగా స్నానం చేసింది. 'సాయంత్రం నాన్న ఇంటికి రాగానే ఏమని చెప్పాలి?' ఆలోచించ సాగిందామె.

మధ్యాహ్నం కాలింగ్ బెల్ మోగగానే సైరస్ వచ్చి ఉంటాడనే ఉత్సాహంతో ఒక్క ఉదుటన వెళ్ళి తలుపు తీసింది. కాని గుమ్మంలో నిలబడిన వ్యక్తి సైరస్ కంటే పెద్దవాడు అందంగా ఉన్నాడు. "విజయ్ నువ్వా!" అంది సుపర్ణ ఆశ్చర్యపోతూ ఒక్కడుగు వెనక్కు వేసి.

"నేనే డార్లింగ్! రావలిసి వచ్చింది మరి. నువ్వు బొంబాయి వచ్చావని మీ కాలేజీలో చెప్పగానే నేను చేసిన వెధవ పని గురించి మీ అమ్మ నాన్నగారితో చెప్పటానికి వచ్చి ఉంటావని కంగారుపడి వెంటనే నేనూ వచ్చేశాను"

"ఏం భయపడకు! ఇంకా చెప్పలేదులే. వాళ్ళని నేనసలు కలవనేలేదు. మమ్మీ ఢిల్లీలో మెక్సికో వెళ్ళే ప్రయత్నాలలో ఉంది. డాడీ ఇంకా ఆఫీసు నుంచి ఇంటికి రాలేదు"

"అమ్మయ్య!" తృప్తిగా ఊపిరి పీల్చి డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్నాడు విజయ్. సుపర్ణకూడా అతని ఎదురుగా కొంచెం దూరంలో కూర్చుంది అతను ఆమెను కాసేపు పరిశీలనగా చూసి "నువ్వు చాలా అందంగా ఉన్నావు" అన్నాడు. ఆమె మందహాసం చేస్తూ "ఆ మాటలు మనసులోంచి వచ్చినవి కావు" అంది. "నువ్వు చెప్పింది నిజమే!" నేనెప్పుడూ నిజాన్ని చెప్పను. సరైన పనులు చెయ్యను" అన్నాడు విజయ్. "ఆహా! అందులో సందేహమా! నువ్వెంత దుర్మార్గుడివో నాకు తెలియదు" ఎత్తి పొడిచింది ఆమె. "నేనంత దుర్మార్గుడినా?" అడిగాడు విజయ్ లాలనగా గొంతు తగ్గించి.

"ఏమో! నాకు మాత్రం ఏంతెలుసు?" అందామె. అతను సుపర్ణను ముద్దు పెట్టుకోవటానికి లేచినపుడు "నువ్వెలాంటి వాడివైనా నాకేం భయం" అంది గుసగుసగా.

"మైడార్లింగ్! నువ్వులేకుండా నేను బతకలేను! ఈ క్షణంలో నువ్వు నాతో వచ్చెయ్యి! సిమ్లా పోదాం! కొంత కాలం పాటు ఇద్దరమూ హాయిగా ఉందాం! మనం పెళ్ళిచేసుకుందాం! మన జంటను చూసి ప్రజలు అసూయపడేలా జీవిద్దాం" అన్నాడతను ఆమె ఒంపులను మృదువుగా స్పృశిస్తూ, బలంగా హత్తుకుంటూ.

"సైరస్‌కు చెప్పకుండా విజయ్‌తో లేచిపోతే..." అనుకుందామె. అంతలోనే తన విపరీతపు ఆలోచనలకు భయపడింది. బహుశా ఆమె విజయ్‌తో సిమ్లా వెళ్ళే తల్లి దండ్రులతో ఉన్న సంబంధాలు తెగిపోతాయేమో! సొంత అమ్మానాన్నే ఆమెను నిరాదరిస్తారేమో! కాని అవేమీ తను పట్టించుకోదు. ఇప్పుడామెకు కావలిసింది విజయ్ తీయని స్పర్శ! తన పెదవులపై అతని పెదవులు...తనకు అభిముఖంగా

అతని శరీరం... అతను తన తల్లి ప్రియు డైనా ఆమెకు పట్టింపేమీలేదు. ఆమె పతనమై పోవటానికే సిద్ధపడింది.

ఇదివరకు సిమ్లాలో మానసితో కలిసి పడుకున్న హోటల్లో...అదేగదిలో...అదే మంచంమీద విజయ్ రాజే ఆమె కూతురు సుపర్ణతో సుఖించాడు. ఆ గది కిటికీ లకు ఉన్న తెరలు అప్పటివే! అక్కడ ఉన్న పూలనుంచి వస్తున్న సుగంధం కూడా అప్పటిదే! బయట పొగమంచు పట్టేసిన సమయంలో సుపర్ణ పక్కలోంచి లేచిన విజయ్ ఆమెనుచూసి ఆశ్చర్య పోయాడు. 'అరే మానసి అనుకున్నానే' అన్నట్టుగా ఉన్నాయి అతని చూపులు. సుపర్ణ ఇంకా నిద్రపోతూనే ఉంది. ఆమె జుట్టు వదులు వదులుగా ఉండి గాలికి మెల్లగా కదులుతున్నాయి. ఆమె బిగు వంతా సడలిపోయినట్లుంది. అప్పటి ఆమె స్థితి అతనికి మానసిని జ్ఞాపకం చేసింది.

ఇరవయి ఏళ్ళ క్రితం మానసి కూడా ఇలాగే వుండేది. ఆమెను తను ఎంత గాఢంగా ప్రేమించాడు! కాని మానసి అతని అన్నను మాత్రమే ఆరా ధించేది. రాజే సుపర్ణను లేవదీసి హృద యానికి హత్తుకొని ఆమె చెవిలో "డార్లింగ్! మెలకువ తెచ్చుకో! చూడు ఎంత పొద్దుపోయిందో!" అంటూ గుస గుస లాడాడు.

మూడు రోజుల తర్వాత విజయ్ ఢిల్లీ వెళ్ళిపోయి రాజకీయాల్లో మునిగి పోయాడు.

* * *

ఢిల్లీ వచ్చి రాగానే ప్రధానిని కలిశాడు విజయ్. ఆయన ఇంచు మించు అప స్మారకపు దశలో వున్నాడు. ఆయనకు అప్పుడప్పుడు ఇలా భరించలేని తల నొప్పి వచ్చి పిచ్చెక్కించేస్తుంది. ఏదేదో అసందర్భంగా మాట్లాడుతూ తల గడ మీద తలను అటు ఇటూ దొర్లించ సాగారు.

ఆత్రుతగా ఆయన వైపు చూస్తూ "ఏమైంది" అని ఆశ్చర్యపోయాడు విజయ్. "తాగారా? మానసి ఏమయినా అనరాని మాటలందా? లేకపోతే మరో రకంగా ఆయనని బాధ పెట్టిందా?" విజయ్ ఓ కుర్చీని ప్రధాని మంచం దగ్గరకు లాక్కొని కూర్చుని ఆయన చెయ్యి పట్టు కున్నాడు. ఆయన చెయ్యి జిడ్డుగా వుంది.

"ఏం జరిగింది?"

ప్రధాని తల పైకెత్తి తిరస్కారంగా అతని వైపు చూశారు.

"నువ్వు నన్ను మోసం చేశావ్!నువ్వు ఇక్కడ వుండవలసిన సమయంలో ఎక్క డికో మాయమైపోయావ్! సదాశివరావు మరణం గురించి ప్రజలు ఏం చెప్పు కొంటున్నారో, తెలుసా? నేనే ఆయనని హత్య చేయించానుట!"

"కాని మీరు నిజంగా హత్య చేయించ లేదు కదా!" అన్నాడు విజయ్ శాంతంగా

"నీకు తెలుసు నేనెలాంటి వాణ్నో! నేనెవ్వరినీ ఎప్పటికీ చంపలేను. నేను సదాశివరావుని ఎప్పుడూ అగౌరవ పరచ లేదు, నీచంగా మాట్లాడలేదు. నువ్వే ఆయన మీద లేనిపోని నిందలు వేసి, ఆయన అవినీతిపరుడని చెప్పి, వ్యభిచారి అని ముద్రవేసి నన్ను తప్పు దోవ పట్టించావు! ఆయనంటే నాకు ఎప్పుడూ అభిమానం వుంది. ఆయన మా నాన్న గారి స్నేహితుడు. సదాశివరావుని పిన

తండ్రిలా గౌరవించేవాడిని నేను. అలాంటి సాధువు గురించి నాకున్న సదభిప్రాయాన్ని విషతుల్యం చేశావ్! ఆయన చసే బాగుండునని నేను పదే పదే అనుకునేలా చేశావ్! దీనికంతటికీ కారణం నేనే" తానే నిందితుడినన్నట్లు మాట్లాడారాయన.

"ఇదిగో! చూడండి! ఇలాంటి కబుర్లు ఇంకెవరితోనూ అనకండి! మీకు మతి స్థిమితం తప్పిందనుకొనే ప్రమాదం వుంది! అంటే మీ తిట్లు శాపనార్థాలు ఆయనను చంపేశాయంటారా?" రొక్కిస్తున్నట్లు అడిగాడతను.

"ఇంతకీ సదాశివరావును చంపిందెవరు? ఆ విషయం తెలుసుకోవలసిన అవసరం నాకు వుంది!"

"నిందితుడు ఇంకా దొరక లేదు. బాంబు పేలినపుడు ఆయనకు బాగా గాయాలు తగిలి ఆసుపత్రిలో చేరారు. అవి ఏ సెప్టిక్ అవటంవల్లనో ఆయన ఆసుపత్రిలోనే మరణించి వుండవచ్చు! విచారణ జరిపిస్తున్నాం. బహుశా ఒకటి రెండు నెలల్లో ఆయన మరణానికి కారణమైన వ్యక్తిని పట్టుకోవచ్చుననుకుంటా"

"ఇంక కట్టిపెట్టు నీ నంగనాచి కబుర్లు! నీకు తెలుసు ఆయనని ఎవరో హత్య చేశారని! ఎవరికి అప్ప చెప్పావా పని?" అనుమానంగా అడిగారు ప్రధాని.

"ఏమిటి మీరనేది? మీకివాళ ఏదో పిచ్చెక్కినట్టుంది. సదాశివరావు చాచాని నేనెందుకు హత్య చేయిస్తాను. ఆయన నన్ను కొడుకులా ఆదరించాడు. ఈ రాజకీయ పరిజ్ఞానమంతా నేను ఆయన దగ్గరే నేర్చుకున్నాను"

"ఇవాళ ఎవరో ఓ కుర్రాడు వచ్చాడు నా దగ్గరకి. బొంబాయి నుంచి కేవలం నన్ను చూసి నాలుగూ దులిపెయ్యటానికి వచ్చాడట. పార్సీ కుర్రాడిలా వున్నాడు. అతని పేరు సైరస్ కంట్రాక్టరట. సదాశివరావు ఆసుపత్రిలో ఉన్నంతకాలమూ ఆ కుర్రాడు ఆయనతోనే ఉన్నాడుట. సదాశివరావు చనిపోయేనాటికి చాలా ఆరోగ్యంగా ఉన్నాడట. మర్నాడో ఆ తర్వాత రోజుకో ఆయనని డాక్టర్లు ఆసుపత్రినుంచి డిశ్చార్జ్ చేద్దామనుకున్నారుట"

"ఎవడా కుర్రాడు? అతడిని లోపలికి ఎవరు రానిచ్చారు? అలాంటి కొత్త వ్యక్తులను మీరు కలుసుకో కూడదు. మీరు ప్రమాదంలో చిక్కుకోవలసి వస్తుందండీ! అతను కత్తి బయటకు తీసి మిమ్మల్ని హత్యచేస్తే? రక్షణ ఏర్పాట్లు మరింత కట్టుదిట్టం చేయమని చెప్తానండి! ఆ కుర్రాడిని మీ దగ్గరకు పంపించిన వాళ్ళని క్షమించకూడదు" కంగారు పడుతూ అన్నాడు విజయ్.

"అతను పూర్తిగా కొత్తవాడు కాదులే! మానసి ఇంటి పక్కనే ఉంటున్నాడట. మానసి కూతురుతో అతనికి పెళ్ళి నిశ్చయమైందిట" వివరాలు కూడా తెలిపారు ప్రధాని.

"ఏమిటీ? అతను అలా అని చెప్పాడా?" అనుకోకుండానే విజయ్ పిడికిలి బిగిసింది.

"అవును! వాళ్ళిద్దరూ త్వరలోనే పెళ్ళి చేసుకోబోతున్నట్లు చెప్పాడు"

"అది అసాధ్యం!" గట్టిగా అరిచాడు విజయ్!

"మానసి కూతురు నన్ను ప్రేమించింది. గడిచిన మూడురోజులూ మేమిద్దరం

సిమ్లాలో గడిపి వచ్చాం. బహుశా ఆ కుర్రాడు సుపర్ణను పెళ్ళి చేసుకోవాలని అనుకుని ఉంటాడు. ఈ అమ్మాయి కాదని ఉంటుంది. ఆ ఉక్రోషంతో ఈ రకంగా లేనిపోని పుకార్లు పుట్టించి నా మీద పగ తీర్చుకోవాలని చూస్తున్నట్లున్నాడు !" కసిగా అన్నాడు విజయ్.

"కాని అతను నిన్ను హంతకుడని అన్లేదే! నన్ను తిట్టాడు. నేను చేసిన తప్పుల్ని ప్రజల సమక్షంలో అంగీకరించి పదవికి రాజీనామా చేయమని ఒత్తిడి చేశాడు. లేకపోతే నా నిజస్వరూపం బయట పెడతానని బెదిరించాడు ... ఓహ్ విజయ్! అతని కళ్ళలో ప్రతిబింబించినంత అసహ్యం ఎవరి ముఖంలోనూ చూడలేదు నేను. అతను నా కళ్ళలోకి తీక్షణంగా చూస్తుంటే నాకు మోకాళ్ళలోంచి వణుకు పుట్టుకొచ్చింది. అతన్ని చూస్తేనే భయం వేసింది నాకు"

"మీరు అనవసరంగా కంగారు పడకండి. అతని విషయంలో నేను తగిన జాగ్రత్తలు తీసుకుంటాను. అలాంటి వాళ్ళు దేశంలో చాలా మంది ఉన్నారు. వాళ్ళంతా నక్సలైట్లు. మనం శాంతి, శాంతి అని అఘోరిస్తోంటే వాళ్ళు రక్తపాతం కావాలని కోరుకుంటారు. ఇప్పటికే ఎంతోమంది జైళ్ళలో మగ్గుతున్నారు. కాని ఇంకా చాలామంది బయట ఉండి పోయారు. నేనేకనుక హోం మంత్రినై ఉంటే వాళ్ళందరినీ జైళ్ళలో కుక్కించి ఉంచేవాణ్ణి. ఇప్పుడున్న హోంమంత్రి ఏమంత సమర్థుడుకాడు, పట్టించుకోవలసిన విషయాలని పట్టించుకోడు. మంత్రి వర్గంలోకి తీసుకునే ముందు వాళ్ళందరి మంచి చెడ్డలూ, సామర్థ్యం తెలుసుకోకుండానే వాళ్ళకా పదవులు ఇచ్చేశారు మీరు" నిందంతా ప్రధాని మీదే పడేశాడు విజయ్!

"పోనీ మంత్రి వర్గాన్ని పునర్వ్యవస్థీకరిద్దాం!" హోం మంత్రికి రక్షణశాఖ ఇద్దాం"

"అది మరో పెద్ద తప్పు! ఆయనకి యుద్ధాలంటే గిట్టదు. రక్షణశాఖని ఎవరేనా కర్కోటక మన స్తత్వం ఉన్న వాళ్ళకి ఇవ్వాలి. మీరు ఊఁ అంటే మానసి ఆ శాఖని బ్రహ్మాండంగా నిర్వహించగలదు" అన్నాడతను పెద్దగా నవ్వుతూ. "అదేమిటి! మానసిని పట్టుకొని అంత పెద్దమాట అంటున్నావు?" ఆశ్చర్యపోయారాయన. ఒకానొకప్పుడు ఆవిడ కూడా నక్సలైటే. నక్సలైట్లు నడిపే పత్రికల్లో ఆవిడ రాసిన వ్యాసాలు నేనూ చదువుతూ ఉండే వాడిని. దొంగను పట్టుకోవటానికి దొంగనే నియమించాలి"

"బహుశా మానసికి హోం శాఖ ఇవ్వొచ్చేమో!" సాలోచనగా అడిగారు ప్రధాని.

"అది మీ ఇష్టం మీద ఆధారపడి ఉంటుంది" అన్నాడు విజయ్ తన బాధ్యతేమీ లేనట్టు. హఠాత్తుగా ప్రధాని మీద అతనికి కోపం వెల్లువలా ముంచుకు వచ్చింది. అసహనంతో కంపించి పోయాడు. తాను ఆడుతున్న నాటకం తనకే వెగటనిపించింది. 'ఈ మధ్య ఈ ముసలాడు వృద్ధనారిలా పతివ్రత కబుర్లు చెబుతున్నాడేమిటి ?" అనుకున్నాడు. ప్రధాని దగ్గర్నుంచి వస్తున్న వాసనని కనిపెట్టాడతను. అదో రకమైన సుగంధం ఆ గదంతా వ్యాపించి ఉంది.

ప్రధాని నిదానంగా తల పైకెత్తి "విజయ్! అయామ్ సారీ! నీ మీద అనవ

సరంగా కోప్పడ్డాను" అన్నారు. "దాండే ముంది లెండి" అంటూ హోరాహోరీగా దెబ్బలాడుకున్నాక పిల్లలు ఒకరికొకరు చేతులు కలుపుకొని నవ్వుతూ స్నేహంగా వెళ్ళిపోయినట్లు షేక్ హాండ్ ఇచ్చాడు విజయ్.

మానసికి మీ పెళ్ళి గురించి తెలుసా" అడిగారు ప్రధాని.

"తెలియదు! ఆమె మెక్సికో నుంచి తిరిగి వచ్చాక చెబుతాం. బహుశా ఆవిడకి నేను అల్లుణ్ణి కావటం ఇష్టం ఉండదేమో! నా వయసు ఇంచుమించు సుపర్ణ తండ్రి కున్నంత ఉంటుంది కదా"

"నేను ఆమెను ఒప్పిస్తాలే! నువ్వే సుపర్ణకు తగినవాడివి" నవ్వుతూ అన్నారాయన. "అవును ఆవిడని మీరే ఒప్పించగలరు. ఇపుడు మానసి పూర్తిగా మీ స్వాధీనంలో ఉంది కదూ!" వ్యంగ్యంగా అన్నాడతను.

ప్రధాని మనస్ఫూర్తిగా నవ్వు కున్నాడు. ఆయన తలనొప్పి ఎగిరి పోయింది. "రా విజయ్! మనం ఓ రెండు పెగ్గులు వేసుకుందాం! ఇలాంటి సమయంలో స్కాచ్ లాంటివే మనకు దాహం తీర్చగలుగుతాయి" ఆహ్వానించా రాయన.

"ఒక్క పెగ్గు చాలు నాకు! నేను విపరీతంగా అలిసిపోయాను. పెంద్రాళే ఇంటికి వెళ్ళి కాసేపు విశ్రాంతి తీసు కోవాలి" మొహమాట పడ్డాడతను.

విజయ్ రాజే ఇంటికి చేరేసరికి రాత్రి పది దాటింది. అతను ఎంత తాగాడో అతనికే తెలియదు. తలంతా దిమ్ముగా ఉంది. పని మనుషులంతా వెళ్ళిపోయారు. బూట్లు ఎలాగోలా విప్పేసి పడకగదిలోకి నడిచాడు. లైటు వేసే ఉంది. అతని మంచంమీద దేవతలా సుకుమారంగా ఉన్న ఓ అందగత్తె కూర్చుని ఉంది. ఆమె అతనికి పూర్తిగా అపరిచితురాలే.

"ఎవరు నువ్వు!" అడిగాడతను. ఆమె సమాధానం చెప్పలేదు. "ఎవరు పంపారు నిన్నిక్కడికి?" ఆమె అలాగే మౌనంగానే ఉండిపోయింది!

ఆమె హేండ్‌బేగ్‌లోంచి ఓ ఉత్తరం తీసి అతనికి ఇచ్చింది. అది కృష్ణన్ రాసిన ఉత్తరం 'అనాథ శరణాలయం నుంచి ఈ మూగపిల్లను ఇక్కడికి పంపాడా?' అనుకున్నాడతను. కృష్ణన్ లాంటి దౌర్భాగ్యుణ్ణి చేరదీసి తనకు తానే అవినీతిపరునిగా మారిపోయాయని బాధ పడ్డాడు విజయ్. అతను ఇప్పుడు సుపర్ణ ప్రేమలో తల మునకలుగా ఉన్నాడు. ఇంకెంత మాత్రం మరో ఆడదాన్ని స్పృశించాలని కలలో కూడా అనుకో వటం లేదు.

"లేచి ఇక్కడినుంచి వెళ్ళిపో!" అన్నా డామెను ఉద్దేశించి. కాని ఆమె విజయ్‌ని వాటేసుకొని ముద్దు పెట్టుకుంది. ఆమె నోరు ఉల్లిపాయల వాసన వేసింది. బలవం తంగా విదుల్చుకొని "ఫో ఇక్కడినుంచి" అని అరిచాడు. మరుక్షణంలో 'చెవిటి దానికి ఎంత గట్టిగా అరిచి చెప్తే మాత్రం ఏం లాభం' అనుకున్నాడు. ఆమె మెడ పట్టుకొని గది బయటకు తోసేశాడు.కాని ఆ అమ్మాయి మహంకాళిలా ఉరిమి చూసింది. ఆమె కళ్ళలోంచి నిప్పులు రాలాయి. హఠాత్తుగా అతని మీదపడి ముఖాన్ని రక్కెయ్యటం ప్రారంభించింది.

ఆమెకు జరిగిన అవమానమే ఆమె చేత అలా ప్రవర్తింపజేసింది. రాజే ఆమె

బారినుంచి తప్పించుకుందామని తీవ్రంగా ప్రయత్నించాడు. ఆమె అతని మీద కూర్చుని తన వలువలనన్నిటిని ఒకదాని తరవాత ఒకటి ఒలిచేసుకొంది. ఆమె శరీరం పరిపుష్టంగా ఉంది. అనుభవ యోగ్యంగా ఉంది. కాని అతను ఆమె అంటే భయపడిపోయాడు. అలాంటి పరిస్థితిలో విజయ్‌కి ఏ ఉద్రేకమూ కలగ లేదు. ఎలాగో ఒకలా ఆమెను వదిలించుకోవాలనుకున్నాడు. ఆమె మృదువైన చేతులు తన శరీరం మీద లేకుండా ఉంటే చాలనుకున్నాడు.

అతని చేతులు ఆమె అందమైన మెడ చుట్టూ బిగుసుకున్నాయి. విరిగిన కొమ్మ మీద ఉన్న పువ్వులా ఆమె తల కిందకు ఒదిగిపోయింది. ఆమె ముక్కు నుండి రక్తం కారింది. విజయ్ ఆ అమ్మాయి నాడి చూశాడు. 'అరే! చనిపోయిందా' అనుకున్నాడు. అసలే తాగి ఉన్నాడు. పైగా భయపడిపోయాడు. కంగారు కంగారుగా ఆమె శవాన్ని ఓ దుప్పటిలో చుట్టి కారు దగ్గరకు తీసుకుపోయాడు.




ఢిల్లీ నగరమంతా గగ్గోలు గగ్గోలుగా ఉంది. పత్రికలన్నీ ప్రధానిని దుయ్యబడుతున్నాయి. ఎవరినోట విన్నా ఒకటే మాట. "సక్సేనా చనిపోయారు! ప్రధానమంత్రే ఈ ఘోరం చేయించారు" అంటూ గోరంతలను కొండంతలుగా రాసే పత్రికా ప్రతినిధులు చెవులు కొరుక్కోసాగారు.

పొద్దున్నే పేపర్లు ముందేసుకొని టిఫిను చేయటానికి కూర్చున్న ప్రధానికి కొడుకు లేనిలోటు స్పష్టంగా తెలిసివచ్చింది. ఆయన కొడుకు ముఖేష్ ఫరీదాబాద్‌లో ఓ స్నేహితుని ఇంట్లో ఉంటున్నాడు. అతను ఓ పెట్రోలు బంకు యజమాని. రోజూ సాయంత్రం పూట మస్తుగా తాగేసి ఆ వీధిలో ఉండే అమ్మాయిలను అల్లరి పెడుతుంటాడు.

తనను క్షమించమని ప్రధాని రాసిన ఏ ఉత్తరానికీ ముఖేష్ నుంచి జవాబు రాలేదు. తండ్రిని అతడు తీవ్రంగా అసహ్యించుకుంటున్నాడనేది సుస్పష్టం. మానసి బొంబాయిలో ఏదో సొంత వ్యవహారాలు చూసుకోవటానికి వెళ్ళింది. ఆయనకు తోడు ఎవరూ లేరు. ఆఖరికి ఇలాంటి సమయాల్లో ఏదైనా సలహా చెప్పగల విజయ్ కూడా ఎక్కడికో వెళ్ళాడు.

'విజయ్ ఉంటే ఈ పత్రికా సంపాదకులందరికీ తగినట్లు బుద్ధి చెప్పేవాడు' అనుకున్నారు ప్రధాని. సహజంగా చనిపోయిన సక్సేనాను ఎవరో హత్య చేశారంటారేమిటి ? గుండె ఆగిపోవటం వల్ల సక్సేనా మరణించాడని డాక్టర్లు చెబుతూనే ఉన్నారే! సక్సేనా కూతురు రోహిణిని ఊరడించటానికి మొట్టమొదటగా వెళ్ళిన వ్యక్తి ప్రధానమంత్రే!

పెళ్ళి కాకుండా గర్భవతైనా సరే రోహిణి ఏ అఘాయిత్యానికీ పాల్పడ లేదు. 'పిల్లలను కనటం స్త్రీ సహజం' అనుకొని పురుడు పోసుకోవటానికి నిర్ణయించుకొంది. ఇబ్బందికరంగా వున్న

ఆ నిశ్చయానికి రోహిణి తండ్రి బెంగ పెట్టుకొన్నాడు. ఆమెకు నెలలునిండాయి. పాప పుట్టింది. బంధువులు, స్నేహితులు ఆమె పరిస్థితిని అర్థం చేసుకొని సరిపెట్టుకొన్నారు.

సక్సేనా శవాన్ని చూడటానికి వెళ్ళిన ప్రధానికి లోపలి గదిలో పాప ఏడుపు వినిపించింది. అవ్యక్తాను బంధం ఏదో ఆయనని ఆ పాప వైపు నడిపించింది. పాప ముద్దుగా ఉంది. తన తల్లి నోట్లోంచి ఊడి పడిందేమో అన్నంత అందంగా ఉంది. ప్రధాని తల్లి పెషావర్ అందాల రాణి. పాపను జాగ్రత్తగా ఎత్తుకున్నారాయన. పాప తలమీద నల్లని జుట్టు ఉంగరాలు తిరిగి ఉంది. ఆయనను చూసి పాప నవ్వులు ఒలక బోసింది.

"పాపని గులాబ్ అని పిలు" అన్నారు ప్రధాని రోహిణితో. ఆమె ఆయన పక్కనే కూర్చుని ఉంది.

ఇంట్లో శవం ఉందనీ, అంత్యక్రియలకు ఏర్పాట్లు చేయాలనీ ఆ ఇద్దరూ ఒకటి రెండు క్షణాలు మరచి పోయారు. ఇంట్లో బంధువులు తిరుగుతున్నారనీ, వారంతా తామేం చేస్తున్నారో చూస్తున్నారనే ధ్యాస కూడాలేదా ఇద్దరికీ.

"గులాబ్ అనా? ఎందుకు?" అడిగింది రోహిణి. "అది మా అమ్మ పేరు. పాప అచ్చు మా అమ్మలా ఉంది" అంటూ నవ్వారాయన. రోహిణి కూడా విషాదంగా నవ్వి తలూపింది. ఆయన కూడా కంట నీరు పెడుతూ ఆమె తల మీద ఆప్యాయంగా నిమిరాడు. చెప్పలేని బాధతో వెంటనే హడావుడిగా బయటకు వచ్చి మిగిలిన బంధువుల్లో కలిసిపోయారు.

పత్రికలు చదువుతున్నా ఆయన ఉద్వేగాన్ని అదుపు చేసుకోలేకపోయారు. సక్సేనా అంత్యక్రియలు ఆయనకు పదే పదే జ్ఞాపకం వచ్చాయి. తన కొడుకు చేసిన తప్పుని ఆయన సరిదిద్దుదామనుకున్నారు. రోహిణిని తన ఇంటికి తీసుకు వచ్చేసి ఆమె తన కోడలని బాహాటంగా పదిమందికి చెబుదామనుకున్నారు. తన తల్లి పోలికలన్నీ పుణికి పుచ్చుకొని పుట్టిన పాప ఎప్పటికీ తన వద్దే ఉండి పోతుందని భావించారు. ఆ పాప తన దగ్గిరే పెరుగుతూ తన ఇంటినినవ్వులతో నింపేస్తుందని సంతోషించారు.

తన ఉద్దేశం ఇదీ అని రోహిణితో చెప్పినపుడు అలా చేయటానికి ఆమె అంగీకరించలేదు. సొంత ఇంట్లో తప్ప మరెక్కడా ఉండబోనని ఖచ్చితంగా చెప్పింది.

ముఖేష్‌కి తాను అక్కరలేనపుడు అతని ఇంటి పేరు పాపకి పెట్టవలసిన అగత్యం అంతకంటే లేదంది. సక్సేనా వంశాంకురంగానే పాప పెరుగుతుందనీ,ఆ పేరే ఆమె ఇంటి పేరుగా వుంటుందనీ చెప్పింది రోహిణి.

అదే సమయంలో మానసి కూడా ప్రధానిని మనస్తాపానికి గురి చేసింది. ముఖేష్‌కీ, సుపర్ణకి పెళ్ళి చేయాలని ఆమె ఉద్దేశం. ఆ మాట వినేసరికి కొన్ని నిమిషాలపాటు ఆయన అవాక్కయిపోయారు. అది కుదరని పని అని ఆమెతో ఎలా చెప్పాలో అర్థం కాలేదాయనకు. ముఖేష్ మూర్ఖత్వం, మొండి తనం గురించి ఆమెకు తెలియదు. కొడుకు ఇంక ఎప్పటికీ తన వద్దకు రాబోడని ఆయనకు తెలుసు.

పోనీ ముఖేష్ సుపర్ణను పెళ్ళి చేసు కోవటానికి ఇష్టపడినా ఆ పెళ్ళికి ఆయ నెలా అంగీకరించగలరు ? ఆ ఇద్దరినీ మనస్ఫూర్తిగా ఎలా దీవించగలరు ? విజయ్ స్వయంగా ఆయనతో చెప్పాడు తాను సుపర్ణని ప్రేమించానని. ఆయన సుపర్ణతో ముఖేష్ పెళ్ళికి అంగీకరిస్తే తన అంతరంగిక సలహా దారయిన విజయ్‌కి శత్రువై పోడూ? దాంతోపాటు, మానసి అనుకుంటున్నట్లు ఈ పెళ్ళి జరిగితే ఇంకెన్ని పుకార్లు బయలుదేర తాయో?

"వద్దు మానసీ వద్దు! ముఖేష్‌తో సుపర్ణ పెళ్ళి జరగటానికి వీల్లేదు" అన్నారు ఆమెను బలంగా హత్తుకుంటూ. ఆమె నుంచి వస్తున్న మంచి గంధం వాసన ఆయనని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. ఆమె ఆయనని విడిపించుకొని అసహనంగా చూసింది. మానసి ముఖం రోషంతో ఎరుపెక్కింది. "ఏం! ఎందు కని? సుపర్ణకు ఏం తక్కువయింది? మీ కోడలుగా రాతగ్గంత అందంగాలేదనా? మీ వంశమంత మంచి వంశంలో పుట్ట లేదనా?" ధాటిగా అడిగిందామె.

తప్పని పరిస్థితిలో ప్రధాని అన్ని విషయాలూ ఆమెతో చెప్పారు. ఆమె కోపం ప్రకోపించింది. "అది అసాధ్యం. విజయ్ నా కూతురును పెళ్ళాడటానికి ఎంత మాత్రం వీల్లేదు. అలా జరగ కూడదు" ఇంచుమించు అరిచిందామె.ఆమె పిడికిళ్ళు బిగుసుకుని తెరుచుకుంటు న్నాయి. ఆమె అంతలా బాధ పడిపోవ టానికి కారణం తెలియక ప్రధాని ఆశ్చర్యపోయారు. రాజేని ఆమె ఇంకా ప్రేమిస్తోందా? ఆమె అతనినే ఆరాధిస్తూ ప్రధాని మనిషిలా నటిస్తోందా? "విజయ్‌ని నువ్వు ఇంకా ప్రేమిస్తున్నావా! నిజం చెప్పు"

"నిజం చెప్పనా? విజయ్ అంటే నాకు పరమ అసహ్యం!" ఆమె ఏహ్యత అంతా మాటల్లో ధ్వనించింది.

"వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవటంలో నాకేం తప్పు కనిపించటం లేదే? విజయ్ వయసెంత? ముప్పై ఆరో, ముప్పై ఏడో? ఇంకా కుర్రాడిలాగే కనిపిస్తున్నాడు. ఆరో గ్యంగానే ఉన్నాడు. పైగా అతనికి బ్రహ్మాండమైన భవిష్యత్తు ఉంది. నా తర వాత బహుశా అతనే ప్రధాని కావచ్చు!"

హఠాత్తుగా ఆమె కింద కూర్చుండి పోయి గుండెలు బాదుకుంది. "అయ్యో! భగవంతుడా! నేనీ మాటలు వినలేక పోతు న్నాను" అంటూ గోల గోలగా ఏడవ సాగింది.

ప్రధాని ఆమె పక్కనే కూర్చుని మానసి తల నిమిరాడు. "ఏం జరిగింది? డార్లింగ్! చెప్పవూ ఈ మాత్రం దానికే ఇలా బెంబేలు పడిపోతున్నావ్ ఏమిటి?" అనునయిస్తూ అడిగారు.

ఓ గంటవరకూ ఆమె నిలదొక్కుకోలేక పోయింది. మొత్తానికి ప్రధాని ఆమెను ఊరడించగలిగారు. "సుపర్ణ విజయ్ రాజేకు కూతురవుతుంది. పినతండ్రి తన అన్నగారి కూతురును పెళ్ళిచేసుకుంటాడా? హుం ! ఇందులో విజయ్‌ని తప్పుపట్టే పని కూడా లేదు'' అందామె.

విజయ్‌కి సుపర్ణతో వున్న బంధుత్వం గురించి ఏమీ తెలియదు. మానసి, అమోల్ మిత్రా ఆ విషయం ప్రపంచానికి తెలియ కుండా దాచిపెట్టగలిగారు. ఇక ఇప్పుడు విజయ్‌కి చెప్పకతప్పదు.

ఖద్దరు చీర మడతలలో ముఖం

దాచుకొని "సోనా! ఎలాగో అలా నువ్వే ఈ గండం గట్టెక్కించు!" అంటూ మళ్ళీ వెక్కివెక్కి భిగ్గరగా రోదించసాగింది మానసి.




అతి కష్టంమీద విజయ్‌తో కొన్ని గంటల సేపు ఒంటరిగా మాట్లాడేలా అవకాశాన్ని సృష్టించుకోగలిగింది మానసి. కానీ ఆమె అతనితో ఏం చెప్పదలుచుకుందో మరచిపోయింది. అయినా ఒకటి రెండు క్షణాల్లో తేరుకోగలిగింది. కండలు తిరిగిన నిగనిగలాడుతున్న విజయ్ శరీరం, తేనె రంగు కళ్ళు ఆమెను ఆ స్థితికి తీసుకువచ్చాయి. ఆ కాస్సేపూ విజయ్‌ని తన కౌగిలిలో ఉంచుకొని, ఒకే పక్కమీద పడుకొని విశ్రాంతి తీసుకుంటే చాలనుకుంది.

కానీ రాజే అందుకు సిద్ధంగా లేడు. అతను కిటికీ దగ్గరగా పడక కుర్చీ వేసుకొని బయట వున్న చెట్టును తదేకంగా చూస్తున్నాడు. వసంతశోభ ఏ మాత్రమూ లేకుండా అస్తిపంజరంలా మోడువారిపోయి వుందా చెట్టు. 'ఇదివరకు నాకు మానసిపై వున్న ప్రేమకు గుర్తా ఈ చెట్టు?' విజయ్ తనలో తానే అనుకున్నాడు.

కేవలం శారీరక వాంఛ తీర్చుకోవటానికి మానసిని స్పృశించినా మహా పాపమే అవుతుంది. పశువులకీ వారికీ అప్పుడు తేడాయే ఉండదు. తల్లిలాంటి దాన్ని పక్కలో పడుకోపెట్టుకోవాలని ఎవరూ అనుకోరు.

విజయ్ ద్వారా పొందిన సుఖాన్ని ఆమె ఎప్పటికీ మరచిపోలేదు. అతను ఆమెను అనుభవించిన ప్రతిసారీ మానసిలో మాతృ సంబంధమైన ఓ కోర్కె తలెత్తుతూ ఉండేది. అతనిలాంటి కొడుకు కావాలనుకొనేది. ఆమె ఏం కోరుకొనేదో అది ఇప్పుడు మానసికి లభించింది. అల్లుడూ కొడుకులాంటివాడే. అతను ఆమె కూతురును ప్రేమించాడు. ఇవాళో రేపో పెళ్ళి చేసుకోబోతున్నాడు.

మానసి మరింత ముందుకు వచ్చి విజయ్‌ని ఉద్రేకపరిచే ప్రయత్నంగా అతనిని కౌగిలించుకొంది. ఆమె చేష్టలకు అతను ఉలుకు పలుకు లేకుండా అలాగే కూర్చుండిపోయాడు. ఆమె అతనిముందు మోకరిల్లి విజయ్ గడ్డాన్ని పట్టుకొని పైకెత్తింది. ఆమె చేతికున్న బంగారు గాజులు తళుక్కుమన్నాయి.

"ఏమిటి ఇవాళ ఇంత మడి కట్టుకొని కూర్చున్నావు?" అడిగిందామె. కుహనాత్మకం కాని నిజమైన తుచ్ఛ కామవాంఛ-తరంగంలా ఆమెలో ఎగిసి ఎగిసి పడింది. ఆ ఉద్దేశాన్ని ఆమె ఆంగిక చర్యల ద్వారా వ్యక్తీకరించింది. అతన్ని బల్లిలా కరుచుకుపోయి మెడవెనుక పైకి ఉంగరాలు తిరిగి ఉన్న పట్టులాంటి జుట్టును ముద్దు పెట్టుకొంది. "మానసీ! ప్లీజ్, దూరంగా ఉండు" నిస్సహాయంగా గొణిగాడతను.

"అయితే అది నిజమేనన్నమాట. ప్రధాని నాతో చెప్పిన విషయం వాస్తవమేనన్నమాట! అవునా?"

"ఆ విషయం సుపర్ణకు సంబంధించినదే అయితే అది నిజమే! ఆమెకు పరీక్షలయిపోయిన వెంటనే మేం ఇద్దరం పెళ్ళి చేసుకోబోతున్నాం. పెళ్ళి గురించి నీకు ముందే చెప్పి ఉండవలసి ఉంది. కాని వ్యవధి లేకపోయింది."

మానసి లేచి నిలబడుతూ "నువ్వు నా కూతుర్ని పెళ్ళి చేసుకోలేవు"

"ప్రధానమంత్రిగారి ఇల్లాలు కాని ఇల్లాలితో ఇదివరకటి నా సంబంధాలు ఎప్పటిలా కొనసాగిస్తాననుకోకు. అలా అనుకుంటే పొరపాటే."

"అందులో నేను చేసిన పొరపాటేముంది? అలా జరగాలని కోరుకున్నది నువ్వు. అందుకు అవసరమైన పన్నాగాలు పన్నిందినువ్వు. మేం ఇద్దరం నీ చేతిలో కీలుబొమ్మలమయ్యాం. సుదూరంలో లేని నీ లక్ష్యాన్ని సాధించుకోవటానికి నన్నో పెద్ద ఎరగా ఉపయోగించుకున్నావ్! ప్రధానికి నన్ను తార్చావు! విజయ్! నువ్వు కాదూ నన్ను పతనం చేసింది?" మానసి ఉద్వేగంతో అడిగింది.

"నువ్వు పతనమయ్యావా? ఇప్పుడీ దేశానికి నువ్వు కొత్త హోంమంత్రివి కాదూ? దేశం మొత్తం మీద అతి భయంకరమైన ఆడదానివి నువ్వు కాదూ? చివరికి ప్రధానమంత్రి కూడా నీ చేతిలో ఆటబొమ్మే! ఆయనను నువ్వు మచ్చిక చేసుకున్నావ్! పసి పిల్లాడిలా మార్చేశావ్! ఇంతా చేసి పైగా నిన్ను నేను పతనం చేశానంటున్నావా? మానసీ! నువ్వు కళ్ళెం వేయని గుర్రానివికాదూ! ఎలాగో ఒకలా ఉన్నత స్థితిలో ఉండాలని కోరుకొనేదానివి కాదూ? అబద్ధమంటావా? చెప్పు!" నిలదీశాడతను.

మానసి మంచం మీద కూర్చుంది. గాలిలోకి చేతులు జోడిస్తూ "భగవంతుడే ఇంక నన్ను కాపాడాలి.! ఇప్పుడు నా చిన్నారి కూతురికి ఏమని చెప్పను? అది మహా అమాయకురాలు. నేను నిజం చెబితే అది తట్టుకోలేదు కూడా!" అంది నిస్సహాయంగా.

"నిజమా? ఏ నిజం గురించి నువ్వనేది?" అన్నాడతను కిటికీవైపు నడిచి ఎటో చూస్తూ. అతని వీపు మాత్రమే ఆమెకు కనిపిస్తోంది.

ఒక్క క్షణంపాటు మానసి మళ్ళీ నిశ్శబ్దంగా ఉండిపోయింది. అతని ఎగు భుజాలను, దృఢంగా సౌష్టవంగా ఉన్న శరీరాకృతినీ చూసి ఆమె నిగ్రహించుకోలేకపోయింది. 'ఈ జంతువు ఎంత ఆకర్షణీయంగా ఉంది' అనుకుందామె. విజయ్‌ని ఆమె మళ్ళీ వలలో వేసుకోగలిగితే తప్ప సుపర్ణకి మోక్షం లేదు.

"విజయ్! ఒక్కసారి నా కోరిక తీర్చవూ! ప్లీజ్! మై డార్లింగ్! విజయ్!" తమకంతో ఆమె కంఠం బొంగురుపోయింది. అతను వెనక్కి తిరిగాడు. సందె చీకట్లో నక్షత్రాల మాదిరిగా విజయ్ కళ్ళు జ్యోతుల్లా మండిపోతున్నాయి! అతని వెనుకనుంచి కనిపిస్తున్న ఏవో చెట్టు కొమ్మలు తనను రారమ్మని పిలుస్తున్నట్టనిపించింది మానసికి. "ప్లీజ్! విజయ్! మరొక్కసారి! ఒకే ఒక్కసారి" అంటూ ప్రాథేయపడింది మానసి విరబోసుకున్న జుట్టును సరిచేసుకొంటూ. కన్నీళ్ళు ఎండిపోయి చారలు కట్టిన ఆమె చెక్కిళ్ళు మళ్ళీ సిగ్గుపడ్డాయి. ఆమెగుండెలు ఉద్వేగంతో ఎగిసిపడుతున్నాయి.

"లేదు మానసీ! నేనాపని చేయలేను. మన ప్రేమ వ్యవహారానికి ఫుల్‌స్టాప్ పడింది" అన్నాడతను. "ఇంక ఎప్పుడూ నా వైపు కన్నెత్తి చూడవా?" ఆమె అడిగింది. తల అడ్డంగా ఊపుతూ "చూడను! జీవితంలో ఇంకెప్పుడూ నీ జోలికి రాను! సారీ మానసీ?" కుండ బద్దలుకొట్టినట్టు చెప్పాడు విజయ్.

ఆమె అహం దెబ్బతింది. మానసికంగా సలిగిపోయింది. ఓడిపోయింది. మంచం మీంచి లేచి నిలబడి జుట్టుముడేసుకుంది. "ఏమైనాసరే నువ్వు సుపర్ణని పెళ్ళి చేసుకోలేవు? అది నీ అన్నకూతురు"

"ఏమిటి నువ్వనేది? అది ఎంత మాత్రం నిజంకాదు"

"కావాలంటే మా ఆయన్ని అడుగు. ఆ విషయం నన్ను పెళ్ళి చేసుకొనేముందే ఆయనకి తెలుసు. నేనెందుకు అమోల్ మిత్రాని అంత హడావుడిగా పెళ్ళి చేసేసుకున్నావో నువ్వు ఒక్కసారైనా, ఒక్కక్షణమైనా ఆలోచించావా? పెళ్ళి నాటికే నేను గర్భవతిని. మీ అన్నయ్య చనిపోయారు. కాని నేను ఆయన్ని చాలా కాలం వరకూ మరిచిపోలేక పోయాను. ఏది ఏమైనాసరే, ఆయన జ్ఞాపకార్థం బిడ్డకు జన్మనిచ్చి తీరాలని నిశ్చయించుకొన్నాను. నువ్వు జాగ్రత్తగా సుపర్ణని గమనిస్తే మీ అన్నయ్య పోలికలు స్పష్టంగా గుర్తుపట్టవచ్చు. ఆయన మాదిరిగానే పొడుగాటి జుట్టు తేనె రంగు కళ్ళు, గులాబీ కంగు శరీరం... దానికి అన్నీ మీ అన్నయ్య పోలికలే వచ్చాయి. నువ్వు సుపర్ణకి పిన తండ్రివి. నువ్వు ఎప్పటికీ దాన్ని పెళ్ళి చేసుకోలేవు"

"ఓహ్! భగవాన్!" గట్టిగా నిట్టూర్చాడతను, "ఈ విషయం సుపర్ణకెందుకు చెప్పలేదు? నాకు మాత్రం ఇదివరకే ఎందుకు చెప్పలేదు? ఆమె ద్వారా నాకు వారసుడు పుట్టబోతున్నాడు! ఇప్పుడు మేమేం చెయ్యాలి?" మధనపడి పోయాడు విజయ్.

ఆ మాటలు విని మానసికి పిచ్చెక్కినట్లయింది. ఆడ పులిలా విజయ్ ముఖాన్ని గోళ్ళతో చీల్చేసింది. ముఖం మీద కాండ్రించి ఉమ్మేసింది. అరిచి బొబ్బలు పెట్టింది. అతను ఆమె నోరు నొక్కెయ్యబోతే "ఛీ! తుచ్ఛుడా! నువ్వు నీతీ జాతీ లేనివాడివి! నా కూతురిని మోసంచేశావు! నిన్ను చంపేస్తాను! పిచ్చి సుపర్ణా! మైడియర్ బచ్చూ! ఓహ్! విజయ్! చిన్న పిల్లని పట్టుకొని పాడుచెయ్యటానికి నీకు మనసెలా ఒప్పింది?" మతి స్థిమితం తప్పిన దానిలా అరిచింది మానసి!

"కాదు కాదు! నేను ఆమెను బలవంతం చెయ్యలేదు. తనంతతానే ఒప్పుకుంది. నీకు ఇందాకే చెప్పాను. మేం ప్రేమించుకున్నాం. మేము..." అతను ఏదో చెప్పబోయాడు "ఇంతలో మనం వెంటనే బచ్చూకి ఎబార్షన్ చేయించాలి!" ఈ విషయం సుపర్ణతో చెప్పాలి. సాధ్యమైనంత త్వరగా చెప్పేయ్యాలి" ఓ నిర్ణయానికి వచ్చినట్టుగా అంది మానసి.

"అలాగే! అదేదో వెంటనే జరిగేట్టు చూడు" అన్నాడు విజయ్ నీరసంగా.

వెళ్తున్నానని చెప్పి విజయ్ గుమ్మం వైపు నడిచాడు. గుమ్మం బయట కొంత మంది మనుషులు గుంపుగా నిలబడి ఉన్నారు. మాసిన బట్టలతో వారు ఎంతో సేపటినుంచి హోంమంత్రి దర్శనం కోసం ఎదురు చూస్తున్నారు. ఆ గుంపులో ఉన్న

వారిలో ఓ వృద్ధుని గుర్తుపట్టి "బినో" అని పిలిచింది మానసి.

"రండి కూర్చోండి! ఏమిటి ఇలా వచ్చారు. ఈ సాయంత్రం పూట?" అంది తెల్ల పేముతో అల్లిన కుర్చీలు చూపిస్తూ.

అతను కూర్చోలేదుకాని "మీకు తెలుసు. మేము ఎందుకు ఇక్కడికి వచ్చామో! మా కామ్రేడ్ కృష్ణమూర్తిని విడుదల చేయించమని అడగటానికి వచ్చాం! ఆయన జైల్లో మహా నరకం అనుభవిస్తున్నారు. పైగా అసలే గుండె జబ్బు మనిషి. ఒకప్పుడు మీకు నక్సలైట్ల మీద సానుభూతి ఉండేది. కృష్ణమూర్తిని మీరు ఎంతో గౌరవించే వారు. ఇప్పుడతన్ని జైల్లో గొడ్డును బాదినట్టు బాదుతున్నారు. ఓ పశువులా ఆయన జైల్లోనే చచ్చిపోతారేమో! అలా జరగకుండా మీరు చూడాలి! కృష్ణమూర్తి మనదేశంలో ఉన్న మహా మేధావులలో ఒకరు. మీరు హోంమంత్రిగా ఉండగా కూడా కామ్రేడ్ కృష్ణమూర్తిని జైల్లో పిచ్చి కుక్కను చూసినట్లు చూశారని ముందు ముందు ఎవరూ చెప్పుకోకుండా చూసుకోండి!" చేతులు జోడిస్తూ అభ్యర్థించాడతను.

మానసి వాళ్ళను కూర్చోమని సైగ చేసింది. ఆ సాయంత్రం తనను చూడటానికి మగాళ్ళు కొందరు వస్తారని ఆమె ఊహించ లేదు. అందువల్ల తన అంగ రక్షకులను పంపించేసిందామె. ఒకప్పుడు ఈ చింకి పాతరాయళ్ళు ఆమెను కామ్రేడ్ మానసి అని వ్యవహరించేవారు. ఇప్పుడామె తీరం చేరిపోయింది. ఇప్పుడామె పాలకురాలు. నల్ల బజారు యజమానులకీ, బడా పారిశ్రామిక వేత్తలకూ స్నేహితురాలు.

"బినో! మూర్తిని అంత ఘోరంగా ఏమీ చూడటం లేదు. మీరు ఏవో గాలి కబుర్లు విని వుంటారు. పోలీసుశాఖ అధికారులతో అతనికి జైలులో కావలిసిన అన్ని సౌకర్యాలూ సమకూర్చమని నేనే స్వయంగా చెప్పాను. ఆయన ప్రభుత్వానికి పక్కలో బల్లెంలాంటి వారు. నువ్వు కూడా ఆ మాట కాదనవనుకుంటాను. యువకులను ప్రధాన మంత్రిపై తిరగబడమని ఆయన ఉసిగొల్పాడు. అంత త్వరగా ఆయన్ని జైలు నుంచి విడుదల చేసే అవకాశాలు ఏ మాత్రం లేవు. ఒక వేళ విడుదల చేసినా వచ్చే ఎన్నికల తరవాతే! ఈలోగా కుదరదు. ఆయన్ని గౌరవంగా చూడమని నేను మళ్ళీ చెబుతాను. ఆయన గుండె జబ్బు తగ్గటానికి అవసరమైన మందులన్నింటినీ ఇవ్వవలసిందిగా జైలు డాక్టరుతో చెబుతాను" అంది మానసి కంఠాన్ని మృదుమధురంగా మార్చుకొని.

"ఇప్పుడు మనం పరస్పరం వ్యతిరేక వర్గాల్లో వున్నాం మానసి మిత్రా గారూ! అందువల్ల మనం ఏమంత ఎక్కువసేపు మాట్లాడుకొనే అవకాశం లేదు. నేను చెప్పదలచుకొన్నదేదో చెప్పాను. జైలులో కామ్రేడ్ కృష్ణమూర్తి కేమన్నా ప్రాణాపాయం కలిగితే, ఆ తర్వాత మీరు ఎదుర్కోవలిసిన పరిస్థితులు చాలా దారుణంగా వుంటాయి. ఈ చిన్న విషయాన్ని మీరు జ్ఞాపకం వుంచుకోండి" అన్నాడా వృద్ధుడు నవ్వుతూ.

"కాఫీ తెప్పిస్తాను వుండండి" అంది మానసి వెల వెల బోతూ. ఆ గుంపు ద్వేషంతో, కసితో మండి పడుతున్నారు. తానేమో ఒంటరిది. కామ్రేడ్ బినో "వెళ్ళి వస్తాం" అని చెప్పి బయటకు నడిచాడు. మిగిలినవారు అతనిని అనుకరించారు.

మానసి చిగురు టాకులా వణికి పోసాగింది. రచయిత్రికి జీవితం అనుభవంలోకి వచ్చింది. చెట్ల పైన ఆవరించినా చీకటి చిరిగి పేలికలయిన వస్త్రం లా వుంది. ఆకాశంలో వున్న నక్షత్రాలు చెట్లకింద నుంచి బిచ్చగాళ్ళు తడిపి ఆరేసుకొన్న చింకి పాత చిరుగుల మాదిరిగా కనిపించాయి.




చదరంగం ఆడుతూ నిర్లక్ష్యంగా ఎతులు వేసి ఒంటిమీద ఉన్న చొక్కా తప్ప సర్వస్వం కోల్పోయినట్లయింది ప్రధాని పరిస్థితి. అందుకే మాటిమాటికీ మంత్రి వర్గాన్ని పునర్వ్యవస్థీకరిస్తున్నారు. మానసి హోంమంత్రిత్వశాఖను చేపట్టటంతో దగాకోరులైన పారిశ్రామికవేత్తలు తృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు. కాని వారు అలా ఎంతో కాలం ఉండలేక పోయారు. ఆ తరువాత ఆమె తమకు నెత్తి మీద కుంపటిలాంటిదని అర్థమయి పోయింది.

అన్ని ప్రభుత్వ కార్యాలయాలలోనూ పెద్ద ఎత్తున ప్రక్షాళనా కార్యక్రమం ప్రారంభమయింది. ఏదో ఒక సమయంలో పెట్టుబడిదారుల అడుగులకు మడుగులొత్తిన పెద్దపెద్ద అధికారులంతా ప్రమాదకరమైన వ్యక్తులుగా పరిగణింపబడ్డారు. అలాంటి అధికారులలో ఒకడైన అమోల్ మిత్రా పై అధికారి మిహిర్ బందోపాధ్యాయను అరెస్టు చేశారు.

మిహిర్‌ను అరెస్ట్ చేశారనే వార పేపర్లో చదవగానే అమోల్ మనసులో ఇబ్బందిపడ్డాడు. ఈ దురదృష్టకర సంఘటనకు తానే బాధ్యుడని మిహిర్ భార్య బసంతి ఆరోపిస్తుందని అతని భయం. మానసి భర్తగా అమోల్ మిత్రా హోంమంత్రిని అడిగాడు తన బాల్య స్నేహితుడిని విడిచిపెట్టమని. కాని అవేమీ మిహిర్‌ని రక్షించలేకపోయాయి.

మిత్రా మాటలను మానసి వినిపించుకోలేదు. ఆమె రాజకీయాల్లో దిగాక అతని పరిధిలోంచి ఎప్పుడో దూరంగా కొట్టుకుపోయింది. అమోల్ ఇప్పటికీ అతి సామాన్యుడుగానే కొట్టుమిట్టాడుతూ ఉండగా, ఆమె మాత్రం అదృష్టమనే ధగధగలాడే మరో గ్రహం మీదకు దూసుకుపోయింది. కనీసం భర్తకు ఉత్తరాలుకూడా రాయటం మానేసిందామె.

ఆ మధ్య ఓసారి భర్తతో ఫోన్లో మాట్లాడింది మానసి. సుపర్ణకు ప్రధాన మంత్రి కొడుకుతో పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నాని చెప్పింది. అతను వెంటనే "ఊ" అనేశాడు. ఆమె అనుకున్నదేదో చేస్తుందితప్ప తానేమైనా చెప్పినా విని పించుకోదని అమోల్‌కు తెలుసు. "బచ్చూకి ఇష్టమైతే నాకేం అభ్యంతరం లేదు" అన్నాడతను. సుపర్ణని తలమునకలుగా ప్రేమించిన సైరస్‌ను ఊరడించటం పెద్ద సమస్యకాదు. ఆ విషయం తరవాత చూసుకోవచ్చు.

మిత్రా ఆఫీసు నుంచి ఇంటికి వచ్చేసరికి తన గదిలో మానసి కూర్చుని ఉంది. హఠాత్తుగా ఆమెను చూసేసరికి

సంతోషం పట్టలేకపోయాడు "ఓ హో హో ! మానసీ నువ్వా !" అన్నాడతను ఆశ్చర్యపోతూ! ఆమె ముఖం వాడిపోయి ఉంది. ఏదో కలత చెందినట్టుగా కూడా ఉంది. "ఏమిటలాఉన్నావ్? ఏం జరిగింది? ఎందుకంత బాధపడుతున్నావ్?'' అమోల్ ఆమె చెక్కిళ్ళు నిమిరాడు.

ఆమె సుపర్ణ గురించి చెప్పగానే అమోల్‌కు స్పృహ తప్పిపోతున్నట్లని పించింది. ఆ క్షణంలో రకరకాల ఆలో చనలు, ఉద్రేకాలు అతనిని ఉక్కిరి బిక్కిరి చేశాయి. విజయ్‌ని చంపెయ్యా లన్నంత కోపం వచ్చింది. కాని స్థిమిత పడి కోపాన్ని అణుచుకొని "మనూ!అనవ సరంగా బాధపడకు. అన్నీ అవే సర్దు కుంటాయి నన్ను కూడా కొంచెం ఆలో చించనీ ఏం చెయ్యాలో?" అన్నాడు తాను బాధపడుతున్నామానసిని సముదాయిస్తూ.

"సుపర్ణని ఈ స్థితికి దిగజార్చానని నువ్వు లోలోపల బాధపడటం లేదూ? అమోల్! నా మీద నాకు అసహ్యం కల గటం లేదూ ? నేను ఢిల్లీ వెళ్ళి ఉండక పోతే నా బచ్చూకి ఇంత ఖర్మ పట్టేది కాదు" మానసి కన్నీళ్ళు పెట్టుకుంది.

"మనూ ! మనమంతా భగవంతు. చేతుల్లో కీలు బొమ్మలం" అన్నాడతను. ఒకప్పుడు అమోల్ అదేమాట అన్నప్పుడు మానసికి భరించలేనంత కోపం వచ్చింది. కాని ఇప్పుడు ఆ మాటలే నిజమని పించాయి. బహుశా దేవుడనేవాడు ఉండే ఉంటాడు. అతను ప్రధాన మంత్రి కంటే ఎక్కువ శక్తి వంతుడేనేమో ! తనను తానే అసహ్యించుకుంది మానసి "నే నెంత పాపిష్టిదాన్నైపోయాను" అంటూ గుసగుసలాడింది అమోల్ చెవిలో అతని మెడని ముద్దు పెట్టుకుంటూ. కాద న్నట్టు తలూపుతూ "లేదు మనూ! లేదు. నాకు నువ్వెప్పటికీ ప్రేమాస్పదురాలివే" అన్నాడు అమోల్.

సుపర్ణని కాలేజీ హాస్టల్ నుంచి ఇంటికి తీసుకువచ్చారు. కాని అమె ఏదో మానసికోద్రేకంలో మునిగిపోయింది. విమానాశ్రయం నుంచి ఇంటికి వచ్చే వరకూ ఆమె వెక్కివెక్కి ఏడుస్తూ ఏదో గొణుగుతూనే ఉంది.

"నా కూతురు పాడయిపోవటం నేను సహించలేను" అంది మానసి సుపర్ణతో బెదిరిస్తున్నట్టుగా. "కాని నీ కూతురు పసిపిల్ల కాదు.నిరాకారంగావున్నపాపాన్ని నేను. నాకు ఏమీ అక్కర్లేదు. విజయ్‌ని నేను గాఢంగా ప్రేమించాను. అతని వార సుడుకి నేను జన్మనివ్వాలి! ఏమైనాసరే ! అది జరిగితీరాల్సిందే ! విజయ్ నాకు పిన తండ్రయినా సరే ! ఆఖరికి నా సొంత తండ్రి అయినా నాకు పట్టింపు లేదు" మొండిగా వాదించింది సుపర్ణ.

ఆ పరిణామానికి అమోల్ కంపించి పోయాడు. సుపర్ణ చేతిని తన చేతిలోకి తీసుకొని ఆమెను సముదాయించ బోయాడు. "బచ్చూ! మీ అమ్మ చెప్పింది విను. పెళ్ళి కాకుండా తల్లివి కావటం బావుండదు" నచ్చ చెప్పాడు అమోల్.

"బాబా! నువ్వుకూడా అలాగే అంటు న్నావా ? నువ్వుకూడా అమ్మ పక్షం చేరి పోయావా ? అబార్షన్ చేయించుకుని నా బిడ్డను నన్నే చంపెయ్యమంటావా ?"

"విజయ్‌కూడా అలాగే చెప్పాడు బచ్చూ!"

"ఏమిటీ! విజయ్ ఆ మాట అన్నాడా? నన్ను అబార్షన్ చేయించుకోమని చెప్పాడా ?" ఆశ్చర్యపోయింది సుపర్ణ.

"అవును చెప్పాడు అతను రేపు ఇక్కడికి వస్తున్నాడు నిన్ను ఒప్పించటానికి" తల్లి చెప్పింది. "ఛీ! వాడి మొహం నేను చూడను" అంది సుపర్ణ చీదరించుకొంటూ.

"మరి నువ్వు అతన్ని ప్రేమించానన్నావ్!" అడిగింది మానసి తొందరపాటును అణుచుకోలేక.

"అది ఇదివరకటి మాట! ఇప్పుడు కాదు. ఇంకెప్పుడూ అతని ఊసే ఎత్తను. నిలువెల్లా విషం ఉన్న దుర్మార్గులని నేనెప్పుడూ అభిమానించ లేను" విజయ్‌ని అసహ్యించుకుంది సుపర్ణ!

మానసి పెద్ద పెట్టున గలగలా నవ్వింది. "నువ్వు విజయ్‌ని మంచివాడనుకున్నావా? ఆదర్శపురుషుడనుకొన్నావా? అతనితో ప్రేమలో పడేటప్పుడే నన్ను అడిగిఉంటే విజయ్ ఎలాంటివాడో కథలు కథలుగా పూస గుచ్చినట్లు చెప్పేదాన్ని కదా నేను"

"విజయ్‌ని నువ్వు ప్రేమించినపుడు, వాడి వలలో పడినపుడు నువ్వు ఎవరి సలహా తీసుకున్నావ్!" ఎగతాళిగా తల్లిని రెచ్చగొట్టింది సుపర్ణ. "బచ్చూ! ఏమిటా మాటలు? పెద్దా చిన్నా ఉండక్కర్లా! ఏమిటలా దెబ్బలాడు తున్నావ్?" మందలించాడు మిత్రా.

సుపర్ణ తండ్రి హృదయం మీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడవసాగింది. అతను కూతురి కురులను సర్దుతూ "సుపర్ణా! ఊరుకో! ఏమిటది?" అన్నాడు. మెల్లిగా ఆమెను పూశిరడిస్తూ.

అప్పటికి వాళ్ళు ఇంటికి ఇంకా చాలా దూరంలో ఉన్నారు. కారు నిశ్శబ్దంగా పరిగెడుతోంది. మానసి నిస్త్రాణగా, నిస్సహాయంగా, నిశ్శబ్దంగా కూర్చుని ఉంది. నిస్తేజంగా ఉన్న మానసి మొహాన్ని కారు అద్దంలోంచి గమనించాడు మిత్రా. సుపర్ణ మీదకంటే, మానసి పైనే ఎక్కువ జాలిపడ్డాడతను.




విజయ్‌రాజే పూనా దిక్కుగా కారును మహావేగంగా నడుపుతున్నాడు. అతని ఎడమవైపున మానసి కూర్చుని ఉంది. ఆ రోజున జరిగిన సంఘటనల నన్నింటినీ ఆమె నెమరు వేసుకొంది. మొదట సుపర్ణ ఇంట్లో కనపడలేదు. ఆ తరవాత సైరస్ కూడా కనిపించటం లేదని తెలిసింది.

తీవ్రంగా ఎంక్వైరీ చేసి సుపర్ణ, సైరస్‌లు పూనా వెళ్ళారని పోలీసులు నిర్ధారించుకున్నారు. ఆ విషయం మానసికి తెలిసేసరికి మధ్యాహ్నం అయింది. విజయ్ కూడా మానసితో పాటు పూనా వస్తానన్నాడు. అక్కడే ఓ హోటల్లో సుపర్ణ, సైరస్‌లు ఉన్నట్టు వారికి సమాచారం అందింది.

హోటలు ముందు కారు దిగీ దిగకుండానే పోలీసులు చెప్పిన నెంబరున్న గదివైపు ఒక్క ఉదుటన పరిగెత్తింది మానసి. దబదబా తలుపులు బాదింది. హోటలు మేనేజరు వచ్చి ఏదో చెప్పబోయాడు కాని అతన్ని విజయ్ దురుసుగా పక్కకు నెట్టేశాడు.

సైరస్ తలుపులు తెరిచాడు. అతను

నీలం రంగు టీ షర్టు, పైజమా వేసుకుని ఉన్నాడు. "మా సుపర్ణ ఎక్కడుంది?" అంటూ మానసి గదిలోపలికి వెళ్ళబోయింది.

మానసి వెనక నిలబడి ఉన్న విజయ్‌ని తీక్షణంగా చూసి "ఊహూఁ!" అన్నట్టు సైరస్ తలూపాడు. "మీరెవరూ లోపలికి రావటానికి వీలులేదు. సుపర్ణకి మిమ్మల్ని చూడటం ఇష్టం లేదు" అన్నాడతను.

"నువ్వెవడివి ఆమె తరఫున జవాబు చెప్పటానికి?" బెదిరిస్తున్నట్టు గట్టిగా అని అతన్ని వెనక్కి గెంటబోయాడు రాజ్. సైరస్ విజయ్ చేతులు బలంగా పట్టుకొని "నేనెవర్నా? ఆమె భర్తని! ఇవాళ పొద్దున్నే మా ఇద్దరికీ పెళ్ళయిపోయింది" అన్నాడు తీక్షణంగా. "నాన్సెన్స్! పిచ్చి పిచ్చిగా మాట్లాడకు" హుంకరించాడు విజయ్. మానసి కుప్పలా కూలిపోయింది. దుఃఖాన్ని అణుచుకోలేక పోతోందామె.

"సుపర్ణ ఇప్పుడెక్కడ ఉంది? ఒక్కసారి దాన్ని కళ్ళారా చూడనీ" అంది మానసి ప్రాధేయపడుతున్నట్టుగా.

సుపర్ణ లోపలిగదిలోంచి బయటకు వచ్చింది. ఆమె కూడా సాధారణ దుస్తుల్లోనే ఉంది. "అవునమ్మా! ఇవాళ పొద్దున్నే మేమిద్దరం పెళ్ళి చేసేసుకున్నాం"

"మేము నిన్ను ఇంటికి తీసుకువెళ్దామని వచ్చాం! నిన్ను బలవంతంగా లేవదీసుకు వచ్చినందుకు ఈ కుర్రవెధవని అరెస్టు చేయిస్తాను" అరిచాడు విజయ్.

"నువ్వు ఉచ్చనీచాలు లేని రాజకీయాల ముసుగులో పొర్లే కుక్కవి. రాస్కెల్! గెటౌట్! ఫో ఇక్కడినుంచి" కోపంతో బుసలుకొడుతూ సైరస్ దఢాలున తలుపు మూసేశాడు.

మానసి హోటలు గదిలో ఉన్న పెద్ద మంచం కోడుమీద కూర్చుంది. బయటనుంచి విజయ్ కోపంగా తలుపులు బాదుతూనే ఉన్నాడు. సుపర్ణ, సైరస్ చేయి చేయి పట్టుకొని మానసి దగ్గరకు వచ్చి నిలబడ్డారు.

"అమ్మా! నేను ఆ తుచ్ఛుడి మొహం చూడలేను. నన్ను అర్థం చేసుకోలేవూ!" అంది సుపర్ణ దీనంగా. "కాని ఇప్పుడు నీకు నెలలు కదా!" భోరున ఏడ్చింది మానసి.

"అవును! పుట్టే బిడ్డ మా సంతానమే అవుతుంది. సుపర్ణ ఎప్పటికీ నాభార్యగానే ఉంటుంది. నేనుండగా పుట్టబోయే బిడ్డకు తండ్రి లేకుండా ఎలా పోతాడు?" సైరస్ భరోసా ఇచ్చాడు.

"సుఖీభవ" అంటూ దీవించింది మానసి ఆ కొత్త దంపతుల్ని. ఆమెకు అంతకు ముందు రోజున "అన్నీ అవే సవ్యంగా చక్కబడతాయి" అన్న అమోల్ మాటలు జ్ఞాపకం వచ్చాయి.

"మీ బాబా నీకోసం బెంగ పెట్టుకొన్నారు బచ్చూ! మనం వెంటనే ఇంటికి వెళ్ళి ఆయనకు నీ పెళ్ళిగురించి చెప్పిద్దాం!" ఆప్యాయంగా అంది మానసి సుపర్ణతో. కూతురు తల్లి భుజాల చుట్టూ చేతులువేసి ప్రేమగా కౌగలించుకొంది. సైరస్‌కు కూడా ఆనందంతో కళ్ళు తడయ్యాయి.

వెంటనే సైరస్ బట్టలు సర్దటం ప్రారం

భించాడు. "మన పెళ్ళి సర్టిఫికెట్టును మాత్రం మరచిపోకు" అంది సుపర్ణ. సైరస్ ఉత్సాహంగా నవ్వాడు. ఎంతో స్వేచ్ఛగా ఉన్నట్టు అనిపించింది.




వాళ్ళు బొంబాయి చేరే సరికి మానసి ప్రైవేట్ సెక్రటరీ ఆమెకోసం ఆత్రుతగా ఎదురుచూస్తున్నాడు. "ఇవాళ సాయంత్రం అయిదింటికి హఠాత్తుగా ప్రధానికి పక్షవాతం వచ్చింది. ఆయన మాట కూడా పడిపోయింది. విల్లింగ్టన్ ఆసుపత్రిలో చేర్పించారు. మీరు వెంటనే ఢిల్లీ వెళ్ళాలి ఇప్పుడు" చెప్పాడు సెక్రటరీ.

విజయ్ ముఖం వాడి పోయింది. అంటే దీనర్థం మానసి తాత్కాలిక ప్రధాని కాబోతోందనా? విజయ్‌ని ఎందుకు పిలవ లేదు ఢిల్లీ రమ్మని? పార్టీలో ఉండే పెద్దలు అతనికి వ్యతిరేకంగా ఉన్నారా? "రేపొద్దున్న ఢిల్లీ వెళ్ళటానికి రెండు విమానం టిక్కెట్లు రిజర్వు చేయించు" చెప్పాడు విజయ్ మానసి సెక్రటరీతో. 'నేను కూడా వెంటనే ఢిల్లీ వెళ్ళి ప్రధాని పరిస్థితి ఎలా ఉందో చూడాలి' అనుకున్నాడతను.

"హోంమంత్రిగారి కోసం ఢిల్లీ నుంచి ఓ హెలికాప్టరు వచ్చింది" చెప్పాడు సెక్రటరీ. ఏంచెయ్యాలో తోచని పరిస్థితుల్లో "మానసీ! నువ్వువెళ్ళక తప్పదా? రేపొద్దుటి వరకు ఆగలేవా!" అని అడిగాడు అమోల్. "లేదు! ఇప్పుడు నేను అక్కడ తప్పకుండా ఉండి తీరాలి" అంటూ గబ గబా తన గది లోకి వెళ్ళి పోయింది మానసి.

అప్పుడు ఆమె మనసులో తన చిరకాల వాంఛితం మాత్రమే మెదిలింది. "ఎప్పటికైనాసరే ఈ దేశానికి అధినేతను కావాలి" అనుకొనేదామె ఇదివరలో. తనని గాఢంగా ప్రేమించి, తన చేతుల్లో కీలు బొమ్మగా వ్యవహరించిన ప్రధాని ఇప్పుడు నిస్సహాయంగా నిర్వీర్యుడై మంచం మీద పడి ఉన్నాడు. ప్రధాన మంత్రి కావలసిన అర్హత విజయ్‌కి లేదని పార్టీ ప్రముఖులు భావించారు. మానసికి మాత్రమే అందుకు తగిన సామర్థ్యం ఉంది. ఆమె జుట్టును హడావుడిగా దువ్వుకొని పెదవులకు లిప్‌స్టిక్ పూసుకొని ఢిల్లీ వెళ్ళటానికి సిద్ధమయింది. హెలికాప్టరు అప్పటికే ఆమె కోసం ఎదురు చూస్తోంది.

ఢిల్లీ విమానాశ్రయంలో మానసిని ఆహ్వానించటానికి అధికార పార్టీలో వున్న ప్రముఖులు, మంత్రులు అంతా వచ్చారు. రాత్రి పదకొండయినా ఎవరూ నిద్రపోయినట్లు లేదు. మానసి సరాసరి ఆసుపత్రికి వెళ్ళి అశాంతిగా పడి ఉన్న ప్రధానిని చూసింది. "ఈయన స్పృహలో ఉన్నారా?" అక్కడే ఉన్న డాక్టరును అడిగింది మానసి. "లేదు! నిద్రపోతున్నారు. మత్తు ఇంజక్షన్ ఇచ్చాం! కొన్ని గంటల వరకు ఆయన పరిస్థితి అలాగే ఉంటుంది" చెప్పాడు

మానసి వెంటనే తన ఇంటికి వెళ్ళింది.

తాను ప్రధాన మంత్రి అయ్యాకఇప్పుడు ప్రధాని ఉంటున్న నివాసంలో తనకు అనుగుణంగా ఎలాంటి మార్పులు చేయ వలసి ఉందో ఆలోచించసాగిందామె. 'ఖద్దరు తెరలకు బదులు బెల్జియం నుంచి పట్టు జలతారు తెరలు తెప్పించాలి' అనుకొంది తనలో తనే. 'దేనికైనాసరే డాబు సరిగా ఉండాలి... లేకపోతే మనల్ని పట్టించుకొనేదెవరు ?' భవిష్యత్తులో తానుండబోయే భవనం లోపలి గదుల్లో ఎలాంటి అలంకరణలు చేయాలో ఆలోచిస్తూ అద్దం ముందు కూర్చుంది. ఇంకా సేపటిలో నిద్ర పోవటానికి ఉపక్రమించబోతున్నా ఒత్తుగా ఉన్న కురుల్ని దువ్వుకొంటూ ఎందుకో అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసి నవ్వుకుంది మానసి. ★



# అసాధారణ హత్య

బల్గేరియాకు చెందిన మార్కోస్టు అనే వ్యక్తి బి. బి. సి. లో కార్యక్రమ నిర్వాహకుడు. ఒకరోజున ఉదయం పద కొండు గంటలకు బి.బి.సి. స్టేషన్‌కు వడి వడిగా నడిచిపోతున్న మార్కోస్టుకు హఠాత్తుగా కాల్లో ఏదో ముల్లుగుచ్చుకున్న ట్లయింది. సరిగ్గా అదే సమయంలో ఓ గొడుగు నేలమీదపడిన శబ్దం వినిపించింది. గొడుగు జారవిడిచిన వ్యక్తి 'సారీ' అన్నాడు. ఫరవాలేదులెండి అని చెప్పి మార్కోస్టు ఆఫీసు కెళ్ళిపోయాడు



అయితే ఆ రాత్రి పది గంటలకు మార్కోస్టు భార్యతో పిచ్చాపాటి మాట్లాడుతూ ఆనాటి ఉదయం ఎవరో పెద్ద మనిషి తన వెనక నడుస్తూ తన కాలిమీద గొడుగును పడేసి తనకు క్షమాపణలు చెప్పుకున్న విషయం కూడా చెప్పాడు.

కానీఅంతలోనే అతనికి శ్వాస పీల్చడం కష్టమై పోయింది. భార్య కంగారు పడి డాక్టర్‌కు ఫోన్ చేసింది. డాక్టర్ వచ్చేలోపలే మార్కోస్టు ప్రాణాలు వదిలాడు.

కానీపోస్టుమార్టమ్ జరిగిన తర్వాత మార్కోస్టు మరణం చాలా అసాధారణ మయిందని అభిప్రాయపడ్డారు. ఆ సమ యంలో అతని భార్యకు అతను చెప్పిన గొడుగు సంఘటన గుర్తువచ్చి ఆ విష యాన్ని డాక్టర్లకు చెప్పింది. వెంటనే డాక్టర్లు మార్కోస్టు కాళ్ళను పరీక్ష చేశారు.

అప్పుడువాళ్ళకు అతని కుడికాలిలో గుండుసూది తలలో సగం పరిమాణం వున్న ఓ చిన్న గోళం దొరికింది. దానికి రెండు రంధ్రాలు న్నాయి! వాటిల్లో అతి ప్రమాదకరమైన విషం కూర బడి ఉంది.

అయితే ఆరంధ్రాలు మైనంతో మూసి వేయబడి ఉన్నాయి.

అలా శరీరంలోకి ప్రవేశించిన ఆ గోళా నికి పూసిన మైనం శరీర ఉష్ణోగ్రతకు కరిగి పోతుంది.

అలాగేఅప్పుడు లోపలున్న విషం క్రమంగా రక్త ప్రవాహంలో కలిసి ప్రాణాపాయం కలిగిస్తుంది. ఇదీ జరిగిన విషయం. మార్కోస్టు బి.బి.సి. ద్వారా బల్గేరియన్ రాజకీయ నాయకుల బండార మంతా బట్టబయలు చేయడమే అతను హత్య గావింపబడటానికి కారణం.

# పరిశోధన

ముప్పయిఅయిదు భాషల్లో నిష్ణాతుడైన డాక్టర్ సిద్ధేశ్వర వర్మకి తొంభై రెండేళ్ళ వయసులో ఓ పెద్ద సమస్య వచ్చిపడింది. ఆయనగారు ప్రపంచ ప్రఖ్యాతి పొందిన 'శిలప్పదికారం' అనే తమిళ గ్రంథాన్ని ఉర్దూలోకి అనువదిస్తున్నారు. దాన్లో రెండు పేరాలకు సరైనఅర్థాలు లేక తమిళ భాషకు సంబంధించిన పరిశోధనలో రెండేళ్ళ నుండీ నిర్విరామ కృషి చేస్తున్నారు. అన్ని భాషల పట్ల ఆయనకు ఉన్న ఆసక్తి, ప్రేమాభిమానాలకు 'సప్తబ్రహ్మ' బిరుదిచ్చి గౌరవించారు కూడా!



భాషా పరిశోధనకు పూనుకున్న యాభై ఏళ్ళలోనూ ఆయన రాసిన పుస్తకాలకి లెక్కే లేదు. ఎప్పుడూ పుస్తకాల మధ్య పరిశీలనలో మునిగివుండే వర్మగారు యువక విద్యార్థిలా కనిపిస్తారు. డబ్బుకోసం కాక కేవలం భాషాభిమానంతోనే ఆయన అన్ని పుస్తకాలు రాశానంటారు.

తెల్లవారుజామునే లేచి రెండు గంటలసేపు యోగాసనాలు వేసే వర్మగారి ఆహారం పళ్ళు, తేనె, రొట్టె, కూరలు, పెరుగు మాత్రమే! అతనింతవరకు 'టీ' రుచి ఎరుగరట.

అయితే ఆయనకింత వయసులోనూ కళ్ళజోడుతో అవసరం లేదంటే తమాషాగానే ఉంటుంది.

1941లో జమ్ము వేల్స్ కాలేజీలో సంస్కృతోపన్యాసకుడుగా పనిచేసి రిటైర్ అయ్యారు.

భాషా పరిశోధనకి తన కాలాన్ని వెచ్చించిన వర్మగారు ఎన్నో సైన్సు సంబంధమైన పుస్తకాలను హిందీలోకి తర్జుమా చేశారు. మన వేదాల గురించి వివరించిన ఇంగ్లీషు, జర్మనీ, ఫ్రెంచి భాషా గ్రంథాల పట్టికను తయారు చేశారు.

జీవితంలో ఓసారి హిమాలయ ప్రాంతాలకు వెళ్ళి గిరిజనుల భాషా రహస్యాల్ని ఛేదించిన ఆయనకి 140 ఏళ్ళు జీవించాలని కోరికగా ఉందిట. తన ఎనభై తొమ్మిదో ఏట ఆయన గిరిజన భాషను నేర్చుకున్నారట.

తన జీవిత కాలంలో ఇంకా ఎన్ని భాషల్ని నేర్చుకుంటారో ఆ సప్తబ్రహ్మగారు!

# పావురాలకు లెన్సు

కళ్ళజోడు వల్ల అందం చెడుతుందని, ఎక్కువ వయస్సు వారిలా కనిపిస్తామని చాలామంది కళ్ళజోడు జోలికి పోకుండా 'కాంటాక్టులెన్స్' ఉపయోగిస్తున్నారిప్పుడు.

పక్షులు ఓ ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి వలసపోతాయి. అలా వలస వెళ్ళి తిరిగిరాని పెంపుడు పావురాలను అన్వేషించడం చాలా కష్టసాధ్యమైన పని అని శాస్త్రజ్ఞులు ఓ కొత్త పద్ధతి కనిపెట్టారు.



గూడు విడిచి సముద్రాలు దాటి వెళ్ళిపోకుండ పావురాలకు ఓ రకమైనకాంటాక్టు లెన్స్ పెడుతున్నారు. కొత్త ప్రదేశానికి వెళ్ళిన పావురాలు ఈ లెన్సువల్ల ఆ పరిసరాలు స్పష్టంగా కనిపించక తిరిగి వచ్చి గూళ్ళకు చేరుకుంటాయి.

లండన్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ డా॥థాంసన్ తను రాసిన 'ఏనిమల్ నేవిగేషన్' పుస్తకంలో పై విషయాన్ని అద్భుత ప్రయోగంగా పేర్కొన్నాడు.

రాత్రిళ్ళు చంద్రగమనాన్ని. భూమ్యాకర్షణ శక్తినీ బట్టి పక్షులు చాలా దూరం ప్రయాణం చేస్తాయనీ, పగలు సూర్యుడు దిక్సూచిలా ఉపయోగిస్తాడనీ, కొన్ని పక్షులు పొగ మంచులోనూ, కలుషిత వాతావరణంలోనూ వలసపోవనీ అంటాడాయన. పక్షులు వలసపోకుండా వాతావరణాన్నే మార్చేస్తారేమో శాస్త్రజ్ఞులు!

# అరేబియన్ అద్భుతం

అరేబియాలో ఒక గల్ఫ్ రాష్ట్రమైన 'అబూదబీ' పాలకుడు షేక్‌జవేద్ కోరికపై బ్రిటీషు వాస్తుశాస్త్ర నిపుణులు కొందరు పెద్ద చేప ఆకారంలో భవనం నమూనా వేసి ఇచ్చారు. దాన్ని అధికారులు ఆమోదించారు.

ఆ నమూనా ప్రకారం నిర్మించే కట్టడం 850 అడుగుల ఎత్తు, 20,000 టన్నుల బరువు కలిగి అరేబియన్ గల్ఫ్‌నుండి ఎంతో పైకి లేచిన చేప ఆకారంలో ఉంటుంది.

ప్రపంచంలోని నాలుగు గొప్ప ఎత్తయిన కట్టడాల్లో ఒకటిగా ప్రసిద్ధి గాంచగల ఈ కట్టడం తళతళ మెరిసే కాంక్రీటు, గాజుతో నిర్మితమై ఎన్నో మైళ్ళ దూరానికి కనిపించ గలదని అంచనా.

ఈ స్థూపం కింది భాగంలో ఓ చేపల ఫారం, హోటలు, చూసేందుకు నీటిమీద

తెలుతున్నట్లు భ్రాంతి కలిగించే మసీదు ఉంటాయిట.



ప్రజల కోసం రెండు రకాల ప్రవేశం ఉంటుంది. సముద్ర మట్టానికి నూరు అడుగుల ఎత్తులో ఒక ప్రవేశ మార్గం. అందులో అల్పాహారశాల, సముద్రపు గాలుల్ని ఆస్వాదించేందుకు వీలుగా గాలరీలు, మ్యూజియం, పక్షుల గూడు, ప్లానెటోరియం ఉంటాయి.

సముద్ర మట్టానికి 700 అడుగుల ఎతున రెండవ ప్రవేశ మార్గం. అందులో రొటేటింగ్ రెస్టారెంటు, ఎక్కువ గాలరీలు, టెలిఫోన్ సౌకర్యాలు ఉంటాయి.

ఇవేగాక 750 అడుగుల ఎతున షేక్ జవేద్‌గారి పేరున చాలా ఖరీదైన పక్షుల గూడు ఒకటి వుంది. అక్కడకు ప్రత్యేకంగా విచ్చేసే ప్రముఖ వ్యక్తుల కోసం అది కేటాయిస్తారుట.

ఈ స్థూపానికి మొత్తం 6 కోట్ల 80 లక్షల డాలర్లు ఖర్చు అవుతుందనీ, ఈ ఏడాదిలోనే నిర్మాణం ప్రారంభమయ్యే ఈ కట్టడం 1982 నాటికి పూర్తి కాగల దని అంచనా.

# మొసళ్ళతో కుస్తీ

బాంకాక్‌లో పొట్టిగా వుండే 'కింసెంగ్' మల్లయుద్ధ వీరుడిలా తన శరీరాన్ని దృఢంగా పెంచి, యాత్రికుల వినో దార్థం, రోజూ భయంకరమైన మొసళ్ళతో కుస్తీ పట్టడమే తన జీవనోపాధిగా పెట్టు కున్నాడు.

మొలకు పహిల్వాన్ లంగోటా, మెడలో ఓ లక్కీ గొలుసు ధరించి, చేతిలో ఓ గట్టి కర్రతో మొసళ్ళను బెది రిస్తూ తనని కాపాడుకుంటుంటాడు.

బాంకాక్ నగరం వెలుపలవున్న మొసళ్ళ ఫారంలో ఇతను ఒకేసారి యాభై మొసళ్ళతో హోరాహోరీగా పోరాడ్డం, వాటిని అదిలించి తన అదు పులో వుంచుకోవడం యాత్రికులకు ప్రత్యేక ఆకర్షణ. వారు వేలంవెర్రిగా



ఫొటోలు తీసుకుంటుంటారు.

తమని అదుపులో వుంచే కింసెంగ్

మీద మొసళ్ళ కేమాత్రం దయలేదన దానికి, అతని ఒంటిమీద వున్న దెబ్బలు, గాయాల తాలూకు గుర్తులే నిదర్శనం. ఏవో చిన్న చిన్న దెబ్బలేగాని, పెద్దవైన మొసళ్ళకోరలు, తోక దెబ్బలనుండి-తన చేతికర్రతో చాలా నేర్పుగా తప్పించు కుంటాడు మొసళ్ళ పహిల్వాన్.

అతను వాటి పక్కనే నృత్యం చేయడం, వాటి వీపులపై కాళ్ళు పెట్టడం చేస్తాడుగాని వాటి తోకలు, పళ్ళ విష యంలో చాలా మెలకువగావుంటాడు.

దీనివల్ల అతనికి వారానికి 30 అమెరికా డాలర్లు, కోట్లకొద్దీ ఫొటో ఆల్బముల్లో స్థానం లభిస్తాయి. మొసళ్ళతో కుస్తీ పట్టడమంటే ప్రాణాలతో చెలగాటమేకదా!

# వింత వీలునామా

బ్రెజిల్‌కుచెందిన కోటీశ్వరుడు డొమింగో కొరియా చచ్చిపోయి పెద్ద తంటా తెచ్చిపెట్టాడు. అసలు చిక్కు ఆయన గారు రాసిన వీలునామాతో మొదల యింది. ఎంతో గందరగోళంగా అర్థం పర్థం లేకుండా వున్న ఆ వీలునామా బహుశా ఆయన మందు కొట్టేసి మతిలేని సమయంలో రాసి వుంటాడని కొందరి అభిప్రాయం.

తన ఆస్తి యావత్తు తన దగ్గరగల పని వాళ్ళూ, ప్రాణ స్నేహితులూ మూడు తరాల పాటు అనుభవించిన తరు వాత దాన్ని బంధువులకి అప్పజెప్పాలట. ఎవరెవరికి ఆస్తిని పంచిపెట్టాలో వారి పేర్లుకూడా పెద్ద జాబితా రాశాడాయన.

బంగారు కడ్డీలు, పొలాలు, ఇళ్ళ స్థలాలు, ఇళ్ళు, బాండ్లు ఇలా ఎన్నో రకా లుగా వున్న ఆయనగారి ఆస్తి విలువ నాలుగువేల కోట్ల రూపాయలని తేలింది. ఆస్తి వివరాలతో పాటు పనివారు, స్నేహితులు, బంధువుల సంఖ్యకూడా పెరిగిపోతోంది. ఇప్పటికి దాదాపు పదివేల మంది ఆయన ఆస్తికి హక్కుదారులుగ ప్రకటించుకున్నారు.

అర్జెంటీనాలోని ఓ వార్తా పత్రిక "మీ పేరులో 'కొరియా' అన్న పదం ఉంటే చాలు మీరు డొమింగో కొరియాకి చెందిన



నాలుగువేల కోట్ల రూపాయల ఆస్తికి వారసులు అవుతారు" అని తమాషాగా ప్రకటించింది.

డొమింగో కొరియా మునిమనుమడైన మెరాండో నిజమైన వారసులెవరో కనుక్కునేందుకు లీగల్ రిసెర్చ్ చేస్తు న్నాడు. ఇతనిచ్చే లిస్టును ఆధారంగా చేసుకుని అసలైన వారసులను నిర్ధారించా లని కోర్టు ఎదురు చూస్తోంది.

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/ HD /40



# కర్కాటక రాశి

జూన్ 22 - జూలై 23

## ఉయ్యాలలో గుణింతాలు

మిగతా అన్ని రాశుల వారి సంగతీ ఒక ఎత్తు.
కర్కాటక జాతకుల సంగతి మరొక ఎత్తు. వీరిపై చంద్రగతి ప్రభావం
ఎక్కువగా ఉండడం దానికి కారణం కావచ్చు. చంద్రబింబం
ఒక్కొక్కప్పుడు మరీ కాంతిహీనంగా ఒక్కోసారి
ఎంతో ఉజ్వలంగా ఉన్నట్టే కర్కాటక జాతకులకు మూడ్స్ ఎక్కువ!

ఇక ఆర్థిక విషయాలకు వస్తే... ఉయ్యాలలో
ఉన్నప్పటినుంచీ గుణింతాలు ప్రారంభిస్తారు.
సూదంటురాయిలా ధనాన్ని ఆకర్షిస్తారు. నిశ్చలంగా
ఉంటూనే అపారంగా డబ్బు పోగు చేస్తారు.
అందుకు ఎన్నో మార్గాలు అవలంబిస్తారు.
స్టాకులు, పెట్టుబడులు, వాటాలు... మార్గదర్శిని మాత్రం మరిచిపోరు.

అది సహజం. కర్కాటక జాతకుల పొదుపరితనానికి
మార్గదర్శి ప్రోది చేస్తుంది.
వారి కలలకు వాస్తవరూపం ఇస్తుంది.

వివిధ చిట్‌లద్వారా అవసరమైనప్పుడు ఆర్థిక సహాయం అందజేసింది.
అత్యుత్తమ సేవ... అదనులో చెల్లింపు... మార్గదర్శి ప్రత్యేకతలు.

పదకొండు శాఖలతో, ఏభై వేలకు పైగా సభ్యులతో
అత్యున్నతమయిన సంస్థగా పదహారేళ్లయి
నిలదొక్కుకుని ఉండడానికి అదే కారణం.



**మార్గదర్శి**

చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

*డబ్బుకోసమేనా మీ చింత? మార్గదర్శి ఉన్నది మీ చెంత*

Kiron-MCF